శివాయ గురవే నమః.

శ్రీమాన్ పంచాంగం వెంకటాచార్యులుగారు రచించిన మాంధాతృచరిత్రమునందలిచాలభాగములు సావధానముగ వింటిని. ఇందలి భాష నిర్దుష్టము. శైలి సరళమై బాలురకును సుగమమై యున్నది. మఱియు నిందుఁ బాలోచితముగ నచ్చటచ్చట వ్యావహారిక భాష ప్రయుక్తమై యుండుట రమణీయము. కృతయుగాలంకారభూతుఁ డని పురాతనమహీపాలురలోఁ బేరుగాంచి యెల్లరకును నెన్నో విషయములం దాదర్శప్రాయుఁ డనఁదగిన మాంధాతృసార్వభౌముని చరితము నందలి ప్రధానవిషయములు, భారతము, భాగవతము, విష్ణుపురాణము, హరివంశము, ఉత్తరరామాయణము మున్నగు ప్రాచీనకృతులందు విప్రకీర్ణములై యుండ వానినెల్లఁ గ్రోడీకరించి, యుచితము లగునలంతిమార్పు లొనరించి యీగ్రంథమును వీరు సంతరించియున్నారు. ఈచరితమున సదుపదేశము లెన్నియో గలవు. ఆదినుండి తుదివఱకు నిందుఁ గథానాయకునిశీలము మిక్కిలి ప్రశంసాపాత్రముగఁ బోషింపఁబడినది. కావున నీగ్రంథము సర్వవిధముల నున్నతకక్ష్యలలోని బాలురకత్యంతోపకారకమని నాయభిప్రాయము.

దుప్పూరి వేంకటరమణాశాస్త్రి,
*Telugu Pandit*,
Narasimha Sanskrit College,
and
*Member*,
*Board of studies in Telugu*,
Andhra University.

Chittigudur,
13-10-34.

# తొలిపలుకు

అభము శుభముఁ దెలియనియనుజుల కభ్యుదయము గూర్చుట యగ్రజుల కగ్రిమవిధి. కావున జాతిమతాచారవైషమ్యంబులఁ బూని పరస్పరము ద్వేషించికొనుచు హిత మెఱుంగక యుండు నాంధ్రసోదరుల కభ్యుదయముఁ గోరి తత్కారణము లైనవిశ్వమానవసౌభ్రాత్రము, ఐకమత్యము, ఏకాగ్రత, అవ్యాజవర్తనము, ఆనృశంస్యము మొదలైనమహాగుణము లలవడ నీగ్రంథము రచించినాఁడను.

బహుపురాణాంతర్గతములై యచ్చటచ్చట సూత్రప్రాయముగఁ గన్పించు వ్యాసమహాశయుని వాక్యముల యాధారముతో నిర్మింపఁబడిన యీకథాశరీర మాంధ్రలోకమున కభినవ మనుట సాహసోక్తి కాదు. ఏతత్కథానాయకుని చరితమును సంకుసాల నృసింహకవి, కవికర్ణరసాయన మను పేర నొకప్రబంధరూపమున రచించియున్నవాఁడు. అయ్యది వర్ణన ప్రధానమై యుండుటచేఁ జరితమునందలి ముఖ్యాంశములు పెక్కు లం దుపేక్షింపఁ బడినవి. అందుఁ జూపఁబడినచరిత్రాంశములు కొన్ని యనాకరము లగుటయేగాక నాయకుని శీలమునకు విరుద్ధములనిగూడ నాయభిప్రాయము. ఇమ్మాంధాత్రుండు శీలవదగ్రగణ్యుండు. ఇట్టివాఁ డీలోకమున 'న భూతో న భవిష్యతి'. ఈక్రింది శ్లోకములవలన నీతని శీలవదగ్రగణ్యత్వము విదితమగుచున్నది.

" ఏకరాత్రేణ మాంధాతా త్ర్యహేణ జనమేజయః।
సప్తరాత్రేణ నాభాగః పృథివీం ప్రతిపేదిరే॥
ఏతేహి పార్థివా స్సర్వే శీలవంతో దయాన్వితాః।
అత స్తేషాం గుణక్రీతా వసుధా స్స్వయ మాగతా॥

(సంస్కృతభారతము - శాంతిపర్వము)

ఈయుత్తమశ్లోకునిచరిత్రమునుండి నేర్వఁదగినగుణపాఠ మెంతేని గలదు. ఇద్దాని బాలురకుఁగూడ సుబోధంబు గావలయునని పూనికతోఁ బుస్తకమును బూర్తి చేసితిని. కాని యాపూనిక యెంతవఱకు సాఁగినదో నిర్ణయింపఁజాలను. ఇందేవేని తప్పులున్నచో నాకుఁ దెల్పినఁ గృతజ్ఞతాసూచకవందనములతోఁ గైకొని వానిని రెండవముద్రణమున సవరించుకొనువాఁడ.

హాస్పేట,
4-10-34.

గ్రంథకర్త.

:0:

# మాంధాతృచరిత్రము



## మొదటి ప్రకరణము

———:o:———

శ్రీవనితామతల్లి యెదఁ జేరి యనారతము న్వసింప లో
కావళిఁ బ్రోవనెంచి మహితాత్ముఁడు విష్ణుఁడు నైజతేజముం
భూవరులందు నిల్పెనఁ బ్రభుత్వముగా నది యొప్పె నెల్లెడం
గావున మాటి పార్థివము కల్పకమై తగురీతి నీప్రజన్.



శ్రీమన్నారాయణాంశసంభూతులై సకలధరాతలంబు నిరీతికంబుగఁ బరిపాలించి ప్రసిద్ధిఁ జెందిన చక్రవర్తులలో మాంధాతృమహీపాలుం డగ్రగణ్యుండు. ఇమ్మహీశముక్తామణిని వెలువరించినది క్షత్రియగోత్రాలంకారమైన సవితృవంశము. ముక్తిదాయకంబు లగు సప్తక్షేత్రంబులలో నగ్రగణ్యం బైన యయోధ్యాపురం బిమ్మహీపురందరుని రాజధానీపురంబు. దీనిని సూర్యవంశమునకు మూలపురుషుం డైన యిక్ష్వాకుమహారా[illegible] దేవశిల్పి విశ్వకర్మ నిర్మింపఁజేసెను. అప్పురిచుట్టును సరయూతరంగిణి పరి[illegible]వృత్తిఁ బరఁగుచుండ దాని నానుకొని

చుట్టును గట్టఁబడినవరణాం బరిజనాభేద్యమై “అయోధ్య” నామము సార్థకము చేయుచుండెను. అచటి వరుసలుతీర్చి సొబగుమీరఁ గట్టినసమున్నతసౌధరాజియు, నుభయపార్శ్వముల నొద్దికతో వెలయురాజతప్రదీపస్తంభంబులు వానిచెంత సుమనోమనోహరలతావృతచంద్రకాంతవేదికలును గలిగి పటికపుఱాలు గలుగుటచేఁ జిందినక్షీరంబులనైతము సేకరింపఁ దగిన ట్లతిస్వచ్ఛములై యుండురాజమార్గములు, శృంగాటకములకు నలువైపులందు విచ్చుమొగ్గల విలసిల్లువ్రతిశ్రేణితోడను, సుమధురఫలభరితగోస్తనీకాయమానములతోడను, నానావిధపుష్పలతావితానములపొంతనములతోడను, నెడనెడ నమర్పఁబడినపలుతెఱఁగుల నీరుపైకిఁ జల్లుయంత్రములతోడను, వలయాకృతులు సనుమనుగ సంతరించి కట్టినచలువఱాతిన్నెయలతోడను, వివిధవర్ణాకృతుల నలరుపింతమొక్కలవిలాసములతోడను, గోకనదకమలకమనీయసుమధురాచ్ఛజలభరితసరోవరంబులతోడను, మిగుల మనోహరంబులగువిశ్రమారామంబులు చూడఁజూడఁ గ్రొత్తలై కన్పట్టుచుండును. మఱియు నది యిది యననేల? నగరంబు సర్వంబును నవనాగరకతావిలాసంబులకు నివాసంబయి ప్రతిక్షణసుక్షణశతంబులకుఁ [illegible]నకమై పుత్రమిత్రకళత్రబంధువులతో సకలసంపదలు గలిగి కుటుంబములు కాపురముండు సుప్రకాశస్థానమై నెలయుచుండును.

ఏతాదృశాసాధారణవైభవోపేతం బైనయీపట్టణంబు రాజధానిగాఁ గృతయుగంబునఁ బ్రథమపాద మతిక్రమించిన

సమయంబున, సర్వకులాభరణం బైనయువనాశ్వభూరమణుండు కోసలదేశంబుఁ బాలించుచుండెను. అతం డంతగ రాజ్యంబు విస్తరిల్లఁజేయకపోయినను బైత్రుకమునం దా వంతయుఁ గొంతవడనీక "రాజ" నామంబు సార్థకముగాఁ బ్రజలను బోషించుచుఁ గోసలవసుమతికి "రాజన్వతి" యను పేరును సంపాదించిపెట్టెను. అక్కాలంబున నేరా జెక్కుడు జన్నములుచేయునో, యతని నధికునిగా రాజలోకము తలంచుచుండెను. అట్లు బహుయజ్ఞము లాచరించి పేరు గడించిన పృథ్వీపాలురలో నీతండు నొక్కరుండు. నెలకు మూఁడు వానలు కురియుచు దేశము సుభిక్షమై యుంటచే నాదాయమునం దిసుమంతయు లోపంబు లేదు. ప్రజలకు నాధివ్యాధులు లేవు. పరరాష్ట్రములకై పరాక్రమించు ప్రభువు లక్కా డరుదగుటచే సాంగ్రామికోపద్రవములును లేవు. సర్వము సుప్రశస్తమై యుండెను.

ఇట్లుండు నెడ నప్పురంబున "బాలహితైషిణీపరిష" త్తను పేరిటఁ బ్రాథమికవిద్యాసంస్థ యొకటి యుండెను. దానిపాలనంబునకు లోఁబడిన ప్రాథమికవిద్యాలయము లనేకములు కలవు. అందు రాట్కూమారవిద్యామందిరము మొదటిది. తన్మధ్యాధ్యాపకసమాజమువారు తమపాఠశాలయం దారోగ్యవారము వేడుకలు నడుపుదు కడపటిరోజున నారోగ్యవ్యాయామము, విద్యా, విషయకోపన్యాసములు, వీరహాస్యరసోదంచితంబు లగుప్రదర్శనంబులు జరిపించి బాలురమానసోల్లాసకరంబుగఁ బారితోషికప్రదానములు మున్నగు

చుట్టును గట్టఁబడినవరణాం బరిజనాశేద్యమై "అయోధ్య" నామము సార్థకము చేయుచుండెను. అచటి వరుసలుతీర్చి సొబగుమీరఁ గట్టినసమున్నత సౌధరాజియు, నుభయపార్శ్వములనొద్దికతో వెలయురాజతప్రదీపస్తంభంబులు వానిచెంత సుమనోమనోహరలతావృతచంద్రకాంతవేదికలును గలిగి పటికపుతాలు కలుమటచేఁ జిందినక్షీరంబులనైతము సేకరింపఁ దగిన ట్లతిస్వచ్ఛములై యుండురాజమార్గములు, శృంగాటకములకు నలువైపులందు విచ్చుమొగ్గల విలసిల్లువృతిశ్రేణితోడను, సుమధురఫలభరితగోస్తనీకాయమానములతోడను, నానావిధపుష్పలతావితానములఘాంతనములతోడను, నెడనెడ నమర్పఁబడినపలుతెఱఁగుల నీరుపైకిఁ జల్లుయంత్రములతోడను, వలయాకృతులు సమముగ సంతరించి కట్టినచలువతాతిన్నియలతోడను, వివిధవర్ణాకృతుల నలరువింతమొక్కలవిలాసములతోడను, గోకనదకమలకమనీయసుమధురాచ్ఛజలభరితసరోవరంబులతోడను, మిగుల మనోహరంబు లగువిశ్రమారామంబులు చూడఁజూడఁ గ్రొత్తలై కన్పట్టుచుండును. మఱియు నది యిది యననేల? నగరంబు సర్వంబును నవనాగరకతావిలాసంబులకు నివాసంబయి ప్రతిక్షణసుక్షణశతంబులకుఁ దానకమై పుత్రమిత్రకళత్రబంధువులతో సకలసంపదలు కలిగి కుటుంబములు కాపురొందుచుండ సుప్రకాశస్సమై వెలయుచుండును.

ఏతాదృశాసాధారణవైభవోపేతం బైనయిప్పట్టణంబు రాజధానిగాఁ గృతయుగంబునఁ బ్రథమపాద మతిక్రమించిన

షయంబున, సర్వకులాభరణం బైనయువనాశ్వభూరమణుండు కోసలదేశంబుఁ బాలించుచుండెను. అతం డంతగ రాజ్యంబు విస్తరిల్లఁజేయకపోయినను బైతృకమునం దావంతయుఁ గొంతవడనీక "రాజ" నామంబు సార్థకముగాఁ బ్రజలను బోషించుచుఁ గోసలవసుమతికి "రాజన్వతి" యను పేరును సంపాదించిపెట్టెను. అక్కాలంబున నేరా జెక్కుడు జన్నములు చేయునో, యతని నధికునిగా రాజలోకము తలంచుచుండెను. అట్టి బహుయజ్ఞము లాచరించి పేరు గడించిన పృథ్వీపాలురలో నీతండు నొక్కరుండు. నెలకు మూఁడు వానలు కురియుచు దేశము సుభిక్షమై యుంటచే నాదాయమునం దిసుమంతయు లోపంబు లేదు. ప్రజలకు నాధివ్యాధులు లేవు. పరరాష్ట్రములపై పరాక్రమించుప్రభువు లెవ్వ రరుదగుటచే సాంగ్రామికోపద్రవములును లేవు. సర్వము సుప్రశస్తమై యుండెను.

ఇట్లుండు నెడ నప్పురంబున "బాలహితైషిణీపరిష" త్తను పేరిటఁ బ్రాథమికవిద్యాసంస్థ యొకటి యుండెను. దానిపాలనంబునకు లోఁబడిన ప్రాథమికవిద్యాలయము లనేకములు కలవు. అందు రాట్కుమారవిద్యామందిరము మొదటిది. తన్మందిరాధ్యాపకసమాజమువారు తమపాఠశాలయం దారోగ్యవారము వేడుకలు నసుపుడు కడపటిరోజున నారోగ్యవ్యాయామ, విద్యా, విషయకోపన్యాసములు, పరిహాస్యరసోదంచితంబు లగుప్రదర్శనంబులు జరిపించి బాలురకు మానసోల్లాసకరంబుగఁ బారితోషికప్రదానములు మున్నగు

కార్యంబు అత్యంతవైభవంబుగఁ గావింపనెంచి పెద్దలకుఁ బిలుపులు తెలిపి నాఁటికూటమునకు యువనాశ్వభూపాలు నధ్యక్షుఁ డగుటకు వేఁడుకొనిరి.

పరసంతోషాభిలాషియు వినోదశీలుండు నగు నానరేంద్రుఁ డందుల కంగీకరించి యుండెను. కానందకరమ్మగు సముచితవిధమ్మైన సమయంబునకుఁ జనుదేర నచట నంతకుమున్న వచ్చి వేచియుండు రాజన్యులు, తత్కార్యనిర్వాహకులు నెదురేగి నృపుని లోనికిఁ దోడ్కొనివచ్చిరి. ఎందులకో కార్యప్రారంభమున కొంకింత యెడకలుగ నందఱు రత్నకంబళాసీనులై యుండిరి.

ఆపాఠశాలయం దైదేండ్లు మొదలు పదేండ్లవఱకుఁ గల బాలురు వసించుచుండిరి. సొగసైనదుస్తులు ధరించి సోయగమునకు నెలవైన బాలకులు గుంపులుగుంపులుగ జతగూడి యుత్సాహాతిరేకమున నాననంబు కన్గవ ముకుపుటంబులు కపోలయుగళియు వింతలుగా ముచ్చటలాడుకొనుచు వచ్చుచుఁ బోవుచు నుండిరి. అందుఁ గొందఱు బాలురు ముద్దుగుల్కు మోములతో ముట్టినఁ బొగ్గారు మెఱుఁగుబుగ్గలతో మనోహరంబు లగుసంగకంబులతో మించుటంచుల మంచిదుస్తులతో ముసిముసినవ్వులు నవ్వుచుఁ గౌతుకోదంచితాత్ములై బాలమన్మథలీల నెట్టివానికి నెట్టి ముద్దాడుతలఁపు పుట్టించుచుఁ జెంగుచెంగున నెగురుచుఁ జనవుపాయిని బిలువఁబడు చోటుకును వచ్చి యచటఁ గూర్చుండి సతమతంబులయుంక పీఠికల నలంకరించుచుండిరి. ఆయాత్మజుల ముద్దుముచ్చటల వినుచు

నితర భోగములకై యీపుత్రవంతు లుండ వారివలెను నీసభా ధ్యక్షుం డొక్కరుండు కూనోత్క్యెశ్ప్రాంగు శై సా ప్రదక్షి నుష్ఠ కంఠమున గుటికలు మింగుచుఁ గూర్చుండి యెంతవైభవ మున్నను సుతులు లేనియెడ నది శూన్యప్రాయంబెగదా ! నా కీకొఱంత యింకెన్నటికిఁ దీఱును ? ఏమి చేయుదు ? నని లోలోనఁ జింతించుచు నేమియు నెఱుంగనట్లు క్రిందు మీఁదు లగుచుండెను. ఏవయసున నెయ్యది వలయునో యయ్యది లేకున్న నది యొకగొప్ప కొఱంతయె. అప్పుడా పురణీయు నుద్దేశించి 'భగవానుఁడు మా కొకయువరాజు ననుగ్రహించిన నానందముగ నుండెడిది. ఇఁకముందైన నను గ్రహించిన నానందముగును' - అని యత్తఱి రాజచ్యుఁ డొకండు చక్కటివారితోఁ బల్కెను. ఆసమయమ్మున నటఁ గూర్చుండు టసహ్యముగఁ దోఁచి కావలయు లేవ నుంకించు తన్మ్రపాలురకు గార్యనిర్వాహకుం డేతెంచి సభాప్రారంభము సేయునగునని విన్నవింప నందఱు నటనుండి కదలిరి. అధ్యక్షుం డగ్రాసనం బలంకరింప నలరుటెత్తు లాతనికంఠసీమ నలంకరించినవి. పిదపఁ గ్రమానుసారముగఁ గర్తవ్యములు కడముట్టఁ దుదకుఁ గార్యనిర్వాహకునివందనములతోఁ దత్సభ చాలింపఁబడెను. అదిమొదలాయువనాశ్వునిహృదయమ్మునఁ బుత్రచింత గాటమ్ముగ నాటుకొనియె. తరువాత దీనికిఁ దోడుగ మఱియొక సంఘటనముకూడ సంప్రాప్తమయ్యెను.

ఒకనాఁటి రేయి వీథులెల్ల విరళజనమ్ములైనవి. వర్తకు లంగళ్ళు మూసి తమతమవసతుల కేఁగిరి. ఎంతలకో తము

లంపుటంగడులు, తినుబండారములదుకాణములు, పూలయంగడులు, పరిమళద్రవ్యపణంబులు, మద్యముల మళిగలు మాత్ర మచ్చటచ్చటఁ దెఱువఁబడియుండెను. వెన్నెల పుచ్చపువ్వువలె విరిసికాయుచున్నది. అట్టియెడ నీరాజేంద్రుఁడు వాడుకచొప్పున మాఱువేసముఁ బూని పౌరులాడుకొను మాటలు విన వేడుకతో నాల్గుత్రోవలమొగయందును, నెడనెడ నుండుచలువతాళ్ళియలయందును, సందుమూలలయందును, భజనమందిరములందును, దట్టముగ జనులు కిలియుచుందురు గాపున నాయాకట్టలారయుచు వచ్చుచుండె. అప్పట్టున బ్రాహ్మణశ్రేణియం దొకచో మంటపమునఁ గూర్చుండియుఁ బరుండియుఁ బదుగురుబ్రాహ్మణులు కథలు, అభ్యాసములు, లోకవృత్తములు, శాస్త్రవిషయములు - ఇచ్చవచ్చిన వానిని జెప్పకొనుచుండిరి. వానిలో నిక్రిందిమాటలా నృపాలుని చెవులఁ బడినవి.

మొదటివాఁడు:- పుత్రలాభమునకే వివాహముగాని సౌఖ్యలాభమునకు గాదు.

రెండవవాఁడు:- అట్లయిన నీశ్లోకమునం దిట్లుండెనే:
"అగ్నిహోత్రఫలా వేదా, దత్తభుక్తఫలం ధనమ్
రతిపుత్రఫలా దారా, శీలవృత్తఫలం శ్రుతమ్"

మొద:- అదేదో శాస్త్రీయశ్లోకము. ప్రమాణము కాదు ... ఇంతయేల పరంపరాప్రాప్తమైన "...ప్రజాసమృద్ధ్యర్థం ..." అను వివాహసంకల్పవాక్యమును దలంపుము. దానిరహస్యము తెల్లమగును.

రెండవ:- సరే కానిమ్ము నీవాదమే గెలువనిమ్ము.

మొదటి:- ఏమి "తుష్యతు దుర్జన" యనియా విడిచితివి ?

రెండవ:- అవును. చెప్పినవచనము ప్రమాణముకాదనిన మతేమి చేయువలయు ?

మొదటి:- ఓహో! యదియా నీయభిప్రాయము! నీయట్టి వారు కల్పించినయిట్టిచాటూక్తులే ప్రమాణ మగుచో యథార్థ మటుగంటవలసినదే. పోనిమ్ము. ఆప్రమాణ్య వివాదమేల? ప్రపంచపరిపాటి ననుసరించి వచింపుము. ప్రమాణము లన్నియు దాని ననుసరించినవేకదా !

రెండవ:- దాని ననుసరించి మొదట నీవే వచింపుము.

మొదటి:- మంచిది. చతుర్విధపురుషార్థములలో మొదటిదగు ధర్మ మాచార, వ్యవహారరూపముల ద్వివిధము. ఆచార మరయుము. ఉపనీతుఁ డైనవాఁడు గురుకుల మాఁజేరి వేదము లన్నిగాని కొన్నిగాని చివర కొకటి గాని నేర్చి షడంగములు తెలిసి మఱియు నేర్వఁదగు వానినెల్ల నేర్చి పిదప గురువునకుఁ బ్రీతిగా దక్షిణ నొట్టి యనుజ్ఞనొంది యింటి కేతెంచి వంశవిచ్ఛేదము కాకుండ వివాహమాడుట యనుభవవిదితమేగదా !

రెండవ:- "అవును."

వివాహము చేసికొనక నైష్ఠికబ్రహ్మచారినై కాలముఁ గడుపుదు ననువానినిఁగూడఁ బెద్దలు వంశవిచ్ఛేదమగునని యొప్పించి వివాహితునిగఁ జేయుటయు విదితచరంబె. వివాహా

మైనపిమ్మట శుభాకాంక్షతోఁ గొనుచుండు పుత్త్రవంతుఁడగుట కాపు లపేక్షించుటయుఁ బుత్త్రవంతుఁడొనర్చు దానధర్మములకు దేవపితృదేవతలు సంతుష్టితోఁ జేఁజాచుటయుఁ దెలియుచున్నారము. ఒకవ్వాఁడు మనుజుఁడు ప్రతిబంధకవంశంబునఁ బుత్త్రులు జనింపకున్న జపతపశ్చర్యాదులతోఁ దత్ప్రతిబంధకములఁ దొలఁగించుకొని పుత్త్రవంతుఁడై ముక్తికిఁ గడంగుటయు లోకమునఁ గలదు.

మఱియుఁ బుత్త్రులతో వంశము నిలుచును. వంశమును బట్టి పేరు నిలుచును. పేరితోఁ బ్రతిష్ఠ యేర్పడును. తత్ప్రతిష్ఠ శాశ్వతమగునేని పుత్త్రవంతునిపుణ్యలోకానుభవములు శాశ్వతము లగును. ఏనాఁటికిఁ బురుషునిప్రతిష్ఠ పృథివియందడఁగునో యానాఁటికే వానిపుణ్యలోకానుభవములు పూర్తి చెందును. ఇంక వ్యవహార మరయుము.

ఆకులు, పువ్వులు, కాయలు గలచెట్లను సకలప్రాణు లాశ్రయించినట్లు జనులు పుత్త్రపౌత్త్రసంపత్తి గలవానినే దానధర్మము లాచరింపను, దానధర్మములు గ్రహింపను నాశ్రయించెదరు. అట్టివానికే లోకమునఁ బ్రథమతాంబూలము దొరకును. వాని కందఱు నేవేళ నెట్టియావశ్యకత గల్గునో యని యనువర్తులై యుందురు. పుత్త్రులు లేనివాని కెడమచేత సన్మానము లభించునుగాని కుడిచేత లభింపదు. వానితోఁ గాఁగలప్రయోజనము లేదని లోకులయాశయము. కొందఱు బాదుగు లాస్తికొఱకుఁ బుత్త్రహీనునిశరీరపాతము నభిలషించెదరు. సంతతిలేమిచే ననాథప్రసంగములుకూడ వెలువడు

ముండును. లోకవ్యవహార మీవలన నున్నది. వేయేల ? ప్రపంచమంతయు సంతానసూత్రముతో బద్ధమైయున్నది. అది లేనియెడలఁ బ్రపంచ మెక్కడిది ? కనుక సంతతియే ప్రధానముగఁ బురుషునకుఁ గోరఁదగినఫలము. ఎయ్యది ముఖ్య పదార్థమో యదియ ఫలశబ్దవాచ్యము. తదన్యములు ఫలాభాసములు. పశుతియుఁ బశుసాదృశ్య మాపాదింపఁగలకామ ఫలము జ్ఞానవంతుఁ డైనమానవున కపేక్షణీయమును గాదు. అది జంతుసామాన్యమునకు స్వాభావికము. అందు దైవతంత్రము లేదు. అట్టిదానిని ఫలమనుట యనుచితము.

ఇట్లనునంతలోఁ బొడుగూరివృద్ధుం డింకొకఁడు దీక్షితులూ ! చాల దీర్ఘోపన్యాస మిచ్చుచుంటి వదేమి ?

మఱేమి లేదు. వివాహమునకు ఫలమేమి ? యని ప్రశ్నము కలుగ దానిపై నీప్రసంగ మంతయు వచ్చినది.

తుద కేమని తీర్పు ?

పుత్రులే ఫలమని.

సరే. బాగున్నది. కాని పుత్రులంటె జ్ఞప్తికి వచ్చినది. మీరాజుగారికిఁ బుత్రు లెందరోయి.

మన మందర మాయనకుఁ బుత్రులమే.

అట్లనా. పాపము మంచివాఁడు. చాలధార్మికుఁడు. వృద్ధత్వము తల నిల్చినది. తనయుఁ డొకఁ డుండిన బాగుండెడిది.

అవును. దైవము తలఁపలేదు. ఏమి చేయవలయు?

ప్రతిబంధకపరిహారమునకు జపతపములు చేసిన మేలగునుగదా !

అపుడు ఆయన కావని తోఁచలేదు.

వీరిట్లు మాటాడుకొనుచుండఁగా నాకసమున ఖండాభ్రము లేకమై చంద్రుని గప్పివైచెను. తోడనే పెద్దగాలియు వీచెను. దానితో దుమ్మురేఁగి మీఁదఁ గవియ నంద ఱొక్కుమ్మడి తుండుగుడ్డలదులుపుకొనుచు ధూత్కారములు చేయుచు నొకరిమాట నొకరు తలఁపక యెవరితావులకు వారేగిరి. ఆ రాజును మేఘపటల మలముకొన ద్విజవాక్యములు శ్రద్ధతో నాలకించు నీరాజును జింతాపటల మలముకొనియె. అంత నా గాలిదుమ్ములకు నిల్వలేక యతండును భటునితో వడివడిగ నగరున కరిగెను.

అంత నన్నరేంద్రుం డాత్మమందిరమునకుఁ జని శయన తలంబున మేను వాల్చెను. కాని, నిద్దుర రాలేదు. విప్పుఁ గన్నులతో వెలికిలఁబరుండి యిట్లని యాలోచింపఁదొడఁగెను.

ఆవిప్రకుమారుం డన్నదంతయు విస్పష్టముగ వచించెను. అం దావంతయు నసత్యంబు గోచరింపదు. సంతతిలేని వాఁడు జీవచ్ఛవంబు. గృహస్థునకుఁ గొమరుండు బహిర్జీవంబు. కళత్రంబు పృథగ్భూతశరీరంబు. బంధుమిత్రులు తదవయవములు. నాఁటిగృహస్థసమూహమున సజీవుండనయ్యు నిర్జీవుండనైతి. సుతసంపత్తి శూన్యమగుటతో సర్వము శూన్యప్రాయమయ్యె. నాకుఁ గలిగినసర్వస్వము నేకమయ్యు నాలోపము నాచ్ఛాదింపలేకపోయెనుగదా! అట్టియెడ దీనిప్రయోజనమేమి? పాణిగతమయ్యుఁ బ్రాణము నిల్పలేకపోయెడుధనముతోఁ బనేమి? అట్టి దవశ్యము మంటిగడ్డవలె విసర్జింపఁదగి

నదే. దీని నాశించినవారుఁ దెలియకయ బహుకాలంబు గడచి పోయినది. ఈ నిరుపయోగసంపదలందలి వ్యామోహము దిగఁద్రోచి యావృద్ధవిప్రుండు తెల్పినట్లు తపంబునకు దార కొనియెద. తపంబునకు పరాకం బైన దెద్దియు లేదు. దానఁ దలంపులు తీరుటయకాక ముక్తియుఁ జేకూరును. కావుననే తపస్సిద్ధికొఱకు మహాత్ములాకలములు తినుచు సకలకష్టముల కోర్చి వనవాసముచేయుచుందురు. సుతు లున్నను లేకున్నను మాదృశులకుఁ దుదిదినంబులం దరణ్యమే శరణ్యము. సుక్షత్త్రియునకు సంగరమరణం బుత్తమము. అది సమకూడదేని యడవిలోఁ జెట్టుక్రింద రాలినఫలముభంగి పడి ప్రాణములు విడువవలయును. సాధారణజనునట్లు మంచముపై మరణించుట యుచితంబుగాదు. ఇంక నాలసింపక యక్కార్యంబున కిప్పుడ దొరకొనియెద. అందు సమర్థుండ నగుదునేని యభీష్టంబులు పడయఁజాలుదు. కాకున్నఁ గర్తవ్యము తీర్చికొన్నవాఁడ నగుదు. ఎట్లైన నుచితంబ. అట్లయిన నాతలపైఁ గలరాజ్యభారం బెవరిపైన మోపుదు? ఔర!! మాపమా రావానికిఁ బదిమందిబిడ్డల నిచ్చి మాకొకబిడ్డ నొసంగని యీ వికటకవి యైనవిధాత నెంతదూఱినను చింత లేదు. అని తలపోయుచు నిట్టూర్పు విడిచి యిఁకఁ జాలు నీచింత. తలఁచిన కొలఁదియుఁ దాపము వొడముచున్నది. రేపకడఁ గర్తవ్యము నాలోచించువాఁడ. ఇప్పటి కిఁక నిశ్చింతుఁడనై నిద్రించుట మంచిది యనుకొని కన్నులు మూసెను.

వఱువాత యువనాశ్వుండు మేల్కాంచి కాల్యకృత్యములం దీర్చి పట్టపుదేవిం బిలిచి ప్రేయసీ! సాటివారిలో నెలవెలంబోవుచు వంధ్యజీవనము చేయుటకంటె నడవిని మునివృత్తితోం దపంబొనర్చుట పరమశ్రేయంబు. దానం బాతకంబులు పటాపంచలై యిష్టప్రాప్తి సేకూరును రాజ్యభారంబు మంత్రిపై నిడి యడవికి నడవ నిశ్చయించితి. ఏమందువు? - అని యడుగ నాసాధ్వియు మీనీడకు వేఱొకరూప మంచునా! మీవెంట నుండుటయె నాకు ముదావహము - అని బదులు పల్కె. మంచిదని యమ్ముదితమనంబునకు మెచ్చుకొని యతండు ప్రధానమంత్రిని బిలిపించి యాత్మనిశ్చయం బెఱుంగంజేసి మావచ్చునంతకు రాజ్యంబు నప్రమాదంబుగం బాలించునది యని వచించి యింకను జెప్పందగువారికెల్లం జెప్పి యాపగ లంతయుం బుచ్చి నాంటివేకువం బత్నీసమేతుండై భృగ్వాశ్రమంబు తనతపశ్చర్య కనుకూలంబని తెలిసి యటకుం బోవం బయలుదేరెను.

తత్కాలంబున నుపాస్యమానదైవంబున కిప్పటియట్లు మాంసచక్షువులకు దర్శనీయము లైనదారు, శిలామయ ప్రతికృతులు బయలుదేరనందున నింటనుండి యర్చనములతో నతని ప్రసాదముం బడయునాచారము లేకుండెను. అభీష్టంబులు దీర్చుకొన దైవసాక్షాత్కారమునకుం దపంబె పరమ సాధనంబగుట నందఱు దానినే యవలంబించుచుండిరి.

---

# రెండవ ప్రకరణము.

———:o.———

వర్షవిభాజకము లైనశైలములలో హిమాలయము కడపటిది. ఇది తూర్పుపడమరలుగ బహుదూరము వ్యాపించి భారతవర్షమున కుత్తరపుటెల్లగ నున్నది. త్రిలోకపావని యగుగంగాస్రవంతి పొడమినపున్నెంపునెలవు. జగన్మాత యనందగు గౌరీసతీమతల్లికిఁ బుట్టినయిల్లు. సకలౌషధీనిలయము. సకలమౌనులసిద్ధస్థానము. విశ్వామిత్రమహర్షి బ్రహ్మర్షిపదంబు గాంచినదియు నియ్యెడనే. భగీరథుండు బహుకాలము తపంబొనర్చి గంగాతరంగిణీప్రసాదంబు వడసిన దిచ్చోటనే. అన్నివిధముల దీనియభ్యున్నతి నవలోకించి తొల్లింటిపెద్దలు దీనిని శైలరాజంబని పేర్కొనిరి. ఈపవిత్రపర్వతప్రాంతమం దక్కాలంబున ననేకులు బ్రాహ్మణులు గంగానది నానుకొని పర్ణకుటీరంబులఁ గావించుకొని యందు వసించుచుండిరి. వారందఱకు భృగుమహర్షి యగ్రేసరుండు. ఈయగ్రేసరత్వకారణముచే నాయగ్రహారంబునకు 'భృగ్వాశ్రమ' మని పేరు కల్గెను. తపఃప్రభావముచే నీభృగుమౌనికిఁ బాదతలంబున నేత్రంబు గల్గెనని యందురు. ఇమ్మహానుభావుండు త్రిమూర్తులమహిమఁ దెలియ నేగినపుడు విష్ణుదేవుం డీమునివరుని పాదము లొత్తుచు నానేత్రంబు చిదిపివైచెనని ప్రాచీనులు పల్కియుండిరి. మహేంద్రాదిదిక్పాలకు లీపరమతపోధనుని దర్శించి కలిగినసంశయములు వాపికొనిపోవుచుండెడివారనియు వినికిడి. ఏతాదృశమహిమాన్వితునియాశ్రమంబునకు

మన యువనాశ్వుండు తపంబు సలుపఁదలఁచి వచ్చెను. కాని బ్రహ్మణభూయిష్ఠం బైనతదాశ్రమపదంబున వసింప జంకు కలుగ దాని కనతిదూరంబున నొకపర్ణకుటిం గావించుకొని యందుండి తపంబునకు దొరకొనియెను.

ప్రతిదినంబు నరుణోదయమునకు మున్న మేల్కొని యబ్జనాభునిఁ గీర్తించి యవలఁ గాల్యకృత్యములం దీర్చుకొని గంగాప్రవాహమున స్నానమాడి యారవైచిన నారబట్టలఁ గట్టుకొని నుదుటఁ దిలకంబిడి సంధ్యాగ్నికార్యంబులు సలిపి యవలఁ బద్మాసనస్థితిఁబూని బహిర్విషయంబులనుండి యింద్రియంబుల మరలించి మనం బేకాగ్రింబుచేసి యోగనియతుండై సార్థయామం బట్లుండువాఁడు. అంత సమాధిబంధంబు సడలించి లేచి యరణ్యంబున కరిగి సమిధలు, కుశలు మున్నగు వానిని సంపాదించికొనివచ్చి మాధ్యాహ్నికకృత్యంబులు తీర్చికొని యాహారవిధి ముగిసినపిదప దర్భమయాసనంబునఁ గూర్చుండి యిష్టకథాలాపంబులఁ బ్రొద్దుపుచ్చి సాయంసమయ మగుడుఁ దత్కాలకర్తవ్యంబులు తీర్చ మరల నుత్థితుండయి వాని ననుష్ఠించి ఫలముల నాహారించి ప్రొద్దగుడుఁ బూరిపడకపైఁ బరుండువాఁడు. ఛాయయు ట్లిల్లాలు నాతని ననుసరించుచుండెడిది. ఇవ్విధమున వారముదినములు జరుగునప్పటికి నుష్ణాతిరేకంబున నానూత్నతపస్వికి మొదట నొడ లంతయు విఱుగఁ గొట్టిన ట్లయ్యెను. అట్లయినను నతండు తాల్మివహించి తన నిత్యవిధిని మానక యథావిధిగ నాచరింప నాయూఁడవనాఁటికిఁ బెల్లుగ జ్వరమువచ్చెను. దప్పి, తాపము, తలనొప్పి

మున్నగు లక్షణములెల్లఁ గన్పించెను. ఇట్టియెడఁ దియ్యని మందు లిచ్చుచుఁ బ్రతిక్షణము నవలోకించువైద్యులు తగు నుపచారములు చేయుపరిచారకులు లేరుగదా! పాపమాతని గృహిణియే శ్రమకోర్చి సకలోపచారములు చేయుచుండెడిది. ఇట్లుండ నాతన్వికిఁగూడ నొక్కసారిగఁ దాళలేనియట్లుజ్వరము వచ్చెను.

నిన్నమొన్నటివఱకు నీదంపతు లిర్వురు హాయిగ నంతిపురంబున వసించుచు నుష్ణోదకంబున స్నానమొనర్చుచు మృదుమధురపదార్థముల భుజించుచు హంసతూలికాతల్పంబునఁ బవ్వళించుచు వినోదగోష్ఠులఁ గాలంబు గడపుచు "శ్రమ" మన నెట్టిదో యనునట్లుండువారలు. అట్టివీ రిప్పుడు క్రొత్తగఁ దమవృత్తికి విపరీతంబుగ మునివృత్తి నవలంబించిన జ్వరము రాక యేమగును?

జొన్నగింజ వైచినఁ బేలగింజ యగునట్లు జ్వరమతి తీవ్రమై నిల్చికాలుచున్నది. ఇరువురకు రక్తమాంసములు శుష్కించిపోవుచున్నవి. దగ్గర నుండునీరంతయుఁ ద్రావినను వారిదగ యుడుగలేదు. నాలుక యిగిరిపోవుచున్నది. అచ్చోట దేనియందును నీరు లేదు. ఆసమయమున నుద్ధరిణెఁడుజలము తెచ్చి నోటఁబోయువా రొక్కరును లేరు. మధ్యాహ్నసమయము. పల్లెలోనివా రేరు నచ్చటి కింకను రాలేదు. ఇరువురు నిట్లుండిరని వారి కెట్లు తెలియును? తెలిసిన రాకుందురా! అక్కడికిని గొంతవఱకు నిల్చి యెవరును వచ్చు తెఱఁగు తోఁచనందున దప్పి కోర్వలేక యిద్దఱు నొండొరుల

కైదండలఁబూని లేచి యనతిదూరమం దున్న భృగుమహాని యాశ్రమముముంగిటకు మూల్గుచుఁ దూలుచు నూర్పుచు నెట్టెటో వెడలి ఘటములం జేరవైచిరి. అప్పటికి సర్వశక్తులుడుగఁ గన్నులు గిఱ్ఱునఁ దిరుగ నొడలు తెలియక యిరువురు గ్రిందకుఁ బడిపోయిరి.

అంత వారు పడినచప్పుడు విని లోపలనుండి యేమది యని యాతురపాటుతో వెలుపలికి వచ్చి చూచి చాల నొచ్చుకొని భృగుమహాని యప్పటి కటఁగూడినవారిలోఁ దగువారిని వారి నొండుకడఁజేర్చి పరుండఁబెట్టి పలయునుపచారములు సలుప నియోగించి కొంతసేపటికిఁ దెలివిరా నిద్దఱికిని జ్వరశాంతికిఁ జికిత్స చేసెను. ఆరాత్రికే జ్వరము జార సుఖముగ నిద్రించిరి. సాధుసంగంబు సకలసంతాపశామకం బను పెద్దలనుడి మూరిఁబోవునా?

పల్లెలోని పెద్దలు రాత్రిభోజనము లయినపిదప భృగుమానివద్ద కరుదెంచి రాజదంపతులకు జ్వర మెట్లున్నదియు విచారింపవచ్చి శాంతించుటఁ దెలిసి యింతలో భృగుమానియు నరుదేర నందఱు నొక్కెడఁ గూర్చుండి తద్రాజదంపతులనుగుఱించి మాట్లాడుకొనుచుండిరి. అం దొకవిప్రుఁడు భృగుసత్తము నుద్దేశించి యిట్లనెను.

ఆర్యా! ఈనరపాలుం డధికముగ సంతానచింతతోఁ గుందుచున్న ట్లగుపడుచున్నాఁడు. ఆవృద్ధునిచింత యుడుప నపత్యసంపాదకం బైనక్రతువిధానం బొండు యోచించి యానతీయరాదె! తపశ్చరణక్లేశం బాపుట్టుభోగు లెట్లుసైఁపఁ

గలరు ? అనిపల్కఁ దక్కినవారు నాపల్కులు విని, "నిజము. అట్లు యోచించిన నాదంపతులు సుఖపడుదురు. మాతలంపు నదియ" యనిరి. ఆమునిసత్తముం డాదటి నుద్దేశించి శ్రోతప్రక్రియాకుశలు లైనమీకు నే యోచించి చెప్పవలయునే! ఇత్తటి మీ కీతలంపు కల్గుటెంతయు మెచ్చఁదగియున్నది. నేనును మీయట్ల తలంచితి, బాగు. మన కందఱకు నొక్కక్షణమున నొక్క రీతితలంపు కలుగుట జగన్మంగళసూచకంబు. ప్రస్తుతము మహీతలంబున కంతకు మాననీయుం డైనమానవనాథుండు కావలసియుండు. ప్రకృత నరేంద్రశ్రేణికిం గల తలతలపెద్దతనంబులు తొలఁగింపవలయు. అప్పుడుగాని యనిష్టములు గడచి జనులకు సుఖించు నవకాశములు గల్గవు. కనుక మహామహిమాన్వితుం డైనపురుషుని బుట్టింపఁజాలు యాగంబు నాలోచింపవలయు. నాకుఁజూడ త్రువ్రదేవతాప్రధానంబు లయినసవనంబులకంటె విష్ణుదేవుండు జగద్రక్షకుండగుట నస్మత్సంకల్పసిద్ధికిఁ దద్దేవతాప్రధానం బగుసవనంబు సలుపు టుత్తమంబని తోఁచుచున్నది. ఇందు కేమందురు ?

అందఱును:- అదే మామనంబునకుఁ దోఁచుచున్నది. తప శ్శక్తి నైనను ధారవోసి సుసంవిధానముగ నాసవనంబు చెల్లించితిమేని తప్పక చరితార్థుల మగుదుము. అప్పుడు రాజదంపతులేగాక సకలధరాతలంబును ధన్యమగును.

భృగు:- సెబాస్. నాకన్న నొకయడుగు ముందుకు మీరె వచ్చుచున్నారు. మంచిది. నేఁటి కేవవనాఁ డికార్యాంబునకు మొనయుదము. అంతలో నయ్యైరుప్రురు నారో

గ్యవంతు లగుదురు. వలయు పరికరంబులు గూర్చ నవ
కాశంబును గలుగు.

అందఱు:- అట్లే చేయుఁడు. వలసినవనులు తీర్ప నెల్లరము
సంసిద్ధులము.

భృగు:- ఇప్పట్టున యువనాశ్వుం డెంతయు సుకృతవంతుఁడని
చెప్పనగును. ఈరీతి మహదనుగ్రహము సుకృతము
లేక యూరకకల్గునా! మంచిది. ఇఁకఁ బరుండుదము.
పొద్దయినది. రేపకడ నృపాలు నీవిషయ మెఱిఁగించి
యందుల కభిముఖుఁ గావించువాఁడ.

ఇట్లనుడు నందఱు వల్లెయని లేచి వెడలిరి.

భృగుమౌనియు వేకువ లేచి పెందలకడన కృత్యం
బులఁ దీర్చికొని యువనాశ్వుకడ కరుదెంచి యతండును బ్రియ
త్నపూర్వకముగఁ బ్రణామమొనర్చ లేచుచుండ వారించి
యారోగ్యమడిగి నాడీపరీక్షయొనర్చి భార్యాభర్తలకు నౌషధ
మునిచ్చి తా నటనుండునాసనంబున నుపవిష్టుండై యిట్లనియె.

రాజోత్తమా! రాత్రి చాలపొద్దువఱకు మిమ్ము
గుఱించియె గోష్ఠి నడచినది. సంతానహీనతచే విరక్తులయి
మీ రిట్లడవుల బడుగులవగిది నిడుమలఁ గుడుచుటఁ జూచి
మాకెంతయు జాలికల్గినది. సంతానము నపేక్షింపనివా రీలో
కమునం దెవ్వరు నుండరు. సంతతి లేకున్నఁ బురుషునకుఁ
బూర్ణత్వము కలుగదు. "ప్రజయాహి మనుష్యః పూర్ణః"
యని శ్రుతివాక్యము. ఇట్లు సామాన్యపురుషునకె సంతాన
మావశ్యకమగుచుండ భవాదృశులకు వేఱ చెప్పవలయునే.

రాజరక్షణీయములు లోకములు. రాజునకు సంతతి లేకున్న లోకము లరాజకము లగును. దాన ధర్మవిధ్వంసమయి ప్రజానాశన మేర్పడును. అట్లుకాకుండఁ గాపాడుట మాకును గర్తవ్యము.

మహర్షులచే వేదములందుఁ గొన్నిక్రతుప్రకారంబులు కనుఁగొనఁబడినవి. వానిలోఁ గొన్ని యిహలోకఫలములను, మఱికొన్ని పరలోకఫలమ్ముల నిచ్చును. అట్టియజ్ఞములు బహూపకరణములు కలిగి బహుజనయోగముతో బహుద్రవ్యసాధ్యములై యుండును. అకృతమున నవి మీయట్టివారికి నిర్వర్తింపఁదగినవి. ఇహలోకఫలప్రాపకంబులైనయజ్ఞములు చేయువారింతకుమున్నరుదు. తపఃఫలంబమేయమగుట దానికె యిప్పుడు లోకమునం దాదరణ హెచ్చుగనున్నది. ఇఁకముం దట్టియజ్ఞంబులకే ప్రాధాన్యము కలుగును. అదియటుండనిమ్ము. ప్రకృతము తపఃక్లేశంబు లేకుండఁ బుత్రఫలప్రాప్తికి మీచే వైష్ణవేష్టి చేయింప సంకల్పించినారము. నేఁటికి నాలవదినంబు శుభయోగంబై యున్నది. నాఁటికి మీరును దేరుకొనియుందురు. నాకొమరుం డిక్కార్యంబును సుప్రయోగంబుగ నడపువాఁడు. ఇందుల కియ్యకొని చింతఁదక్క సుఖంబుండుఁడు.

యువనాశ్వుఁడు:- చిత్త మట్లె కానిండు. సిరి రా మోకాలొడ్డువాఁ డుండునె. మాప్రార్థన లేకయే మీరలు స్వయముగ నిక్కార్యంబునకుఁ బూనియుండ నియ్యకొనకుండుటయుఁ గలుగునా ? మాజన్మంబులు చరితార్థంబులైనవి. మాసుకృతంబును ఫలోన్ముఖం

బైనది. మునిబృందమ్ము మాయెడఁ జూపిన యనుగ్రహంబున కెంతయుఁ గృతజ్ఞులము. తమయానతిచొప్పునఁ దప్పక నడచుకొనువాఁడ.

భృగు:- మంచిది. మధ్యాహ్నము కావచ్చినది. పోయివచ్చెద. ఏరిచేతనైనను నిస్సంశయముగ వలయుకార్యములు గొనుచుండుఁడు. ఇట్లని యటనుండి బిరబిర వెడలి పోయెను.

పిదప సకాలంబునకు సంభారములెల్ల సంపాదింపఁ బడినవి. భృగుపుత్రుండు చ్యవనుండు యాజకుండుగా మఱి కొందఱు విప్రులు తదనుయాయులై యుండ సవనంబు సమారంభమయ్యె. యజ్ఞశాలయం దొక్కెడఁ జతుర్భద్రం బైన వేదిక రచియించి యందుఁ జ్యవనుండు, సునిర్మలవారిపూర్ణంబును, నానావిధౌషధీవిలసితంబును నగుకలశంబు నొకదానినిఁ బ్రతిష్ఠించి, యందు వరుణరూపి యగు శ్రీమన్నారాయణు నావాహనాదిషోడశోపచారముల నర్చించి యక్కలశజలంబునకు "నిప్పానీయంబు గ్రోలినవారికిఁ జక్రవర్తిలక్షణలక్షితుఁడును, శక్రసమానుండు నగుకొమరుం డుదయింపంగలఁ"డని సంకల్పించి తత్సిద్ధికొఱకుఁ జిరకాలసంభృతం బైనయాత్మీయతపశ్శక్తిని ధారవోసెను. తపశ్శక్తి యనఁగఁ బ్రాణములపై నాసవీడి బహుక్లేశములో గడించినసొత్తుకన్న వేయింతలధికము. అట్టిదాని నిమ్మహనీయుఁడు లోకశ్రేయమునకై తృణప్రాయముగ ధారవోసెను.

ఇట్లే తొల్లింటిపాటు లెల్లరు విశ్వశ్రేయమునకుఁ దమ జీవితములు వెచ్చించుచు "అగ్రజన్మ" పదంబు సార్థకముగఁ జరించిరి. 'అగ్రిజన్మ' యనఁగ 'నన్న' యనియర్థము. లోకమునం దన్న చేయునట్టిపని యేమి? పుట్టినతమ్ములకు, ముందుపుట్టఁగలతమ్ములకు సమముగ రక్షణము గలుగ జనకునకు బాసటయై ధనధాన్యములు పొదుపుచేయుట. అట్లే యప్పటిపాటులును విశ్వజనకుఁడైనవిశ్వంభరునకు వాదోడుగ విశ్వమానవులకు మార్గదర్శకులై (పురోహితులై) యుపదేశాదేశంబుల నలుపుచుండిరి. అందువలన వారి కగ్రిజన్మనామ మూర్జితమయ్యెను. వారివంశమునఁ బుట్టితి మనుకొనునేఁటిపాటులాత్మశ్రేయమ్మునకునైత మసమర్థులై తపమున నెట్టిదో తెలియక యేయొకరిద్దఱో ముక్కు-కట్టుకొని కూర్చుండ ముందుకు వచ్చి యెగతాళిచేయుచు " సనాతను "లనియర్థాంతరస్ఫూర్తిగ నాడుచు నగ్రిజత్వమునకు బదు లంత్యజత్వమును సంపాదించుకొనుచున్నారలు. ఎంత శోచనీయము ! పోనిం డది మనకేల !

తరువాతఁ దక్కినసవనతంత్రం బంతయు యథావిధిగఁ జెల్లెను. కడపటిరోజురాత్రి, 'రేపటియుదయంబున రాణికిఁ దత్కలశజలంబు గ్రోలనిచ్చెద' మని చెప్పుకొని యాక్రితు దీక్షితు లెల్లరుఁ గనుబడలియున్నందున మైమఱచి నిద్రించుచుండిరి. అర్ధరాత్రి మగుడు నాజన్నంపుజగతికిఁ జెంతఁ బూరిపడుకపైఁ బరుండియుండు పుడమిఱేఁడు, సవనప్రారంభమునుండియు నుపవాసజాగరణపరిశ్రాంతుం డయియుండుకతనఁ బిపా

సారు(డై పలుసారులు 'దప్పి, దప్పి' యని శుష్కకంఠమున నఱచిన నొక్క(డును లేవలేదు. గొంతెండిన పులు(గువలె నఱచినవా( డఱచినట్లు యుండె. అదేమి పామునిద్రయో యొక్కనికైన మెల(కువ కలుగలేదు. క్రమముగ( గొంతారి మాటవచ్చుటయు( గష్టముగ( దో(వ సై(ప(జాలక మెల్లగ( బడకనుండి లేచి యిటునటు గలపాత్రంబులు పరికింప, నవి యతని దుర్దైవంబుకతన( బేదవారియుదరంబులట్లు శూన్యంబులై పొడకట్టెను. వేదిమీ(దికలశంబుమాత్రము జలసహితంబై యున్నది. కొంతవఱ కూరకుండి యప్పటికి దప్పివెల్లువకు( దాళ(జాలక "ఆత్మానం సర్వథా రక్షే" త్తనునీతి ననుసరించి బ్రతుకుపై నాసచే నాకలశజలంబు గడగడద్రావివైచి రిక్తపాత్రిం బాతిన్నపై విడిచి యూర్పులు గొనుచు( బడకపై( గూర్చుండి భవిష్య మెట్లగునోయని భావించుచుండెను.

అంత( గొంతతడవున కరుణోదయం బగుడు ఋత్విజాలందఱు నొక్కరొక్కరుగ లేవ నారంభించిరి. లేచిన ప్రతివ్యక్తియు నట వేదికమీ(ద నొకవంక నొడిగిలియుండుకలశంబును మఱియొకవంక( బడియున్న నారికెడంబును జూచి మేల్కని యొదిగికూర్చుండు నృపాలు నవలోకించి భయవిస్మయములు పెన(గొన, ఏమిది? ఇట్లగుటకు( గారణ మేమి? ఇందలి జలం బేమయ్యె ననియడుగుచుండ నతం డేమనుటకు( దో(పక గుటకలు మ్రింగుచుండెను. అంత నందఱు నెదుటకు వచ్చి రాజా! నీవ యిట నిద్రింపక మెలకువమెయి నున్నా(డవు. నీకు( దెలియకుండ(బోదు. ఇతరు లిట( బ్రవేశింపరారు

నిజము చెప్పుము. పుంసవనం బైనయుక్కలశజలం బెవరు త్రావిరి? యని యడిగిరి. 'పలుగురు నిద్రించు నెడ నొకండు కూర్చుండరా'దని పెద్దలు పల్కుదురు. అందున్నగుట్టు నిపుడు గుర్తింపుడు. వారట్లడుగుచుండ నాన్నృపాలుం డన్నృతమాడ వెఱచి నిజము చెప్పివైచెను. అది విని చ్యవనుం డాననంబున నిర్వేదరుచి తోఁప నిట్లనియె.

రాజేంద్రా! మహాబలపరాక్రమశాలియై శత్రునైన నోర్చి సకలధరాతలంబు నేకచ్ఛత్రంబుగఁ బాలింపఁగలకొమ రుండు నీకుఁగల్గవలయునని సంకల్పించి యుక్కలశజలంబు విధి మంత్రంబులతో సంస్కరించి దానికి నమూల్యం బైనమత్తపో బలంబు వ్యయమొనర్చితి. అప్పానీయంబును గ్రోలి నిజముగ గురుతరాకార్య మొనరించితివి. దీని నన్యథాకరింప నశక్యము. నిక్కముగ నిది దైవకృతంబగాని యొండు గాదు. ఇట్లుజరుగు నని తొలుత మాకించుకయుఁ దోఁచలేదు. 'భవ్యం రక్షతి భవితవ్యతా' మనుట సత్యమయ్యె. అనిన విని యువనా శ్వుఁడు "తాము వచించినట్లు వాస్తవముగ దైవకృతంబ యిది. కాకున్న నా కంతటిపిపాస యెట్లొదవును? తదనుకూలంబుగఁ బాత్రంబులెల్ల నిట్లు శూన్యంబు లగు టెట్లుతటస్థించును? అప్పుడు క్షణమూరకున్న నుత్తరక్షణంబు నాది కాదని తోఁచి నది. విధిలేక యట్లొనర్చితి. మన్నించి తదనర్థంబు మమ్ముఁ బొరయకుండఁ గాపాడుఁడు. మీరు నిగ్రహానుగ్రహసమర్థులు. మీతంత్రంబులు భవితవ్యతామంత్రంబులు. మీవచనంబులు విష్ణుదేవుని శాసనంబు"లని వేఁడుకొనెను.

అది విని చ్యవనుం డిట్లనెను. 'నరేంద్రా! ఇంత వచింపం బనిలేదు. ఉపక్రమమునం దిక్కలశజలంబు గ్రోలువారికిం దాదృశలక్షణవంతుం డైనకొమరుండు కలుగ సంకల్పించితిమి. దాని నిపుడు వికల్పింప నసాధ్యము. కావునం దత్ఫలంబు నీ కనుభవింపక తీఱదు. అట్టికొమరుండు నీక యుద్భవిల్లును.' ఇట్లనునంతలో భృగుమహాముని యు నట కరుదెంచి తోడనే పాదములపై దండాపతితుం డైన ధరణీశు లేవనెత్తి జరిగినవృత్తాంత మెఱింగి, 'సరి, దైవనియోగం బట్లుండ దాని నెవరు తప్పింపంగల' రని యించు కాలోచించి 'కానిమ్ము గర్భధారణమునం గలుగుక్లేశంబు కలుగకుండుం గాక! మీ రుభయులు నిర్వ్యాజముగ వసింపుఁడు. సకాలంబునకు మా సన్ముఖమున సుఖపరిణామంబుగలుగ సుతుని గాంచంగలవు. మే మరయుచుందుము. చింత విడిచి సుఖముండుము. ముందు మేలగు' నని యతని దైన్యంబు తొలంగం బల్కెను.

తరువాత ధైర్యమూని యువనాశ్వుండు 'మహాత్మా! ధన్యుండనైతి. మాయదృష్టరేఖ యిట్లుండ నెవరేమిచేసెదరు? చేయంగలంతవట్టు చెప్పివైచితిరి. సంతోష' మనెను. భృగుండు మంచిది. ఇంక ముందుకార్యముల కరుగుదమన నందఱు నట నుండి స్వస్వకార్యంబులు తీర్చికొన నేగిరి.

---

# మూఁడవ ప్రకరణము.

—————:o:—————

పుత్రికామేష్టి పరిసమాప్తం బైనపిదప నాయువనాశ్వుండు భృగుమునీంద్రునానతిమెయి నిజపురంబున కరుగక మున్పటియాకుటింటనె యథోచితంబుగ వసించుచు మదికి నెమ్మదికలుఁగ నిత్యము మధ్యాహ్నసమయములందు మునులు వచించుధర్మముల నెఱుంగుచు, శ్రౌతవిధిజ్ఞులు గావించుశ్రౌతప్రక్రియావిమర్శనల వినుచు, నుపాధ్యాయులొనర్చుశాస్త్రీయచర్చల గ్రహించుచు, విద్యార్థులవాదంబు లారయుచుఁ గాలంబుగడపువాఁడు. ఒక్కొక్కప్పుడు చ్యవనమునిపల్కులు తలఁచి యులికిపడుచుండును. అతనిమాట కడ్డులేదు. అమ్మౌని నోటనుండి మాట వెల్వడెనేని శిలయందును జిగురు పుట్టునఁట. ఇదియే యతనియులికిపాటునకుఁ గారణము. ఒకనాఁ డింద్రుం డీచ్యవనమునిపై నీసుచేత వజ్రాయుధంబు వైవ నది యమ్మహానీయునిహుంకారమున కదరి వెనుకకుఁ బడిపోయెననియు నది మొద లింద్రునకుసైత మీతఁ డనిన భయమనియుఁ బెద్దలు చెప్పెదరు.

ఆదినమునఁ జ్యవనమునీంద్రునిపల్కులు చెవులదూఱి యంతర్గతములై యేదేనజ్ఞాతవిపరిణామ మొనర్చుచున్నవని యతని యనుమానము. వెలుపలఁగూడఁ దనకుఁ దెలియకయె యెప్పుడే నేదోయొకమార్పు తప్పక జరుగు ననుశంకతోఁ బ్రతిక్షణమును శరీరము నుపలక్షించుకొనుచుండువాఁడు.

అతనికాలంబున దానికిఁ దగినట్లుగ నలసభావమును, ముఖోదరపాణిపార్శ్వముల నూత్నకాంతియుఁ దోఁప నాయనుమానము గట్టిపడెను. అది గట్టిపడుటయెగాక యవలఁ గొలఁది రోజులకే యాతని యుదరమును గట్టిపడెను. అసలీయుదరము గట్టిపడుట కాయనుమానమే కారణమని మాయనుమానము. ప్రథమమునుండియు ధీరచిత్తుఁడై నిశ్శంకముగ నూరకున్న నేమయ్యెడిదో? భవితవ్యమిట్లుండ నెట్లూరకుండును? అది మొదలా నృపాలుఁడు తానెవ్వరో తత్వమరయక యొరులఁ గూడి చరింపను బరులఁజేరి భాషింపను మానివైచి యేకాంతవృత్తి కలవడెను. పాడుమనస్సెంతకైనఁ దగును. దానికిఁగల మహిమ దేవునికైన నుండదని నాతలఁపు. అది మనుజుని రోగము లేకయే కరుగత్రించును. కారణములేకయే వింతకర్జములఁ గల్గించును. వింతతలఁపులు పుట్టించి వైముఖ్యము నొదవించును. వేయేల ధైర్యములేకున్న వానిఁ గోఁతివలె నాడించును. మనోమహిమను దెలుపుకథ యొండుకలదు.

నాగులాపురములోఁ బాములు పట్టపగలుకూడఁ బాఱుచుండునని ప్రతీతి. ఆయూరి సంపన్నగృహస్థులలో రామశాస్త్రి యొకండు. పెద్దలు సంపాదించినభూములు గుత్తకిచ్చిన వరుమానము సరిగ రాదనియు భూములు పాడగుననియు సొంతముగఁ గృషిచేసినచోఁ బాడిపశువుల నిలుపుకొనవచ్చుననియు వానికి గడ్డి గాదము చాలినంత యుండుననియుఁ జేలగట్లపైఁ గూరనారలు కూర్చుకొనవచ్చుననియుఁ బిలిచినఁ బలుకునట్లు పదిమంది మనుష్యులు చేతిక్రింద నుందురనియు,నతిభ్య

భ్యాగతు లరుదెంచిన దానధర్మములకుఁ దక్కువ యుండ దనియుఁ దిర్యగ్జంతువులకుఁ దఱుఁగనియాహారము దొరకుననియు నిన్ని యూహాలతో జోడెద్దులఁ గొని వ్యవసాయము చేయు చుండెను. అది మహాసూలు కాలమగుటచేఁ బాడిపశువులు సైతము పొలమునందె యుండెను. పొలమునం దొకచిన్న చెఱువు, దానిచెంత నొకపాక యుండెను. పాకచుట్టును సొర తీగలు గుమ్మడితీగలు నల్లుకొనియుండెను. ఒకనాఁడు దీప ములుపెటువేళ మించి కనుచీఁకటి పడుచున్నది. అత్తఱి మన రామశాస్త్రి దూడను విడిచి పాలచెంబు నుట్టిలోఁబెట్టి బిగించి చేతిలోఁ బట్టికొని మఱియొకచేతితో తేపటికూర కగునని పాదునఁ గలగుమ్మడికాయను ద్రెంచి పట్టుకొని పొద్దయ్యెనని దూరదూరముగ నంగలువైచుచు నింటికి వచ్చుచుండెను. ఊరు దరికిఁ జేరుసరికి నడుమునఁ గట్టిన వెండిత్రాఁడు, చీల జారినం దున దిగజారి యాతని యురవడికిఁ దుళ్ళిపడుచుఁ జుఱుక్కున గీఁచుకొనెను. తోడనే 'అయ్యో చచ్చితి, పాము కఱచె' నని యఱచుచుఁ బాలచెంబొకవంక గుమ్మడికాయ యొకవం కను జెదిరిపడ నతఁడు పదిమూరలదూరమున నెచ్చరికలేక పడిపోయెను.

అప్పటికిఁ 'బొద్దుపోయె నింకను రాలేదేమికారణమో పాములు పెల్లుగఁ బాఱాడుచున్నవఁట. నిన్నఁ దన్నుఁ బాము తఱిమినదని పాలికాఁపు చెప్పియుండె' నని యనుచుఁ గొడు కును బిలిచి 'పాలికాఁపుతో లాంతరుపట్టించుకొని చెప్పులు తొడ్గికొని కఱ్ఱ చేతఁ బట్టుకొని మీనాయన కెదురుపొమ్ము

తండ్రీ! ఇంకను రాలేదు !' అని చెప్పి యతని యిల్లాలు పంక నాయిద్దరు బయలు వెడలి వడివడిగ నడచుచు నూరుదాఁటి పది బారలదూరము వచ్చి నుఱుగులు గ్రక్కుచు నెఱుకలేక పడి యున్నాతని నాతురమునఁ బొలమునుండి యిలుచేరుమఱియిరు వురు కర్షకులు సాయపడఁగ నింటికిఁ దోడ్కొని వచ్చిరి. తోడనే మాంత్రికుఁ డరుదెంచి గ్రుక్క త్రిప్పుకొనక మంత్రము పఠించుచుఁ జివరకుఁ 'బాయెపో, పాయెపో' యని మేనిపైఁ వేఁపమండతో విసరుచుండఁ గొంతవడి కతడు కన్నులు దెఱచి ఇశ్ అబ్బ- అయ్యో ! యనుచుఁ దలద్రిప్పుచు మూల్గుచుఁ గాలుసేతులతో మంచమును గొట్టుచు నారాటపడుచుండెను. మాంత్రికుఁ డాతనం గాంచి యేమి యని యడిగెను. అతఁడు 'పాము కఱచెను. చనిపోవుదును. బ్రతుక'నని యందఱివద్ద ననుజ్ఞగొనునట్లు చేతులతో సైగచేసెను. మాంత్రికుఁడు " మాట్లాడరేమి "? యన " గుండె యడఁచినట్లున్నది. మాటరా"దని మరల సైగచేసెను. అప్పు డందఱు నిరాశా ముఖులై కళవళపడసాఁగిరి. ఇంతలో నాయూరిపెద్దకాఁపు కొండారెడ్డి యటకు రాఁగ నందఱు రెడ్డి వచ్చెననుచుఁ ద్రోవ నిచ్చిరి. అతఁడు మంచముదరికి వచ్చి 'తాకవచ్చునాండి'యనఁగ నిల్లాలు అయ్యో - తాకు నాయనా ఇంకేమిమడి?- అనుడు నూరకొనుఁడని యాయనవద్దఁ గూర్చుండి నాడి పరీక్షించి శాత్తుల్లుగారూ! "ఎట్లున్నదండి"అనియడిగి 'బ్రతుక'నని యూర టముతో సైగచేయ 'శాన వూరుకోండి' యని కసిరి గాయము పరీక్షింప నెంచి దీపము చేతనందుకొని చూచి యది గీఁచు

కొనిపోయి నట్లుండ "నిది పాముకాటువలెఁ గన్పించుచున్నది. నాడియందు నవలచ్ఛనమును లేదు; భామ్మఁడు బమపడెనా చీఁకటిప్రొద్దున ?" ఇట్లు తర్కించుకొనుచుఁ బైకిఁబోయిన కట్టుపంచెను గ్రిందికి నద్దుచు నపుడందు మొలత్రాటిచీల కన్పింప దానిఁ గైకొని "మీ మొలత్రాడేమైనదండీ శాస్త్రుల్లు గారూ చీలయిదిగో" యనిచూప నతఁడు కటిప్రదేశమునఁ గరము పెట్టి చూచుకొని తెలియదన్నట్లు సైగచేసెను. తత్క్షణ మిద్దఱిని దీపము తీసికొనివెళ్ళి దోవలోఁ జూచిరండని పంపి, యాయిర్వురు శీఘ్రము కదలి వెదకుచుఁ బోయి యతఁడు పడినచోటనె యొకమూల దీపపు వెలుఁగునఁ దళతళ మెఱయు మొలత్రాటిని గొనివచ్చి యాయ నందుకొని యది దొరకిన తావడిగి తెలిసికొని దాని రెండుకొనలు కలిపి చీలను పెట్టుచుండఁ జీలసంతనకుఁ జివర రక్తరేఖ గన్పింప నిజము తెలిసినట్లు కన్నులింతచేసి "ధన్నా చెక్కా యిదా దీనిగుట్టూ !" యని యందఱు వినుట కాతురపడుచుండ 'శాస్త్రుల్లుగారూ! మిమ్మల్ని కరచింది పాముకాదండీ మీ మొల్త్రాడు. చూడండీ, దీన నెత్తురున్నదని కంటియెదుటఁ బెట్టెను.

అంత నామిథ్యాసర్పదష్టుఁడు - ఆఁ- ఆఁ - యనుచు దానిఁ జేతఁగైకొని యందున్న నెత్తుటిగీర కన్నారఁ గాంచి బరువు తఱుఁగ గుండెనిబ్బరపడ నుదుటున లేచి 'జౌర! ఎంత విభ్రాంతి!! రెడ్డీ! నిన్న మాపాలికాఁపు కూరెళ్ళవారిచేనిలోఁ దన్నుఁ ద్రాఁచు తఱిమినదని నాకుఁ జెప్పెను. నేను నచ్చటికి వచ్చునప్పటికిఁ గొంచెము చీఁకటిపడినది. ప్రక్కన

చరచరమనుచప్పుడు కాఁగ భీతిల్లి మిగులతొందరతో వచ్చు చుంటి. ఆసమయమున నిదేకావలయు నున్నఁగఁ గాళ్ళకుఁ దగిలి వేగమునకుఁ దుళ్లి చుఱుక్కున గీఁచుకొని దూరముగ నెగిరిపడినది. అంతనే కాళ్ళ కడ్డుపడి పాముకఱచి పాఱిపోయి నదని బ్రమిసినాఁడనని సర్దుకొనుచుఁ బలికెను.

ఇదిగో మీకాలిమీఁదిగీర చూడండి. సగము నెత్తురు గీర సగము పట్టిగీర. పాముకా టిట్లుండునా? అని రెడ్డి యనెను.

అవునుసుమా! చాల పొరపాటు.

"నాతెలివి తగలడా నేనూ చూడలేదమ్మా ఇంటి కొచ్చినా కామొల్లాడును" అని యిల్లా లనెను.

"పాము కఱచినదనగనె పరికింపక మంత్రింప మొదలు పెట్టిన నా తెలివి చూడండి" యని వైద్యుఁడు పల్కెను.

"ఒక్కొక్కప్పు డిట్లనే పొరపా టౌస్తుంది" - అని రెడ్డి యనెను.

"చాలాతమాషగా నున్నది" అని తక్కినవా రంద ఱనిరి.

తరువాత నవ్వుకొనుచుఁ దమతమ నెలవుల కరిగిరి.

కనుక నెవరైననుసరి ధీరచిత్తులు కాకున్న నిట్లు లేని పోనియనుమానములకుఁ విభ్రాంతులకు వెఱ్ఱితలఁపులకుఁ దప్పక వశులగుచుందురు. పోనిం డామనోమహిమ నట్లుంచి ముందు చ్యవనునితపోమహిమఁ దెలియుదము.

చ్యవనమునీంద్రునిసంకల్ప మట్లు పిండరూపుగ నేర్పడి కాలక్రమమున నది యాతనిదక్షిణకుక్షియందు నారికేడంపు మొలకమెలపునను, గదళీప్రసవంబుకరణి, వంశాంకురంబు వడువున వృశ్చికగర్భంబురీతి నభివృద్ధినొందుచుండెను. విధాతృనిసృష్టివైభవ మెంత విచిత్రమైనదో విచారింపుఁడు. ఆతరుణంబున రాజేంద్రునుదరంబు రతనంపుమూటవలె రంజిల్లుచుండెను.

కొంతకాల మతిక్రమించినపిదప నొకనాఁడు భృగ్వాది మునివరులు పూర్ణగర్భుండగుట నెఱింగి పృథివీపతిని బరామర్శింపవచ్చి ప్రయత్నపూర్వకముగ లేచి నమస్కరించునాతని 'నచిరంబునఁ బుత్రవంతుఁడ వగు' మని దీవించి కూర్చుండఁ బంచి కమండలూదకంబు ప్రోక్షించిరి. అత్తఱి నతిభారంబయి ముట్టినఁ బెటిల్లుమనునట్లుండునతనియుదరము కూర్చుండువేళఁ బెటిల్లుమని పగుల దక్షిణకుక్షినుండి తత్క్షణమ తరుణార్కసన్నిభుం డైనయర్భకుం డావిర్భవించెను. ఆశిశుతేజంబుతో నాప్రదేశమంతయు నతిప్రకాశమానమై విలసిల్లెను.

కనుగొనుఁ డిప్పట్టునఁ బ్రాచీనఋషులవచనమాహాత్మ్యమును. వారు సిద్ధసంకల్పులు. మొదట సంకల్పించుటె యరిది. సంకల్పించిన జరిగితీరును. వారి వాక్ప్రపంచమున నసంభవ మనుపదమే లేదు. వారివచనము ననుసరించియే కాఁగలప్రయోజనములు సిద్ధించుచుండును.* మఱియు నది

---

* లౌకికానాంహి సాధూనా మర్థం వా గనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి.

కృతయుగము. ఆ కాలమునఁ గృతము కృతమే కాని - కృతమును గుఱించి వేఱొకకర్తవ్య మాలోచించుపద్ధతి లేదు. కావున నా కాలమునకుఁ గృతయుగమను పేరు కలిగినది. కాలమహిమయు నట్లుండ వారిమహిమ కేమికొదువ యుండును?

ఆయర్భకుం డావిర్భవించినవెనుక నప్పుడమితేఁడు పుడమిపై నిశ్చేతనుఁడై పడియుండెను. తదేకశరణ్య యగు రాణి మొదటినుండియు రాజేంద్రునప్రతీకారావస్థం గాంచి దినదినంబును జింతఁ గృశించుచుఁ దుద కిది యెట్లుపరిణమించునో యని భీతిల్లుచుండెను. దాని కనుగుణముగ నేఁడు తేఁ డిట్లగుడు నామెయు నాకష్టంబు భరింపఁజాలక స్మృతితప్పి నేలఁబడెను. పుట్టినశిశు వాగర్భమునందుఁ దొట్టెలో బిడ్డఁడట్లు కావుకావుమని యేడ్చుచుండెను. అచ్చటిస్థితిగతు లిట్లుండ నత్తఱి నటకుఁ జూడవచ్చి వారినిస్సహాయతకు వగచుచుఁ గర్తవ్యమునకు నుద్యుక్తలయినపురంధ్రీతిలకంబుల నవలోకించి భృగువానియుఁ గొందఱు రాణికి శైత్యోపచారములు సలుపను, మఱికొందఱు శిశువు నెత్తి జలకమాడింపను, బూనుకొన నియమించి తాను 'సంధానకరణి, సంజీవకరణి' లను మహౌషధులను దెప్పించి యాతనియుదరంబును ద్రేవులఁ బదిలపఱచి శుభ్రముచేసి సంధానకరణితో సంధించి వెట్టఁ బుట్టించుగుణము గలసంజీవకరణిపసరు మై నలఁది శీతాతిశయముచే స్తబ్ధములైనప్రాణవాయువులకుఁ బ్రబోధముకల్పించెను. అంతఁ గీయిచ్చినగడియారమువలె గుండె కొట్టుకొనఁ దొడఁగుడుఁ దోడనే యతండు కనులు తెఱచియు శ్రమయంతయుఁ బూర్తిగఁ దీఱనందున మరలఁ గన్నులు మూసెను.

ఇట సిరలీ రాజసంజీవనక్రియామగ్నులై యుండ నట విప్రకాంతలు కర్తవ్యముల నిర్వర్తింప నా పాపఁడు శారదాభ్రశకలములననుమఁ జెలువొందు చంద్రునిపోల్కి వెలిపాత్తి కల సత్తపుల్లి "ఏక్కుమాలిన మొరాలింపం బ్రపుణ్యాత్ములు లేరే" యను రీతిఁ జేతులు కలుపుచు విప్పుచు నాఁకలి పెల్లునఁ గువ్విసుస్తకడ నేడ్చుచుండెను. ఎంత యేడ్చినను దానికిఁ బిత్తుస్త్ర మొసంగువా రెవరు? జననక్రియము లోకవిరుద్ధకంబాన్. ఆయేడ్పు విని జాలిగొని భృగుమౌని తక్కినవారల నుద్దేశించి ఈశిశువు 'కింధాస్యతి' (దేనిని ద్రాగును) అని యాలోచన కడిగెను. ఆతరుణమునకు సరిగ నారాయణప్రేరణాముస నింద్రుఁ డటకుఁ జనుదెంచి భృగుమౌని ప్రశ్నకు సమాధానముగ 'మాంధాస్యతి' (నన్నుఁ ద్రావును) అని పల్కుచు సుధాస్యందిని యైనతనతర్జని బాలునోట నిడెను. నాఁడు పోసినవాఁడు నీరు పోయకమానునా! అప్పుడాశిశువు తదంగుళీనిస్సృతం బైనయమృతంబు ద్రావుచుఁ జూచుచుండఁగనే యపరిమితతేజస్సత్త్వంబులు గలిగి యాఱుమాసముల నిసువ ట్లభివృద్ధి చెందెను. అందఱు నాశ్చర్యపడిరి. అప్పుడు సుఖసుప్తినుండి మేల్కాంచినట్లు కన్నులు తెఱచి "హా"యని సుఖస్ఫోరకనిశ్శ్వాసంబు విడిచి యెదుటఁ బొత్తికలలో నునుపాలమెఱుఁగు లీను బాలుని, వాని చెంత దివిజాధిపుని నతని వెనుక మునులను గాంచి, కలయా? నిక్కువమా? ఏమిది? యని వెఱఁగుపడు నరపాలు నవలోకించి రాజా! ఈతఁ డింద్రుఁడు; హరికనుపున నీకొమరున కమృతంబు గుడుపవచ్చె. నీకొమరుండు చక్రవర్తిలక్షణలక్షితుండు. అల్లదే యమృతంబు

ద్రావి యధికతేజంబుతో వెలుఁగుచున్నవాఁడు. కనుఁగొనుము. నీకష్టంబులు కడముట్టినవి. నీజన్మంబు సఫలంబయ్యెం. మాసంకల్పంబు నీడేరె. ప్రజలును భాగ్యవంతులు. సర్వంబు సుప్రశస్తంబు. ఇట్లని భృగుమౌని పల్క నృపాలుం డుత్థితుండై మహాత్ములారా! మీయనుగ్రహంబున కే నెంతయుఁ గృతజ్ఞుండ. త్రిలోకపాలకా! మన్నింపుము. మీ దర్శనంబుచే మిగుల ధన్యుండను. తాము చూపినదయతో నాపితరులును దరించిరి. ఈచిఱుతవాని కావంతయుఁ గొఱంత కల్గక యాయుష్మంతుండై బరఁగ ననుగ్రహింపవే యని ప్రార్థింప నతండు నీకొమరుండు నారాయణాంశసంభూతుఁడు గాన నేమిటం గొదవయుండదు. అమృతంబు ద్రావినకతన నన్నప్రాశనం బగుదనుక నాఁకలిదప్పి లీశిశువును బాధింపఁజాలవు. ఆతంకము లండఁజేరవు. చిరాయుష్మంతుం డగు. ముందు మమ్ము ధరించుఁగాన "మాంధాత" యనునామ మీయర్భకునకుఁ జెల్లు. ఇతండు పెరిగి పెద్దవాఁడై భృగుమౌనియనుగ్రహంబున సకలవిద్యలు సక్రమంబున నేకసంధాగ్రాహిత సమగ్రముగ నేర్చి యప్రతిపప్రతాపశాలియై ధార్మికాగ్రగణ్యుండై ధరాతలం బఖిలంబు నేకచ్ఛత్రముగ బహుకాలంబు పాలించుసార్వభౌముం డగును. కొమరుఁడు నిఖిలవిద్యావేది యగువఱకు మీ రియ్యెడనే వసింపుఁడు. మేలగును. పోయివచ్చెదమని యతండు ఋషులయనుజ్ఞ గొని నిజపురమున కరిగెను. అంత నమ్మునివరులును నేఁటికిఁ బోయివత్తుము, అనుష్ఠానమునకుఁ బ్రొద్దయినది; సుఖముండుఁ డని తమయిరవుల కేఁగిరి.

# నాల్గవ ప్రకరణము.

———— :0: ————

అనంతర మాయువనీశుం డాత్మజుని గాంచి పట్టరాని సంతోషముతో నెత్తి లోపలనుండి బాలు నెత్తికొన నున్మ నస్కృమై వచ్చుపత్ని కందీయ నాపెయు నాముద్దులగని నెద నదుముకొని శిర మాఘ్రాణించి ముద్దాడెను. ఆకిశోరమును గాంచినతోడనే తమక్లేశమంతయు మఱచి క్షణకాలము సుతముఖకమలదర్శనసుఖ మనుభవించుచు నిరువురు నీరవులయిరి. ప్రపంచకమునం దందఱికంటెను భగవానుఁ డీయమూల్యం బైనసచేతనఫలంబు నొసఁగుటచే నధికసుకృతవంతులుగాఁ దలంచి సంతోషాతిరేకమున నిట్లు మాట్లాడఁదొడఁగిరి.

రాణి:-నాథా! ఇంతకాలంబునకు మన ద్వారంబునకుఁ దోరణంబు గట్టు నదృష్టమ్ము తటస్థించినది. ఇందుల కీమునివరుల యనుగ్రహము ముఖ్యకారణము. కావునఁ దత్ప్రీతికరంబుగ భూసురసందోహములకు సమారాధనంబు గావించి యామ్మునిపత్నులకుఁ గోరినవస్త్రాభరణంబు లొసంగవలదె!

రాజు:- "అవశ్య మొసంగుదము. అంతకు మించినకార్య మొండు కలదె?"

"మనపురంబున కీవార్త నెపుడు తెలియఁబంపెదరు?"

"మఱునాఁడు"

"అచ్చటఁగూడ సకలజనులకు సంతుష్టిగ గోభూహిరణ్యవస్త్రదానంబుల నవ్వారిగ మూఁడురోజు లన్నదానము

నాచరింపవలయునండీ. మాచిట్టినాయన పుట్టినపండుగ యందఱ కానందకరంబు గావలయు.”

“దేవీ! నారెండవహృదయమవు నీవు చెప్పినవానిలో వీసమైనఁ ద్రోసివేయను. మఱియు నీ శుభసమయంబున నీ వన్నట్లు సర్వజనులు సంతోషముపొందుట శ్రేయము. కావున నిర్బంధితులను విడిపించెద. సకలకార్యాలయములకు విశ్రాంతి గలిగించెద. సకలపరివారమునకుఁ బారితోషికములఁ బంచి పెట్టించెద. పురమున నుత్సవంబు సలుప నియోగించెద.

ఇట్లు మాట్లాడుకొనుచుండ శిశువును జూచు వేడుక మునికాంత లట కరుదేర వారిమాటలకు విరామము ఘటిల్లెను. అప్పు డాదంపతుల కీపుత్రలాభ మూఱిపోవు దీపమునకుఁ దైలము దొరకినట్లును, జీకటింటికి వెలుఁగు కలిగినట్లు నయినది. మఱునాఁడు మహీశుండు ముఖ్యామాత్యుఁ డైనసుమంత్రుని కీశుభవర్తమాన మంపుచు నాలోచించుకొనిన తెఱంగున సర్వంబు జరుపుటకు నామకరణమహోత్సవంబునాఁటికి వలయు సకలసంభారములు సేకరించుకొని వచ్చుటకు నుత్తరువొసంగెను. సుమంత్రుఁడు నవ్వర్తమానము విని చాలసంతసించి పురమునఁ జాటఁబనిచెను. పౌరులెల్ల నమితానందభరితులైరి. కోసలదేశప్రజ లందఱకుఁ జాలముచ్చట యయ్యెను. అంత సుమంత్రుఁడు సర్వము నిర్వహింప నామకరణమహోత్సవంబు నతి సుప్రశస్తంబుగాఁ జెల్లె. సకలమహీసురులు సంతృప్తులై నిండుమనమ్ముల దీవించిరి. అక్కాలంబున నాయగ్రహారమంతయు నానందనిలయమై విలసిల్లెను. అమ్మహోత్స

వమునకు వచ్చినపౌరసామంతప్రముఖులు సుమంత్రుఁడు పురమునకు రమ్మని ప్రార్థించిరి. ఆరాజన్యుఁడు మీరెల్లరు వేయి కన్నులఁ బరికించుచుండ నా కిదియు యయోధ్యాపురంబు. ఇమ్మహనీయుసహవాసంబు నామనంబు విడనొల్లకున్నది. ఇయ్యెడనే బాలుండు పెద్దయగువఱకు వసింపుఁడని మహేంద్రుఁ డానతిచ్చెను. కొఱంత కలుగకుండ సుమంత్రుఁడు చూచుచుండునుగదా! మేము నారయుచుందుము గాక! అచిరకాలమున మీయభిలాషమును బూరించువాఁడ. ఇప్పటి కిట్లు జరుగనిండు." ఇట్లని వారిని సమాధానసత్కారములఁ గావించి సాఁగనంపెను.

•

నానాఁట నానృపకిశోరము మునిపత్నులయంకపాళికల నూఁగులాడుచు, మునివరుల జన్నిదంబులు సాఁగఁదీయుచు జపమాలికల నూడలాగుచు, గడ్డంబులఁ గైవసము చేయుచు, "నీయిల్లు నేలకట్ట" "నీయింట పటాలము కాను," "నీకడుపు కందగడ్డగాను, అసాధ్యుఁడవురా" యని యందఱచేఁ దిట్లు తినుచు నీడుకు మించిన దేహము, దేహమును మించినబలము, బలమును మించిన తెలివి, తెలివికిఁ దగినరూపు, రూపునకుఁ దగినగుణములు, గుణముల వెలువరించు చేష్టలు, చేష్టలకుఁ దోడైనతియ్యనిపల్కులు వెలయ నయిదేండ్లవాఁడై యుప్పు డప్పు డాశ్రమపదముల నల్లరిచేయు నసాధుమృగముల నడలఁ గొట్టుచు, సాధుమృగముల సమాశ్వాసించుచు, నీడుబుడు తలఁగూడి యాడుచు, వాటకూటముల బాడితీర్చుచు, జగడముల సర్దివేయుచు, నుడుకుతో నేడ్చుబాలకుల నూఱడింపుచుఁ

జేతనున్న భక్ష్యంబులఁ బంచియిచ్చుచు, దారకులు తన్నుఁ జుట్టిముట్టి తిరుగఁ బూసలలో దారమువలె మెలఁగుచు బాలకులు ప్రభువుగ భావింపఁ బ్రవర్తిల్లుచుండువాఁడు.

ఒకనాఁ డొకముని దారకుఁడు తల్లి కడఁ జబుతిండికై యేడ్చుచుండ వాని సీవలకుఁజేరి " ఇంద తీసుకో " యని తన చేత నున్న భక్ష్యము తినవిచ్చి, " ఇంకా కొంచెము తెచ్చిపెడా ఏడవకు. ఊఁ " అని యింటికివచ్చి, కూర్చున్నతల్లి యొడిలోఁ గూర్చుండి పైఁటచెఱఁగు చేతితో మెలివైచుచు మెల్లగ నిట్లు ప్రారంభించెను.

"అమ్మా! మఱే వాళ్ళబ్బాయి యేడుస్తున్నాడేవ్ "

తల్లి:- " ఎందుకు ? కొట్టితివా?"

కొడుకు:- (మొగము చిట్లించుకొని) "ఎప్పుడూ యిట్లాగే అంటావు. అన్నీ అబద్ధాలు. అసలు నే నెప్పుడైనా యెవరినైనా కొట్టగా చూశావూ ? "

" మొన్న పులిపిల్లను కొరడాతో కొట్టలే "

" అది దగ్గిరికెడితే గుఱ్ఱుమని కోరలు చూపింది. అందుకని కొట్టాను. పులిపిల్లని కొట్టానని పిల్లల్ని కొడ్తాననుకున్నావా ! పాపం వాళ్ళేంచేశారూ ? "

" అయితే సరేగాని నీచేతిలో చిలు కేదీ ?

(విజయసూచకముగ నవ్వుచు) హెగిరిపోయింది. (అని తల్లిని కవుఁగలించుకొనెను)

" జౌరజాణ ! ! చక్కెరచిలుక యెగిరిపోయిందా ? "

(చిబుకము పుణికి ముద్దిడెను.)

(స్వరముతగ్గించి) "లేదమ్మా వాళ్ళిబ్బాయి యేడుస్తుం
టే యిచ్చాను."

"ఎంగిలి దిచ్చావా ?"

"అందుకనే నా కోపం వచ్చేది, మొన్న చెప్పావు
కాదూ ఎంగిలిది పెట్టొద్దనీ."

(ఉట్టిలోని చక్కెరచిలుక నొకటి తీసి చేతికిచ్చి) "ఏదీ
దీని నెగురగొట్టు చూస్తాను"

(నగుమొగముతో) "అమ్మా దీన్నెగరగొడ్తానేం ఆడు
కోవద్దూ" అనిపల్కి గంతులువైచుచు సంగడికాండ్రతో
నాడ నేగెను.

ఈరీతి జన్మప్రభృతి సుస్నిగ్ధహృదయుం డగుకొమరుని
కోమరికంబున క్రొంతయు ముగ్ధుండగుచు యౌవనాశ్వుండు
సంతసమునం గాలము గడపుచుండ నైదేండ్లు వెళ్లుచున్నవని
కుమారునకు శుభముహూర్తమున నక్షరాభ్యాసమున కుపక్ర
మించెను. అదిమొదలా బాలకుఁడు ప్రతిదినము నుపాధ్యా
యుఁడు విడిచినతోడనే యింటికి వచ్చి, చెప్పినపాఠమును
తు, చ, తప్పకుండఁ దల్లిదండ్రులకడఁ జెప్పుచుండువాఁడు.
ఇవ్విధమునఁ జెప్పినపాఠము చెప్పించుకొనక కొలఁది కాలము
నకే చదువను, వ్రాయను నేర్చి, గుణించుట, భాగించుట,
మొత్తముచేయుట, తీసివేయుట, మున్నగు లెక్కలనుగూడ
నేర్చికొనెను. పిదప సకాలమున నుపనీతుండై యధ్యయన
మున కారంభించెను. ప్రతిమాసమునందును శుక్లపక్షము
నందు వేదమును బఠించుట, కృష్ణపక్షమున వేదాంగములైన

శిక్షావ్యాకరణములు, ఛందోనిరుక్తములు, జ్యోతిషము, కల్పసూత్రములు క్రమముగ నీయాటికి బోధించుటయు నప్పటియాచారము. దాని ననుసరించి క్రమముగ నన్నిటి యందుఁ బ్రవేశము లభించినపిమ్మట నీమాణవకుఁడు భృగు మౌనితోడ శాస్త్రాభ్యాసమున కుపక్రమించి యచిరంబున సకలశాస్త్రముల నామూలాగ్రముగ నేర్చెను. అతనిపూర్వ జన్మసంస్కారమెట్టిదో కాని యుపదేశమాత్రంబుననే సకల విషయంబులు వచోవిధేయములగుచుండెడివి. సులభగ్రహ ణము, శీఘ్రస్ఫురణము, చిరకాలధారణము, నవనవోన్మేష ప్రతిభయు, శ్రద్ధయు నతనిసొమ్ములు, ఉపాధ్యాయు లతనికిఁ బాఠమువచించుట మిగుల వేడుకపడుచుండువారలు. ఒక్కొ క్కప్పు డతఁడు వేయుప్రశ్నలకుఁ బ్రత్యుత్తరమీయ భృగు మౌనియు నించుకయోచించువాఁడు. ఇంతశక్తి యుండియు నించుకయు గర్వంబు నెఱుఁగఁడు. ఒక్కనితోడను గలహించి యుండలేదు. ఆకాలంబున భృగ్వాశ్రమ మొకగొప్పవిద్యా పీఠముగ నుండెడిది. అందువలన నచటఁ బెక్కండ్రు విద్యా ర్థులు వసించుచుండువారలు. వారిలో నీతని కొక్కఁడును విరోధి లేకుండెను. ప్రతిదినంబును జదివినపాఠములందు సంశ యముగలవారికి వేఱొకచోటఁగూర్చుండి సరసోదాహరణ ములతో నిస్సంశయముగ బోధించుచుండువాఁడు.

పాడ్యమి, అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య మొదలయిన యనధ్యయనదినంబులందు విద్యార్థు లందఱు నొక్కెడఁగూడి శాస్త్రీయవిషయములను గుఱించియు లౌకిక

విషయములను గుఱించియు నుపన్యాసములు, విమర్శనలు, వాదములు చేయుచుందురు. ఏకూటమునందును గడపటియుపన్యాసము మన మాంధాతృనిదే. అది వినుటకును విద్యార్థులందఱు కదలక మంత్రముగ్ధులట్లుండువారు. బాలకులు వేడుకకై యప్పుడప్పుడు కట్టుకద్దెములు చదువుచుఁ గర్తృగుప్తి, కర్మగుప్తి, కాలగుప్తి, క్రియాగుప్తియుఁ గలశ్లోకములను సమన్వయించుట, యక్షరపూరణము, పదపూరణము, వాక్యపూరణము, సంఖ్యాపూరణము, సమస్యానిర్వాహణము మొదలయిన చమత్కారములను సలుపుచుండువారు. అందుఁ బ్రథమబహుమానము మన కథానాయకునిదె యగుచుండెడిది. ఈ చెప్పినదంతయు నమ్మక యతిశయోక్తియని యూరక త్రోసివేయుపక్షమునఁ బ్రపంచకమే నిస్సార మనవలసివచ్చును. ఈ రాకొమరుఁ డిట్లు బుద్ధిపరిశ్రమమందే కాక దేహపరిశ్రమమందు, శరలాఘవమునందు, లక్ష్యపరిజ్ఞానమునందు, శబ్దవేదనమునందును అందెవేసినచేయి.

ఈవిద్యల కన్నింటికిఁ బరమాచార్యుఁడు భృగుమహర్షి. అమ్మహానీయునను గ్రహవిశేషంబుచేతనే యీవిద్యలన్నియు నీతనికిఁ గరతలామలకములైనవి. అక్కాలంబున నీతనితోఁ గూడఁ బలువురు రాజపుత్రులు భృగుమహర్షివద్ద విలువిద్దె గఱచుచుండువారు. గదాయుద్ధ, ఖడ్గయుద్ధ, మల్లయుద్ధ, ద్వంద్వయుద్ధ తుములయుద్ధములందు గడిదీరి వారిలో నీ యౌవనాశ్వుఁ డుద్దండపిండమై నెగడెను. విలువిద్దె నేర్పు

రోజులలో నొకనాఁడు భృగూత్తముండు రాకొమరుల నొక్క-
డఁ గూడఁబనిచి తాను ముందు నిలిచి యొకనిం బిలిచి, 'వత్సా! నన్నుఁ జూడుము. మీసమాజమును జూడుము. ముందున్న చెట్టును దానిచివర నుండుపక్షిని జూడు'మని యతండు 'చూచితి'నన 'మే మందఱము నగపడుచుంటిమా?' యని 'యగపడుచుంటి'రని యతఁడు వెండియుఁ బ్రత్యుత్తర మీయ 'మంచిది వెనుకకుఁబొ'మ్మనె. ఇట్లందఱిని వరుసగఁ బిలిచి యడుగ వారందఱు నిదేప్రకారము ప్రత్యుత్తరమిచ్చిరి. తుదకు మాంధాతృని బిలిచి యట్లే యడుగ నతండు తుది మాటకు సమాధానముగ "నాకుఁ జెట్టుమీఁద నున్నశకుంతంబుతప్ప నన్యంబు కన్పించుటలే"దని పలికెను. అంత నాగురుండు 'సెబాస్ కుమార! చిరంజీవ' యని మూపు చఱచి విన్నఁదనంబునఁ దలలు వాల్చినతక్కినవారిం గని 'కుమారులార! ప్రతిమానవునకు లక్ష్యపరిజ్ఞాన మత్యంతావశ్యకము. అది విలుకాండ్రకు మఱియు నావశ్యకము. లక్ష్యపరిజ్ఞానము లేకున్నచో నెవఁడు నేపనియందును గృతార్థుండు కాఁజాలఁడు. ఎద్దాని నాచరింపఁదలపెట్టితిమో దానియందు మనమనోదృష్టుల నిగుడ్పవలయును. అట్లు చేయఁజాలనినాఁడు తలపెట్టినకార్యము తలకెక్కింపఁజాలము. కానిం డిప్పటితో నిది ముగియలేదుగదా! మఱియొకసారి చూచుకొందము. ఇంక మీయిరవుల కరుగుఁ'డని వారిం బంపివైచి తానును దనయిరవున కరిగెను.

* ఆచార్యుం డజ్ఞునకును బ్రాజ్ఞునకును సమముగనే విద్య గఱపును. ఒకని కున్నశక్తి నపహరింపఁడు. ఇంకొకనికి లేనిశక్తి నారోపింపఁడు. అయితే మట్టిముద్ద ప్రతిబింబమును గ్రహింప లేదు, స్ఫటికమణి గ్రహించును. ఈగ్రహణశక్తినిబట్టి యయ్యి రువురకు నతిమాత్రభేదము విధిలేక కలుగును. శక్తి లేకపోయి నను శిష్యుఁడు శ్రద్ధాళు వగునేని విసువుచెందక యుపాధ్యా యుఁ డొకసారికిబదులు పదిసారులైనను వానికి బోధింప వెను దీయఁడు. శ్రద్ధలేనివాని కెవ రేమిచేయుదురు ?

అనంతర మొకనాఁటిప్రాతఃకాలమున భృగుమహర్షి ధనుర్విద్యయందుఁ గృతహస్తుం డైనమాంధాతృని దనతోడ గంగానదికిఁ బిలిచికొని వెడలి వత్స ! మాంధాత ! ఆయుధ పరిశ్రమమునందు జితశ్రముండ వైననీకు దివ్యాస్త్రంబులను సప్రయోగోపసంహారముగ నీపవిత్రగంగాతరంగిణీతీరమున నుపదేశించి కృతకృత్యుండఁ గాఁదలంచితి. సావధానుండవగు మనుడు నతఁడు 'ధన్యోస్మి' యని యమ్మునియడుగుల దండ ప్రణతుండై లేచి వార్చి యుదఙ్ముఖుండై చేతులు జోడించి నిలువ నయ్యాచార్యశిరోమణి యస్త్రాధిష్ఠానదేవతల క్షణ మాత్రంబు ధ్యానించి యవి ప్రసన్నంబు లగుడు నాశిష్యు నకు వరుసగ బ్రహ్మ నారాయణ పశుపతిదేవతాకంబు లైన

* వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే
నచఖలు తయో ర్జ్ఞానే శక్తిం కరో త్యపహన్తివా
భవతిహి పున ర్భూయా న్భేదః ఫలంప్రతి త త్తథా
ప్రభవతి మణి ర్బింబగ్రాహే శుచి ర్న మృదాదయః.

యస్త్రంబులను, ఐంద్రాగ్నేయవారుణవాయవ్యాస్త్రంబులను మఱియు నితరాస్త్రంబులను బ్రయోగోపసంహారములతో నుపదేశించెను. అవగతంబగుట నావిద్యాస్నాతకుం డొక్కతూరి యయ్యస్త్రమంత్రముల నుచ్చరింపం దొడనే యవి రూపుగొని తళతళ మెఱయుచు నెదుటం బ్రత్యక్షమై మాయొనర్పు కార్యం బెయ్యది యనియెను. అతం డాశ్చర్యచకితుండై స్మరించినపు డరుదెంచి మీమీసామర్థ్యంబులం బ్రకటింపుం డిప్పటికి మీతావుల కరుగుండని నమస్కారపూర్వకముగ విడుపుతెలుప నవి యంతర్ధానంబు నొందినవి. పిదప నిట్లు సుదర్శనమంత్రం బాగురుం డుపదేశింప నితండు దానిని మరల స్మరించెను. శీఘ్రం బావిష్ణుదేవుని సుదర్శనంబు నట సాక్షాత్కరించి సమయంబున ననువర్తింతునని వచించి స్వస్థానంబు నకుం జనెను. గురుకటాక్షకలితుల కసాధ్యము లుండునా ? పిదప "గురువరా ! భవదనుగ్రహంబుకల్మిచే నాజన్మంబు చరితార్థంబైనది. ఇంకను జెప్పందగువానిం జెప్పి యనుగ్రహింపుండీ" యని నృపతనయుండు పలుకం గుమారా ! సకలము నెఱింగిననీకుం జెప్పందగిన దేముండును ? అయిన నొకటి చెప్పెద. మఱువకుము. స్వల్పావసరంబుల నీయస్త్రంబుల నుపయోగింపకుము. భద్రము.పోద మిఁక రమ్మని యాతనితో నతండు నిజనివాసంబున కరిగెను.

పిమ్మట నొకనాఁడు పొద్దుపోక కీ వినయభూషణుఁడు హిమాలయంబున ముంజపృష్ఠం బనుప్రదేశమున నంగదేశాధీశుం డైనవసుహోముం డనురాజు పత్నీసహితుండై వసించు

చుండ నతనికడ కరిగెను. అంత నారాజర్షియు నతని సాదర ముగఁ గూర్చుండ నునిచి కుమార ! ఆరోగ్యంబె నీకు నీజననీ జనకులకును ? నీగురులు కుశలులె ? యని ప్రశ్నించెను. అందు కతండు సదుత్తరం బొసంగెను. ఆవల నిర్వుర కిట్లు సంభాషణము జరిగెను.

• “ వత్స ! చిఱుత ప్రాయంబునన సకలకళాకలాపంబు పుష్పహారంబట్లు కంఠగతం బొనర్చిననీవు కొమరుండ వగుట నీతల్లిదండ్రులు, శిష్యుండవగుట భృగూత్తముండును, బరిచయ లాభంబున నేమును నెంతయు సుకృతవంతులము. ముఖప్రీతి కిట్లంటినని భావింపకుము. యథార్థము వచించితిని. నీయట్టి వారు లోకమునం దరుదు. ”

“ మహాత్మా ! నాయం దొకయపూర్వమహత్త్వము నారోపించుచున్నారలు. నిజమునకుఁ బరులను మహత్త్వవంతు లనుగఁ జూపుమహత్త్వము ప్రీతిస్ఫీతం బగుభవన్మనోముకురం బునకె గలదు. దాన మీ రట్లనుచుంటిరి; గాని నాయం దట్టి మహత్త్వ మేమియు లేదు. ”

“అదిగో, అదియే మహత్త్వము” -

“ లేదనుటయు మహత్త్వ మనినచో నాపల్కినది మరల నొకసారి నొక్కిచెప్పవలసి యుండును.”

“ మంచిది. పలుకవలసినరీతిం బలికితివి. దాన నున్న మహిమ పోదుగదా ! ”

అత్తఱి నటునిటుఁజూచుచు మాంధాత, తత్కుటీరము నం దొక్కెడ నిడుపాటివిల్లును, అమ్ములకట్టను గాంచి, ఋషి

వరా! ఆవిల్లమ్ము లెవరివి? అవి యట్లుండఁ గతంబేమి? యని యడుగ నతం డిట్లనియె.

"కుమార! సరిగ స్ఫురణకుఁ దెచ్చితివి. దానివృత్తాంతము తెల్పెద వినుము. తొల్లి మావృద్ధప్రపితామహుండు మాకాంతునిగుఱించి తపంబొనర్చి ప్రసన్నుం డైన యా దేవునివలన వానిఁ బడసెను. అజగవాస్థినిర్మితంబగుట 'ఆజగవం' బని తద్ధనువునకుఁ బేరు. ఆయమ్ములు శృంగోద్భవములు, నక్షయములు. అమ్మహానీయు ననంతరమున మాయింట దానిఁ బూనునాథుండు లేమి నప్పటిపెద్దలు దేవదత్తం బగుట దేవసమంబుగఁ బూజించుచువచ్చిరి. పిదప నేఁబుట్టి పెరిగి వాని నుపయోగించుచుంటి. ఇట కరుదెంచి వాని నటుంచితి. బహుకాలముగ నక్కార్ముకశరమ్ముల నసాధారణతేజస్సత్వసంపన్నునకు వశ మొనర్ప సంకల్పించితి. ఇదివఱకుఁ దాదృశపురుషుండు తటస్థింపమి నాసంకల్పము తీఱలేదు. నేఁడు మాసుకృతవశంబున నిట కరుదెంచితివి. గాన నీకు దివ్యాస్త్రసాంప్రదాయం బెఱింగించి భృగుమానిచరితార్థుండయ్యె. వీని నీవశ మొనర్చియేఁ గృతకృత్యుండ నగుదు. అవియు సదృశాశ్రయలాభంబుతోఁ దేజస్వంతమ్ములై వెలయు" ఇట్లని దిగ్గునలేచి వానిం దెచ్చి తదధిష్ఠానదేవతకు నతులొనర్చి యిుఁక మీా రీశూరవరేణ్యునిచే, సమరవిజయంబు సంపాదించుచుఁ జిరకాలము మన్నింపఁబడుదురుగాక యని ధనువును మాంధాతృభుజకోటిని స్వయముగ నలంకరించుచుండెను. వానిఁ దటుకున నందుకొని చాలునెం డికార్యంబు తా మొనర్పవలయునే; చేతి కిచ్చినం

జాలదా! యనుచు నతండు నరిగ నవరించుకొని వృద్ధసందర్శ నం బూరక పోలేదు. అపూర్వవస్తులాభంబు సమకూరె. ఎంతయు ధన్యుండ ననిపల్కి కొంతతడ వుండి సెలవొసంగుఁడు ప్రౌఢయ్యె, జనకులు నారాకకుఁ గాచియుందురు, పోయి వచ్చెద ననియమ్మహితుని యడుగుల వ్రాలి యతండు సుఖీభవ యనిదీవింప నటనుండి కదలి నిజనివాసంబునకుఁ జనుదెంచెను.

---

# ఐదవ ప్రకరణము.

---

కొన్ని దినములు గతించినపిమ్మట వృద్ధరాజునకు గ్రమంబుగ జరాభారమ్ముచే శరీరదార్ఢ్యము సన్నగిలుచుండ మఱియొకవంక శ్వాసకాసలు పొడనూపి రోజులవరుసగ స్థానబలము సంపాదించికొని జ్వరమును దోడుగా నాశ్రేనిని బడక విడువనీకుండ నధికారము చెలాయించుచు నంతకంతకు క్షీణింపఁజేయుచుండెను. రాణియు జరారుజాక్రాంతయై యొక్కొకనాఁడు లేచియు లేవకయుఁ గాలముగడపుచుండెను. ఆప్రౌఢులలోఁ బుత్రుండు మాంధాత, మాతాపితరుల కనుకూలోపచారములు సలుపుచు నహర్నిశంబులు పజ్జఁబాయక వారి వద్దనే వసించుచుండెను. ఇట్లుండ నొకనాఁ డాకస్మికముగ నా యగ్రహారవాసులకు దనూ్యపద్రవము తటస్థపమ్యెను.

ఏమి తపోధనులధన మపహరింపవచ్చి రాదస్యులు ? అని యడుగకుండు.

ఆదుండగీండ్రులకు ధనాభిలాషకంటె ద్విజజనపీడనాభిలాష మెండు.

పూర్వము సూర్యచంద్రవంశజులైనపార్థివపుత్త్రులు కొలువురు భరింపరాని పాపకార్యము లొనర్చి ప్రజాహితైకతత్పరులైనతమతండ్రులచే సకుటుంబపరివారముగ దూరదేశములకుఁ దఱుమఁబడిరి. ఏకాలమందైనఁ గానిండు. అధికారము, అవివేకము, ఐశ్వర్యము, అభినవయౌవనము నీనాల్గు నుపద్రవము లేక యూరకపోవు- చూడుండు !!

అట్లు తఱిమివేయఁబడినరాకొమరులు పశ్చిమ: పశ్చిమోత్తరప్రాంతములందు వాసముచేయు ననాగరకులతోఁ నేకీభవించి స్వజాతివిపరీతాచారముల శీలించుచు రక్తమాంసములకలవాటుపడి యుక్తాయుక్తముల మఱచి యిచ్ఛమై ప్రవర్తించుచుఁ దమ్ముఁ దఱిమినతమతండ్రులకుఁ దత్పక్షీయులకుఁ బీడగావింపనెంచి యాయాదేశములను సమయము చూచుకొని సపరివారముగ నేఁగి ధ్వంసముచేయుచు దౌర్జన్యవిలాసములతోఁ దాండవమాడుచుండువారు. తదనంతరము తత్సంతానమ్ములు, తండ్రులయాచారములన యతినిష్ఠతో నిర్వహించిరి. ఆయాచారము క్రమముగ వారిరక్తముతో సమానముగఁ దత్సంతతికిఁ బారంపరికమై వెలసెను. ఏతాదృశాచారశీలమైన వ్రాత్యరాజన్యసంకీర్ణసంతానము లోకనికిఁ బముండ్రిగాఁ జిరకాలము వర్ధిల్లి చీడపురుఁగు తెఱయట్లు భరతవర్షమునఁ బలు

తావుల నలముకొని ప్రజలను బలుతెఱగుల బాధించుచుండెను. ఇట్లు బాధించుచుండగిండ్ర నప్పటినాగరికులు దస్యులని పిలుచుచుండిరి. ఈదస్యుదుర్గంధములు భరతవర్షమున సురాజసురభిసమీరణంబులు సన్నగిలినపుడెల్ల నుదీచ్యపర్వతాంతరములనుండియు, హిమాలయంపు లోయలనుండియుఁ, పశ్చిమతీరగర్తములనుండియు, వింధ్యాచలగుహాముఖమ్ములనుండియు, దండకాటవీనికుంజములనుండియు, గుప్పున వ్యాపించుచుండెడివి. ఈ తెఱువాటుమూఁక లకాలంబునఁ దమ్ముఁ దఱిమివేయుదక్షుం డైనధరణీశుండు కఱవగుట వరపురగ్రామఖర్వటఖేటములఁ జొచ్చి యిచ్చవచ్చినట్లెల్ల విధ్వంసమొనర్చుచు నడ్డుపడినజనుల హతులఁ గావించుచు స్త్రీజనమ్ముల మానంబులు మునిజనంబులప్రాణంబులు చూఱగొనుచు విచ్చలవిడిఁ దిరుగుచుండెను. అట్టియుపద్రవమే యీమునిపల్లియ కిపుడు తటస్థించినది. ఒక్కక్షణములో నచటియాశ్రమంబు లన్నియు మాంసాశ్రయంబు లైనవి. హోమకుండములు మూత్రకుండము లైనవి. కుటీరములు కూలినవి. చత్వరములు సదమదము లైనవి. అంతనాపల్లీనివాసులు 'అయ్యో! చస్తిమి, చస్తిమి, సర్వనాశన'మనుచు, బొబ్బలుపెట్టసాగిరి.

అత్తఱి వినోదంబునకు జింకబుడుతకుఁ జేతితో నివ్వరిధాన్యంబు తినిపించుచు జనకుచెంతనే యాసీనుం డయిన మాంధాతృం డాబొబ్బలు చెవులఁబడుడుఁ జేత విల్లుఁబూని చివాలున సగము లేచి తండ్రివదనంబు దిలకించి సంకోచముతో మరల నాసీనుం డగుచుండ యువనాశ్వుండును, దండ్రీ!

ఏమది? ఏదో యనర్థము కలిగినట్లున్నది చూడు — (మొరల నలుపులు విని) అదిగో మ్రుచ్చుమూఁక యిఁట! వేగ విల్లమ్ములు గొని పొమ్ము నాయనా! అయ్యో, కసికూనను బంపవలసి వచ్చెనే. నా కీయశక్తత యిప్పుడే కలుగవలెనా! యని మూల్గుచుఁ గానిమ్ము భగవానుఁడే కాపాడును. తడవుసేయక పోయిరమ్ము తండ్రీ! యనఁగ నక్కుమారుఁడు భీతిలేదు, తమ కేమైన... అనిసంశయభావముతోఁ బల్కుచుండ నర్ధోక్తితో వృద్ధరాజు — తనయా! క్షత్రియుల కాత్మరక్షణము కన్న నార్తరక్షణ మవశ్యకర్తవ్యము. అందు ద్విజరక్షణము వేఱ చెప్పఁబనిలేదు. మన మొరుల రక్షింప మనలను మాధవుండు రక్షించు. ప్రకృతము మాకుఁ గావలసిన యుపచారమేదియు లేదు. పోయిరమ్ము జయమగునని వీఁపుమీఁదఁ దట్టెను. తోడనే యాశూరశిరోమణి నూతనకాంతి నందమగునాననంబున జనకులచరణధూళి ధరియించి యొక్కయుదుటున నావలకుం జని యిటునటుఁ జూచి, పల్లె కావలఁ బరిశ్రమసలుపు బాలభటసంఘముఁ బిలువఁదలఁచియుఁ బదుగు రేల నేన యీతస్కరులముష్కర మడంచు వాఁడ నని కలకలంబు వినవచ్చుదెసకు శీఘ్రము చని సరోవరంబుఁ గలఁచుగజయూథము ట్లుండుదస్యుయూథంబు గాంచి విల్లు మ్రోయించి శృంగనిర్మితశరమ్ములఁ దొడిగి, యయిదు, పది, యీవరుస నొక్కుమ్మడి వైవ నవి తలలను వీఁపులను, బొమ్మలను దాఁకి దూసికొనిపోవ వాండ్రు చేతిలోఁ దోసిన ట్లాబాణవేగమున నేలఁగూలి మరల లేచి

తోఁకత్రొక్కిన త్రాఁచులట్లు మండిపడి విల్లమ్ములు విఱచివేయు నెంచి తన్ను ముట్టవచ్చుచుండనతండు చక్రంబుకరణి గిఱ్ఱునఁదిరుగుచు సంపజల్లు కురిపింపువాండ్రు నాథాటికి దరికి రాలేక దూరమరిగి శూలను, లాఁకలను విసరసాగిరి. అతఁడుణంబున నీయుక్తి చతురుఁడు భుజమూలములందు మోచేతులందు మణిబంధమందు నంగుళులయందు గుఱితప్పక కఱకునారసముల నొప్పింప వికలులై యక్కార్యంబునకు స్వస్తిచెప్పి మరల వాండ్రందఱు నొక్కమ్మడి మీఁదఁ గవియరా నాధీరుఁడు నత్యుత్సాహంబుతో వారి నందఱిని ముందువచ్చిన ముందుకు వెనుక వచ్చిన వెనుకకుఁ, బ్రక్కకు వచ్చినఁబ్రక్కకుఁ గీలుబొమ్మవలె గిరగిరఁ దిరుగుచు దశముఖములు, సహస్రలోచనములు నున్న చందమునఁ గడుజాగరూకుఁడై మెలఁగుచు సవ్యాపసవ్యముల శరముల నిగుడ్చుచుఁ బింజ రేగఁగొట్టుచు వీరవిహారము సలుప నెఱకులాడు కఱకునారసమ్ముల కోర్వలేక, ఇఁక రండిరా పోదము. ఈ రాచవాఁడు చూపులకుఁ జిన్నవైనను జేఁతలకు శూరవరుల మీఱియుండె. వీని నారసములు మనల మింగవచ్చిన మృత్యుదేవతచేతులనఁగ నాకు వెఱపు గొలుపుచున్నవి. ఇంక క్షణమూరకున్న నుసురులు మనకు దక్కవు. రండు. వీనిపస మఱియొకసారి పట్టింతము. ఇట్లని యాగదాసులు పరస్పరము సంభాషించుకొనుచు శరీరములు చిగిర్చినమోదుగులట్లు మెఱయఁ బలాయనమంత్రమును బఠింపఁదొడఁగిరి.

ఇట్లుండ నింతకుమున్న గంగాతరంగిణిం గన్నులుమూసి కొని జపము చేయుచున్నగట్టులు, పల్లె కావలఁ బాఁబల్కు లావర్తించుభూసురకుమారులు, పరిశ్రమసలుపు పార్థివపుత్రులు, పాఠముల నేర్పునుపాధ్యాయులు, సమిత్కుశఫలాహారణంబున కరిగినశిష్యులు సీతస్కరకోలాహలంబు నాకర్ణించి యుద్దెసకు సిగముడులు వీడ, జందెములు జాఱఁ, గట్టుపుట్టములు కాళ్ళ కడ్డుదవుల నత్యాతురతఁ బరుగిడి వచ్చుచుండిరి.

ఇట్లు వారందఱు వచ్చునంతలో సీదొంగమూఁక, నిలువుఁడు శౌర్యహీనులై చనకుఁడు; చూపుఁడు మీశక్తిమ ననుచుఁ బొడుపుమాట లాడునవనీశకుమారు నవలోకింపక యు విసురునఁ బాఱిపోయెను. అం దొకదొంగ, యాపొడుపుమాటలకుఁ గోపించి పోదమాటునఁ బొంచియుండి, అంతయు నిర్మాక్షికమయ్యెననుచు నటునిటుఁ జూచుచు నూపిరిపుచ్చుకొను మాంధాతృనిపై నొకఱాతిని గొని బలముకొలఁది విసరిపాఱుచుండెను. అంతలో వెనుకనుండి 'ప్రమాదము, తొలఁగు, తొలఁగు' మను కేకలు వినవచ్చుడుఁ బ్రక్కకు దాటునతని కణతపట్టున నా ఱాయి రివ్వునవచ్చి బిట్టుదాఁకెను. అయ్యది ప్రాణపదంబగుట నా దెబ్బకుఁ దెలివితప్పఁ గ్రిందఁబడు నాసుకుమారుని భృగుమౌని యొక్కయూపునవచ్చి పడనీక పట్టుకొని యాసీనుండై మెల్లగఁ దొడలపైఁ జేర్చి శిలాఘాతమున జేవురించిన శిరఃపార్శ్వమును జూచి కన్నీరుగార్చెను. సన్నికర్షమహాత్మ్యమట్టిది. అది విరక్తులనుసైత మనురక్తులఁ జేయును. ఇతఁడు పుట్టినది యువనాశ్వగర్భమందైనను బెరిగినది భృగుమౌనిచేతులందే.

అయ్యెడఁ గూడినమునిముఖ్యు లందఱు మూర్ఛమునింగిన మాంధాతృని జూచి "అయ్యో! యెంతప్రమాదము! యెంత యనిష్టము! ఎంతహాని! (శరీరమును, ధాతువులను, శ్వాసములను బరీక్షించుచు) 'గుంపునంతను బాఱఁదోలి కొంచెమైనను గాసిచెందనివాని కాచోరహాతకుఁడు చివర కెంతచేసె" ననియిట్లు పల్కుచుఁ దోఁచిన యుపచారములు సలుప నారంభించిరి.

"అస్మద్రక్షణము గోరి యావంతయు జంకులేక యసువులఁ గసవుసమముచేసి యొక్కరుండ యారక్కసులపైఁ గవిసి, తిరిగిచూడనీక తఱిమివైచెనే!! ఆహా! ఎంతసాహసము!! ఎంతధైర్యము!! ఎంతశౌర్యము!! ఎంతనేర్పు!! ఇట్టివాఁ డీలోకంబున 'న భూతో న భవిష్యతి'. ముం దీకుమారునిపాలనంబునఁ బ్రజలెల్లరు పరమానందపూర్ణులగుట నిశ్చయము. నేఁడు మాశరీరములు చెక్కుచెదరకుండఁ గాపాడిన యీసాహసికున కేయుపకార మొనర్చిన, హిత మొనర్చినవార మగుదుము? (కొంచె మాలోచించి) ముందు కదనరంగముల గాసి కలుగకుండ నితనిశరీరమున కమృతరసలేపము వెట్టిన నది యభేద్యకవచంబై వెలయు" నని భృగుమహర్షి యాలోచనముఖంబుగాఁ బల్కుటయు నచటిపెద్దలు "అగు నిది యున్నరేంద్రనందనున కత్యంతావశ్యక"మనినుడివిరి. అంత నతఁ డింక నాలసింపరాదని శిష్యునొక్కనిం జేరఁబిలిచి తనమందులయడపంబు తేరఁబనిచి వానిచేత నప్పుడ పదిమందిపరివారముతోఁ గొనితేఁబడినదాని నందుఁగొని యం దున్నరసఘుటిక నొకదానిం

దీసి నీటఁగలిపి తద్రసంబు తచ్ఛరీరంబునం దంతటఁ బూయించి పీడాపరిహారంబుగ నారాయణకవచంబు రక్షపెట్టుచుండునంతలో శ్రమతీర నిద్రించి మేల్కాంచినట్లుతండు కన్నులు నులుపుకొనుచుఁ జివాలున లేచి కూర్చుండి నలుకెలంకుల నుపాధ్యాయబృందము, చుట్టు ద్విజవర్గము, సహపాఠిగణము గోచరింపఁ దటాలున లేచి గురువులకు సాష్టాంగ మెఱఁగి శరీరంబున రసలేపంబు గని యేదో మహాపరాధమును గావించినట్లు సిగ్గుమెయి శిరము వంచి, 'ఆర్యులారా! క్షమింపుఁ' డని చేతులు జోడించిపల్కెను.

ఆపల్కులు విని యతనియుణఁకువ కెంతయు నాత్మ నలరి ముఖములఁ జిఱునగవు మెఱయ వా రిట్లనిరి.

"అగును. మాకెఱుక లేకుండ నేకాకివై దస్యుబృందమును దఱిమివైచి యపరాధ మొనర్చితి. దానిని క్షమింపవలయునో! కానిమ్ము నీప్రార్థనతో క్షమించితిమి. కుమార! నీవు క్షణమూరకున్న నిమ్మునిపల్లి మృత్యుదేవతావిహారస్థానమయ్యెడిది. ఆదుర్దశ తొలఁగించితి. సంతోషించుటకు బదులిందు క్షమింపఁదగిన దేమికలదు? దేహమున కొకింతయు శ్రమలేక సుఖమున్నదె?"

మాంధాత:- పూజ్యపాదుల రగుమీచే నుపచారంబులు గొనిననా చేసినఘనకార్య మేమి కలదు? ఒకవేళఁ గలిగననుకొందురేని మీపెంచినపైరు మీకొదిగిన దనుఁడంతియు. భవదారచితరసలేపంబుతో నాదేహంబు

తొల్లిటికన్న దృఢతరమైయున్నది. మత్కృతి యల్పము కత్పల మధికము.

గురువులు:- అట్లకానిమ్ము. ఎదుట నిన్ను మెచ్చుట యనుచితంబు. ఈగురువరు డనుగ్రహించినరసలేపంబుబల్మి నీశరీరంబు నేయాఘాతంబు నొంపఁజాలదు. సుఖమీగును.

పిమ్మట భృగుసత్తముండు వత్సా! చాలఁబొద్దగుట వృద్ధులు నీరాక కెదురుచూచుచుందురు. నీవును గడుబడలియున్నాఁడవు. ఇంటి కరిగి యించుక విశ్రాంతి గొనుమని యానతీయ నతండును వయస్యపరివృతుండై వెడలెను. తక్కినవారును, దదీయగుణశీలంబులన వర్ణించుకొనుచుఁ దమయిరవుల కరిగిరి.

నిరుపమానబలపౌరుషములందును, అభినవమేధాసంపత్తియందును, అనూనవిజ్ఞానవైదగ్ధ్యములందును, అప్రతిమరూపసౌశీల్యములందును, ఆదర్శప్రాయుండైనయక్కుమారునిగుణసౌరభంబు లదిమొదల నధికంబుగఁ గొండలు గుట్టలు నడవులు నదులునతిక్రమించి ప్రజాసముదయముఁజొచ్చి గుబాళింపఁదొడఁగెను. ఆశుభదినములలో మహీతలమునం దంతట నధికైశ్వర్యసంపన్నుండని సుప్రతిష్ఠగాంచినపశ్చిమసముద్రతీరస్థకుశస్థలీపురీశుండు పాశ్చాత్యఖండచక్రవర్తియు నగు శశిబిందుమహారాజు నిజసంతానమున కంతకు జన్మంబుచేతను, చారుతరసౌందర్యసౌశీల్యాద్యాభిజాత్యగుణసంపత్తిచేతను, బ్రిధానమైన బంధుమతిని మాంధాతృని కొసంగి యాప్తుండు కాఁదలంచి యొక

నాఁడు నిజసంకల్పంబు నొకమహర్షిమూలమున యువనాశ్వ మహీశునకు నెఱుకపఱచెను. యువనాశ్వుండు నది విని శశిబిందునంతవానితో వియ్యమొందఁగల్గినందుల కెంతయు సంతసించెను. ఆదేసమయంబున నాతనిపత్రికలు పరిస్థితినిధులమూలమునఁ గుమారునకుఁ బట్టంబుగట్టుఁడని విన్నవింప నారంభించిరి. ఏతాదృశశుభకాలంబున నారాజదంపతులు దౌర్భాగ్యవశంబునఁ దనయునిశుభశోభనంబులు చూడకయ దివికేగవలసివచ్చెను.

లోకంబునఁ బుత్రవంతులు తమపుత్రులు పెరిగి పెద్దలై విద్యాబుద్ధుల విలసిల్లి పేరుప్రతిష్ఠలఁ బడసి పుత్రవంతులై సాటివారిలో శ్రేష్ఠులై యుండఁ జూచి సంతసింప వాంఛింతురు. పాప మీదంపతులు తద్వాంఛ పూర్తిగఁ దీరకయ తీఱవలసినవారైరి. భవితవ్య మటులుండ నెవ రేమిచేయుదురు ? విచారకరమైనయివ్వార్త విని ప్రతిష్ఠానపురంబునుండి యువనాశ్వునిచెలియలు మఱందియు నయోధ్యనుండి యితరబంధువులు సుమంత్రాదిసచివులు పౌరప్రముఖులు నిటకరుదెంచి మాంధాతృ నాదరించి పితృమేధంబు సలక్షణంబుగ జరిగినవెనుక భృగుమునివచనానుసారముగ సతని సావత్సర మయ్యెడనె యునుప నియ్యకొని నిజనివాసములకరిగిరి.

# ఆఱవ ప్రకరణము.

——:o:——

తరువాత సంవత్సరాంతమునకు సరిగ సపరివారుండై పౌరప్రముఖసామంతప్రభువులతో భృగ్వాశ్రమంబునకుఁ జనుదెంచి యయ్యాశ్రమవాసులకుఁ బీడ కలుగకుండ దానికవ్వల నందలి విడియించి తాను నాలవనాఁడు నిజనివాసమున వగపు మొగముతో నేకాంతముగ నాసీనుం డైనమాంధాత్రునకుఁ గాన్పించుకొని యక్కుమారు నిట్లు సమాశ్వాసపురస్సరముగ మెల్లగఁ బ్రబోధించెను.

తండ్రీ! మాంధాత!

ఉ. ఆకుమఱుంగుపిందెవలె హాయిగఁ బ్రొద్దెటువృత్తి గ్రుంకునో
వీఁకమెయి న్విచారమును వీడి సుఖంబుగ నుండురోజు లి
ట్లాకమనీయభాగ్యమును నందఁగనీయక పెద్దఁజేసి ని
న్నాకమలాననుండిటుల నారట మొందక ధైర్యమూనుమీ.

ఉ. మాధవుఁ డిచ్చునిచ్చినకుమారుఁ గుమారసమోరువిక్రము
న్వైభవరాజి నేలఁదగుపోడిమి కల్గి సమస్తసత్కళా
యాధనిధానమై వినయ మొప్పెడువానిని జూచుకొంచు ని
ర్బాధముగాఁగ నుండఁదగు భాగ్యముగాంచరువృద్ధదంపతుల్

ఉ. చేయునదేమి?. వారికయి చింతయొనర్పకు తాపమాను, తే
'పోయినవారల న్దలఁచి ముందటికార్యము లాచరింపఁగాఁ
బోమెడు'రీతి లోకమునఁ బొందయియున్నది యేమునట్టులే
పోయినవారివెంటఁ బడి పోవరుగా జను లేయుగంబునన్
నాయకపట్టమూని జననాథులు మెచ్చఁగ నేలుమీభువిన్.

చ. జనులు సుఖంబుకల్గఁ దముఁ జక్కఁగ నేలుదు రంచ్రిరీతిగా
నని మనసార నమ్మి భవదాగమనం బెదఁగోరి వేచుకన్
దినములు పుచ్చుచుండి రరుదేఁ మహోధ్యకుఁ బౌరము
ఖ్యులున్ । ఘనగుణరాజసంతతియుఁ గన్గొన వచ్చిరి చూ
పొసంగుమిా.

ఏతత్ప్రబోధంబు విని మాంధాతృండు మానసంబునఁ
గదిరినదుఃఖభారమును దీర్ఘనిశ్శ్వాసముతో దిగఁద్రోచి,
"మంచిది. మహాత్మా! తండ్రివరుసఁ బోషించుమిాదక్షత
కల్గ మా కేకొదవ యొదవు? మిావచించినట్ల కానిండు.
కర్తవ్యమునకుఁ గడంగుఁడు. ఇట్లని తటాలున లేచి నిలచెను.
అప్పలుక్కులు విని సంతసిల్లి సుమంత్రుఁడు నిలచినన్పతన
యునిమధురదర్శనమునకు ముగ్ధుండై తమకంబు నిలుపలేక
తనయునట్ల దగ్గఱ దీసి తనబాహువులఁ బెనవైచి కౌఁగిలించి
కొని శిరం బాఘ్రాణించెను. ఆకుమారుండు నాతనిచేతుల
నడుమ నల్లే యొదిగియుండెను. మఱుక్షణమున నాయిరువురుఁ
గనుకొలకులఁ దుడిచికొనుచు విడివడిరి. పిదప నాప్రధానా
మాత్యుఁడు భృగుమౌని దర్శింప నటనుండి వెడలిపోయెను.

నాఁటిరేయి యేకాంతమున భృగుమహర్షి మాంధా
తృన కిట్లుపదేశించెను.

వత్సా! రాజ్యంబు రజ్జునిర్మితముగానిబంధనము. అట్టి
నిర్బంధమునకు ని న్నధీనుఁజేయుచున్నారము. ఇంతవఱకు
నేనిర్బంధము లేక యిచ్ఛమెయి నీయీడుబాలకులతో సమ
క్షముగఁ జరించితివి. ఇఁకముం దట్లు చరింపఁజనదు. అంగ

రక్షకు లంటియుండఁ బరిచారకులు తెరువుచూపఁ గుశలచింతకులు విశదీకరించిన విధమున వర్తింపుచుండవలయు. రాజునకవగ్రహంబులు మెండు. ఆపదలు దాపున నుండును. ఎన్నియాపదలు దాపరించినను వాని నన్నిటిని వారించికొనుచు స్వసుఖనిరభిలాషియై కష్టనిష్ఠురముల నోర్చి దండ్యుల దండించుచు నదండ్యులఁ గాపాడుచు నుచితరీతినరిగొనుచుఁ దద్విత్తంబు ప్రజాసౌకర్యములకై వెచ్చించుచుఁ బరిపాటితోడఁ బ్రజలను బాలించుట పార్థివునకుఁ బరిత్యజింపరాని పరమధర్మము. ఎంతకువలయరంజకుండైనను రాజు లోకదృష్టికి దోషాకరుండె. కాకయీ ధరణీశునకు సందర్భవశమునఁగాని దాక్షిణ్యవశమునఁగాని దోసములు దొరలక మానవు. దోసములు దొర్లునని దొరతనముమాని వనమున కరుగుట జననాథునకు నలుపరానిపని. ఎవ్వనికేనియు స్వీయధర్మము జారవిడువరాదు. విడిచిన దాన లోకమునకు మర్యాద చెడి చేడ్పాటు వాటిల్లును. అందు జననాథుండు ప్రవర్తకుండగుట సకలధర్మంబు లాతని నాశ్రయించియుండునుఅతండు. ధర్మమూర్తియై ప్రజలధర్మము తప్పకుండఁ బాలింపవలయును. కావున నృపాలుండు స్వధర్మమును నిర్వహింపక యరణ్యవాసమును వాంఛించుట కేవలము కానిపని. పటిష్ఠుండైనపరిపాలకుండు లేకున్న వర్ణాశ్రమాచారధర్మములవరుస తప్పి దురాచార దుర్వర్తనములతోఁ బ్రజలు రుజాపీడితు లయ్యెదరు. కావలసినరక్షణము లేక కృషివాణిజ్యములు కూలిపోవును. పరిశ్రమలు పాటుతప్పును. కళలు కడముట్టును. చదువులు సన్నగిల్లును.

బలవంతుఁడు ప్రభువగును. నోరుకలవానిద రాజ్యమగును. న్యాయాన్యాయవిచక్షణత, సదసద్వివేకము, కర్తవ్యాకర్తవ్య విచారము నడుగంటును. సోమరితనము సామ్రాజ్యమేలు. క్రమముగ దేశమున కొమడామరము లేర్పడి తుదకుఁ బ్రజానాశమేర్పడును. దాన ధరణీశుండు ధీమంతుఁడై వృద్ధామాత్యుల మంత్రింబుగొని యుద్దేశపూర్వకము లైనదోసములకుఁ దావొసంగక సందర్భవశంబున సంభవించుదోసఁగుల దానధర్మములతోఁ దొలఁగించుకొనుచు నీతిఁదప్పక ప్రజలఁ బాలింపవలయును గాని యొలుకలకై యింటికిఁ జిచ్చువెట్టికొనఁ జాతురే! కోసలమహీప్రజ లెల్లరు నీవు పట్టాభిషిక్తుండగుటకతికుతూహలపడుచున్నారలు. ప్రజాకుతూహలంబు తీర్చుట మనకుఁ బ్రధానకర్తవ్యము. ప్రజారంజకుం డైనరాజు బహుకాలము పుడమినేలును. శత్రుభయ మొకింతయుం గలుగదు. ప్రజాసేవకై భార్యను విడిచినను బాపమంటదు. ప్రజాసేవ నెన్నటికిని బరిత్యజింపవని నమ్ముచున్నాఁడ. సకలశాస్త్రంబులు శిక్షించిననీకు సలుపఁదగినయుపదేశ మేదియు లేదు. అయినను మమకారం బొకటి యొకింతయుపదేశింప మమ్ముఁ బ్రేరేచుచున్నయది. దురాత్ములకు గురూపదేశంబులు పాములకుఁ బాలలీల దోషావహంబు లగును. సదాత్ములకు సమున్నతి కల్గించును. వికటదర్పణమునఁ బ్రతిబింబము విరూపమై గాన్పించునట్లు వికటహృదయులం దుపదిష్టపదార్థములు విపరీతములుగనే తోఁచును. యౌవనముకూడఁ దోడైనచో వారియజ్ఞతనుగుఱించి హెచ్చుగఁ దెల్పఁబనిలేదు. యౌవన మది యంధ

కారసదృశము. అంధకారము చౌర్యమునకువలెఁ జాపల్యము నకు శరణ్యము. చపలుల చెవులు వడిఁదిరుగు చక్రముచంద మున వృద్ధులు వచించు విషయముల దరిఁజేరనీయవు. పడుచుఁ దనపుటాడుదుడుకు లెఱుంగని నీయట్టి సరళాత్ములె యువ దేశార్హులు. మున్ముందు మూర్ధాభిషిక్తుండు ముగ్ధాత్ముండు గాక జితేంద్రియుండు కావలయు. ఇచ్చ మెయి మెలఁగుచుం డిన లోకము మెచ్చనేరదు. అతం డారుల సచ్చరితులఁ జేయఁదగిన యాదర్శపురుషుండు. అద్దున కుండుకంచెయే చేను మేసినఁ గలదె బ్రతుకు? ఎవరెద్దానిఁ దెల్పినను నేర్పడఁ జెవి యొగ్గి వినవలయునగాని వినినంతన వేగపడరాదు. నిదానంబు సకలకార్యసంధానకంబు. నాస్తికత్వంబు కలిగి ముక్కునఁ గోపంబు వెట్టికొని మాటుమాటాడుచు స్తిమితుండుగాక యెద్దా నికిని దీర్ఘాలోచనంబు సలుపుచుఁ దగువారికి దర్శనంబీయక జడాత్ముఁడై యిచ్చకపుమాటలకుఁ బరవశుం డగుచు ఘనకా ర్యంబుల నొక్కరుండ యాలోచించుచు నస్తవ్యస్తులతో నర్థానర్థ విచారము కావించుచు నిశ్చితకార్యముల నెఱవేర్పఁబూనక, మం త్రరక్షణ మొనర్పక, ప్రకృతుల కామోదంబుగలుగ శుభశోభ నంబులు సలుపక, యేమహనీయు లరుదెంచినను నాసనంబు విడిచి యెదురేగి యాదరింపక, తనకంటె నితరదైవంబు లేఁడని స్వాతిశయదురభిమానములతో విఱ్ఱవీఁగువసుమతీశుండు తుదకు నలుపురియందును ఏటీఁడి యగునుగాన నీవు నేత * చ్చతుర్దశ

---

* నాస్తిక్య మనృతం క్రోధః ప్రమాదో దీర్ఘసూత్రతా। అదర్శ నం జ్ఞానవతా మాలస్యం పంచవృత్తితా। ఏకచింతన మర్థానా మనర్థజ్ఞైశ్చ

దోషంబుల కెడమీయక దూరదృష్టికలిగి ♦ యష్టకర్మముల నిష్టంబుతో నిర్వర్తింపఁజేయుచు సమయోచితముగ సామ దాన, భేద, దండ, మంత్రౌషధేంద్రజాలము లనుసప్తోపాయములఁ బ్రవర్తింపఁజేయుచుఁ దాల్మితో ధరణీపరిపాలనంబు నిర్వంచనముగ నెఱవేర్చుచుఁ బ్రజాదరంబునకుఁ బాత్రుండవగుము. లేనిపోనితగవులు కల్పించి తక్వాలు దిద్దఁబోవుట పెద్దరికమనియు, వేడుకలయెడ నాసక్తిచూపుట రసికతయనియుఁ దప్పాలుపట్టుట తెలివితేటలనియు, ననృతమాడ నేర్చుట పాండిత్యమనియు, దుర్వ్యసనపరిచయము విలాసమనియు, వృద్ధవచననిరాసము పరులపలుకులు వినకుండుటయనియు, నవమానసహిష్ణుత యోర్మియనియు, నుచ్ఛృంఖలవర్తనము స్వాతంత్ర్యమనియుఁ, జపలత్వ ముత్సాహమనియు, ముఖప్రీతివచనములు యశస్సనియు, గురువృద్ధబంధువులు చూచుచుండఁ గొంకుసంకోచములు లేక యనాచారములు సలుపుట ధీరతయనియు; భృత్యులకు లోఁబడి వర్తిలుట సుఖసేవ్యతయనియు; దేవగురుద్విజదూషణము మహత్త్వమనియు నసమానస్నేహము సర్వసమత్వమనియు, వ్యభిచారంబు పురుషార్థమనియుఁ దలంచుట స్థూలబుద్ధులలక్షణము. పరోపకారవేషంబుతో స్వప్రయోజనంబు నిర్వర్తించుకొను

---

చింతనం । నిశ్చితానా మనారంభో మంత్రస్యాపరిరక్షణం। మంగళాద్యప్రయోగ శ్చాప్రత్యుత్థానంచ సర్వతః॥ (14 రాజదోషములు)

♦ కృషి ర్వణిక్పథో దుర్గం సేతుః కుంజరబంధనం। ఖన్యాకరకరాదానం సైన్యానాంచ నివేశనం॥ ఖనిః=రత్నాద్యుత్పత్తిస్థానము. ఆకరః=సువర్ణాద్యుత్పత్తిస్థానము.

వంచకు లసంఖ్యాకులు. కుమార! ఎవ్వఁడనేని యాథార్థ్య
మరసి వర్తించుచుండవలయు. వంచనపరులవచనములకుఁ జెవి
యొగ్గక సాధుమార్గమున సంచరించుచు జనుల సద్వర్తను
లుగఁ బాలింతువని విశ్వసించుచున్నవాఁడ. చదువు లెన్ని చది
వినను జ్ఞాన మెంతసంపాదించినను శాంత మెంతయున్నను
నెంతశౌర్యమున్నను నెంతబలిమి కల్గినను లక్ష్మీమదము మను
జుని మనోహీనునిగఁ జేసివైచును. దానితిప్పలకు లోఁబడక
జాగరూకుఁడవై మెలఁగవలయు. భవత్కులవృద్ధు లైనపురం
జనదుందుమారులను, నహుషయయాతులను మఱపించునట్లుగ
నఖిలధరణీతలంబు నేలువాఁడవగుము. అభిషేకానంతరము
కాలుసేతులు గూర్చుకొని బహునాయకపరిభూత యగుధరణి
కేకావలంబనమయి ముదంబుగూర్తువుగాక! మరల నొకసారి
చెప్పుచుంటి. ప్రజలను గన్నప్రజకూడిక్క నరసిపాలింపుము.
మేము వలయుపట్టులఁ దగుసాహాయ్య మొనర్చువారము.
రాఁబోవుదశమి యభిషేకంబునకు శుభయోగంబై యున్న
యది. తల్లిదండ్రులు లేనిలోపం బొక్కటిదక్క దేవబ్రాహ్మ
ణానుగ్రహంబు గల్గుని కింకెందును లోపంబుగల్గఁబోదు. నిర్భీతి
నుండుము; మేలగును." ఇట్లనియమ్మౌని విరమించినవెనుక మాం
ధాత తదుపదేశవచనంబులకు బలముకల్గినట్లును బరిమళములఁ
బూసినట్లు భూషణములు తొడిగినట్లు పరీక్ష గెలిచినట్లు పంతము
నెగ్గినట్లు మనమున భావపరంపరలు వెల్లివిరియ బహూత్సాహ
భరితుండై గురువరునితో శిష్యవత్సలా! సూర్యునిపోల్కి
లోకబాంధవు లగుమీయనుగ్రహంబు పరిపూర్ణంబై వెలయ

భయంబున కొన్పదంబేది ? నాయజ్ఞానతమంబు భవదీయ సదుపదేశ తేజంబున విలీనంబయ్యె. నీ కెన్నటికిని భవద్వశంవదుండ యనిభావింపుఁడు. ఇదే ప్రణామంబని నమస్కరించెను. అతండు నావినయభూషణుని మనసార దీవించి వత్స ! మంచిది. పొద్దయ్యె. పరుండుమని పంపివైచి తానును బరుండ నరిగెను.

మఱునాఁ డుదయంబున సుమంత్రుండు చనుదెంచి సముచితంబుగఁ గాన్పించుకొని మాంధాతృనితోఁ గుమారా! మంత్రివర్గమును సామంతనృపాలురు పౌరప్రముఖులు దండనాయకప్రభృతులు, వృద్ధపరిచారకులును భవద్దర్శనాపేక్షులయి వాకిట వేచియుండిరన నప్పల్కులు విని రాజనందనుండు మంచిదని సింహకిశోరమట్లు గునగుననడచివచ్చి స్మేరాంకూర విలాసభాసురము లగుచూపులఁ బఱపుచు శిరశ్చాలనముతో నాదరము తెలుపుచు ద్వారము నానుకొని నిలఁబడియుండెను. ముంగిట వరుసలుతీరి నిలఁబడినవారందఱు జోహారు లర్పించి " జయము యువరాజునకు జయ " మని రెట్టించిపల్కుచుఁ జేతులు జోడించి పైకెత్తి 'దేవా యువనాశ్వభూపాలుండు మిమ్ముఁ జూపిచనియె. నిండుకొలువులో సింహాసనమున దర్శన మొసంగి మమ్ము ధన్యులఁ గావింతురుగాక యనిప్రార్థన' యనుచు నేకకంఠముగఁ బల్కిరి. అందుల కక్కుమారుం డట్లు కానిం డనిపల్కెను. అంత సంతోషాతిరేకమున నందఱు కరవస్త్రంబులు కేతనంబులు నెగురవైచుచు మరల జోతలిడి

కుమారుని వీడ్కోలు వడసి జయజయనాదములతో నటనుండి
వెడలిపోయిరి.

మధ్యాహ్నావసరంబున మహర్షులు మంత్రులు నేకత్రి
సమావిష్టులై పట్టాభిషేకసుముహూర్తంబును దత్కార్యక్రి
మంబును నృపనందనుప్రయాణసమయంబును నిశ్చయించి
యెవరియిండ్లకు వారేగిరి.

తదుపరి సుమంత్రుండు సుముహూర్తంబునకు విశేష
వ్యవధి లేమిం జేసి తోడనే పట్టాభిషేకసంభారంబులు సమకూ
ర్పను బురం బలంకరింపను వలయునుపదేశంబు లొనర్చి సహా
యమంత్రుల మున్నుగ నయోధ్యాపురంబునకుం బో నియో
గించి బంధువులకును రాజలోకంబునకును, నితరప్రముఖుల
కును నీశుభవర్తమానంబు దెలుపం దగువేగరుల నియోగించి
తాను రాట్కుమారునిప్రయాణసన్నాహమును జూచికొను
చుండెను. ఇంతలో గభస్తిమాలి యస్తంగతుం డయ్యెను.

---

# ఏడవ ప్రకరణము.

—:o:—

పెలపెలమని తెల్లవారెను. చెట్లపై శకుంతసంతాన
ములు కూయుచున్నవి. కరకరమని సూర్యోదయ మగు
చుండెను. గంగాతరంగిణియందు ధరణీసురశ్రేణి యొకవంక
వస్త్రంబు లుదికికొని సమంత్రకంబుగ స్నానమాచరించి

పూర్వదినసంశోధితములై యారవైచి కృష్ణాజినపేటికయందుఁ బదిలపఱచినవసనద్వయంబు ధరియించి యూర్ధ్వపుండ్రమును ధరించి యర్ధోదితాదిత్యాంతర్వర్తియైనశ్రీమన్నారాయణుని సమంత్రకజలాంజలులచేనర్చించుచుండెను. మఱియొకవంకఁ దత్పత్నీనివహంబు స్వచ్ఛశిలాతలంబులనొంటొరు లెదురుగ నిలఁబడి కట్టివిడిచిన చీరెల నుదుకుటకై కుచ్చెలువెట్టుచు నిచ్చవచ్చిన ముచ్చట లాడుకొనుచుండెను. అందిరువురుమూవురు స్త్రీలిట్లు మాట్లాడుకొనుచుండిరి.

ప్రథమ— సుశీలా! మనమాంధాతకుఁ బట్టాభిషేకమఁట కాదూ?

ద్వితీయ— అవునఁట అక్కా! అయోధ్య కీనాటిమధ్యాహ్నమే యతని ప్రయాణమని మావారు చెప్పిరి.

ప్రథమ— ఏమి! నేఁడే వెళ్ళునా! అట్లైన నాగవల్లి తీర్చినట్లే. పల్లెయంతయును జిన్నవోయియుండును. అస లా రాజదంపతులు పోయినదే సగముకళ పోయినది. ఉన్నది కొంచెము నిప్పుడు పోవును. వారు వచ్చి సుమారు పదేనేండ్లు కాలేదూ?

తృతీయ- పదేనేండ్లా! ఛీ ఎక్కడివి? మాన్నైత్రేయుఁడు కడుపున నుండఁగా వచ్చిరి. వాని కిప్పుడు పదుమూఁడేండ్లు వెళ్లినవి. అయితే యందఱికంటె బొద్దుమేను గానఁ బదునేనేండ్లవాఁడుగాఁ గనిపించునుగాని నిజముగ మాంధాతృన కిప్పటికిఁ బండ్రెండువత్సరములు వెళ్ళినవి. అంతే.

ప్రథమ:- వారు వచ్చుట మనవల్లెకుఁ బ్రాణమువచ్చినట్లైనది. వారు వచ్చినదాదిగ నేదో పేరుచెప్పి మనకు దానములు, దక్షిణలు, సంతర్పణములు, జరుగని రోజు లేదుగదా! మాంధాత పుట్టినప్పటినుండియు మఱింత హెచ్చు. నిజముగా వారు వచ్చినందువలన మనకు మహాభాగ్య మబ్బినట్లైనదే.

తృతీయ:- అదిసరి కాని-ఆమాంధాతనడతఁజూచిన నా కెంతో ముచ్చటయగునే. పుటకకు రాచవాఁడైనను బుట్టినప్పటి నుండియు నాటపాటలలోఁగాని చదువుసంధ్యలలోఁగాని మనపిల్లలతోఁ బూసల్లలో దారమువలెఁ గలిసిమెలసి యుండెనుగాని వేఱొకరీతి నుండి యెఱుఁగఁడుగదా! కొంచె మేది హెచ్చున్నను గొందఱు మిట్టిపడుచుందురు. ఇంతచదువు-ఇంతసంపద-ఇంతశౌర్యము కలదుగదా! కొంచెమైనను గర్వమున్నదీ? ఎంతతెలివి-ఎంత వినయము-ఎంతభక్తి - ఎంతవితరణము - పరోపకారమన్నఁ బ్రాణములుకూడఁ జూచుకొనఁడుగదా! మొన్న మటుకు మొన్నఁ దల్లిదండ్రులకుఁ బ్రాణములమీఁదికి వచ్చినను జూచుకొనక యంతమంది దొంగల నొక్కఁడే పోరాడి తఱిమివైచెనే? సెబాస్ కొడుకునుగనిన నిట్టివానిన గనవలె. ఎందులకమ్మా గులకతాల్లు గంపెఁడు? (ప్రొద్దువైపు చూచి) అయ్యమ్మా యెంత ప్రొద్దెక్కినదే; మాటలధోరణిని జూచుకోలేదు.

ప్రథమ:-అవునమ్మా! అవును. అంత భాగ్య మందఱికి నబ్బునా? పాప మాదంపతులకు ముచ్చటపడఁగాఁ బుట్టిన యా

బిడ్డని పట్టాభిషేకమైనం జేతులారం జేసికొనుభాగ్యము లేకపోయెంగదా!

ద్వితీయ:- ఎంతచేసిన నంతే. అంతకన్న నెవరికైన నెక్కుడు పచ్చును?

ప్రథమ:- నేడు వెళ్ళిన మరల మనకంటికగుపింపడు కాంబోలు.

ద్వితీయ:- ఆరాచనగళ్ళలో నెచటనో యొండక న్నెలుంగక యుండును. మరల మనకుటీరములకు వచ్చుటకేమి యుండు?

తృతీయ:- ఓసీ! రుచిగా చూడిటు. ఎంతపొద్దెక్కెనో!

ద్వితీయ:- అవునె. ఇక లెండమ్మ లెండు.

అంత నందఱు వడివడిగం దాము తెచ్చినపసుపు గల కొకకొంచెము పంచుకొని గంగాభవాని కొకింత యర్పించి మిగిలినది మాంగల్యములకు, ముఖములకు నలందుకొని స్నాన మొనర్చి చీరెలు పిడిచికట్టుకొని యంతకుము న్నుదికి మెలి వైచి పిడిచి కుదురుగం జుట్టియుంచినవస్త్రసంహతిని శిరమున నమర్చికొని జలకలశంబులం గటిప్రదేశంబులం గదియించి కొను లల్లాడ నీరు తొలుకాడ నిజకుటీరముల కరిగిరి.

ఇట నయ్యోవనాశ్వతనయుండు పెందలకడన మేల్కాంచి స్నానసంధ్యావందనాద్యనుష్ఠానంబులు నిర్వర్తించుకొని యుచితవేషాలంకృతుండై హిరణ్మయభాజనంబునం జందనకుసుమ తాంబూలఫలాదుల సంగ్రహించి పరిచారకునిచేం బట్టించుకొని సుమంత్రుండు తోడరా భృగుమహర్షి కుటీరమున కరిగి యందు

వ్యాఘ్రాసనంబున నపరసురజ్యేష్ఠుండు నా నాసీనుం డగు
నాముని జ్యేష్ఠుం గాంచి యభివాదన మొనర్చి పట్టించుకొనివచ్చిన
నిండు పసిండిపళ్లెంబు ముందిడి చేతులుజోడించి సవినయంబుగ
నిట్లని విన్నవించెను.

ఆచార్యా! అక్షరాభ్యాసమాదిగ నేఁటివఱకు నెక్కువ
వాత్సల్యంబుతో శ్రమవిచారింపక తాల్మివహించి రాత్రియనక
పగలనక యెడకల్గు నెడనెల్ల జననీజనకులను మఱచులాగున
నాకత్యుత్సాహంబుగొలుప నడుము నడుము నతిమనోహరంబు
లగు నాఖ్యానకంబుల నానతిచ్చుచు సకలశాస్త్రంబులు కర
తలామలకము చేసి, ధనుర్వేదంబు సర్వంబు సరహస్యము
మదధీనంబు గావించి వేదాంతరహస్యంబు వెలువరించి యష్టా
క్షరీమహామంత్రోపదేశ మొనర్చి తద్వ్యాఖ్యానంబులు వివ
రించి భాష్యంబులు పరిచితంబు లొనర్చి కృతార్థునిజేసిన తమ
కాజన్మాంతమును మానక యుపచారము లొనర్చినను ఋణ
శుద్ధుండఁ గానోప. ఈఋణత్రయంబు నీసడించి నిరంతరంబు
విశ్వమానవకళ్యాణసంధానంబునక యమూల్యజీవితంబు ధార
వోయుచు దారుల నారోపితమూల్యంబులైన పదార్థంబుల సం
తోషపెట్టఁబూనుట మీయెడ నాకుఁ గలభక్తిభావంబు
గొంచెపఱుచుకొనుటయ యగు. కావున మహాత్మా! మీ
కత్యంతప్రీతికరం బగునే మహాకార్య మాచరించిన నొకింత
కృతార్థుండ నగుదునో యేఘనకార్యాచరణంబునఁ దల్లిదండ్రుల
కన్న నెక్కుడుగ దినదినంబు మదీయ యోగక్షేమము
లారయు మీయెడ నాకుఁ గలభక్తిభావ మినుమడించునో

యద్దాని నాకిచ్చి యీశిష్యు ననుగ్రహింపుఁడి. ఇట్లనుటయు శిష్యుని సామర్థ్యంబును, గార్యదీక్షయు, సత్యపరతయు నెఱింగిన యాగురూత్తముం డాతనిపల్కులకెంతయు సంతసించి యానందాతిరేకమున బుజముపైఁదట్టుచుఁ, జక్కఁగఁ గ్రహించి తిని. సెబాస్ వత్సా! చిరంజీవ. నీయట్టిధర్మవీరరత్నంబుం గని రత్నగర్భ యథార్థనామధేయ యయ్యె. ఊర్జితుండును సుచితజ్ఞుండు నగునీయట్టిశిష్యునికతన మాగురుత్వంబును సలక్షణంబయ్యె. మాయుపదేశంబులు ఫలించినవి. మాసంకల్పంబులీడేఱినవి. నీ జననీజనకులు కృతార్థులైరి. నీవంశం బున్నతిం గనె. నీవర్తనంబు సహపాఠులకు మేల్బంతి. ప్రజలకష్టములు కడముట్టినవి. నీయట్టివాని సాహాయ్యంబుకల్గినచో యగ్రజన్ములవరజన్ములకుఁ గళ్యాణంబు గూర్పువారగుదురు. కుమార! నీయందలి విశ్వాసంపుఁబేర్మిచే మన్మనోగతంబుఁ జెప్పఁబూనితి. మదంతేవాసులలో నీవ యగ్రగణ్యుండవు. తప్పక నీ వాఖ్యాతిని నిల్పుకొనఁగలవు. కూర్చుండుము. సావకాశముగ వినిపించెద. సుమంత్రా! నీవును గూర్చుండుము.

పుత్రకా! వినుము. నీవనినట్లు మన్మనంబు దివ్యంబు దెసఁజనదు. నాపూనినయది ప్రజాహితకరంబైన మహాకార్యము. అది యొకనాఁటితో నొక్కనితో నొకదానితోఁ దీరునదికాదు. అట్టి మహాకార్యభరంబు నీతలపై నిలుపఁబూనితి. శక్తికొలఁది యత్నింతువుగాక — లోకవ్యవహారహేతువైనకాలంబు సర్వంబునకాధారంబు. అయ్యది యాదిమధ్యాంతశూన్యం బైనయఖండపదార్థంబు. అద్దానిని

గు ర్తింప నాదిమునులు కర్మసాక్షి, జగచ్చక్షువు నగు భాస్కరుని గుఱివెట్టి యాదేవుని పరిభ్రమణవశంబునఁ జనుపరిస్పందల పరిమాణభేదంబులతోఁగల కాష్ఠ, ఘటిక, ముహూర్తము, యామము, దినము, పక్షము, మాసము, ఋతువు, అయనము, వత్సరము, యుగము, మహాయుగము, కల్పము ననువిభాగము లతో సరిహద్దులేర్పఱచిరి. అందు యుగాత్మక కాలంబు ధర్మభేద ములనుబట్టి మరలఁ గృత, త్రేతా, ద్వాపర, కలి, సంజ్ఞలతోఁ జతుర్ధావిభక్తమైనది. ఏతాదృశావయవకలిత మైనమహాకాలంబు చక్రింబురీతిఁ బరిభ్రమించుచుండ సృష్ట్యాదిగ నేఁటికిఁకృత యుగాదు లెన్నివరుసలో తిరిగివచ్చినవి. గతించిన కృతయుగ ధర్మములే ప్రకృత కృతయుగమునందును వర్తిల్లును. ఇట్లే యే యుగమున కే ధర్మములు సాధారణములో యాయుగ మావృత్తమైనపుడెల్ల నాధర్మములు నావృత్తము లగు చుండును.

కృతయుగమునం దారబ్ధములై వృద్ధిచెందిన ధర్మవిజ్ఞాన, వివేక, పటుత్వాదులు, రానురాను బరిక్షీణంబులై కలియుగాంతమునకు జలస్రుతిలేని కూపముకరణి వట్టిపోవును. అక్కాలమున మానవులల్పరూపులల్పాయుష్కులు నల్పబుద్ధులునై యుందురు. అకృతనవృత్తులెల్ల వినష్టములై నిర్వీర్యమైనభూతలంబు 'పాడూ' అనిపిలువ 'ఓ' అని బదులుపల్కును. భూతల మొకధర్మసత్రము నకు సమానమైనది. సంసారమార్గసంచారుల కియ్యది విశ్రమస్థానము. అందువలె నిందు సజ్జనులు దుర్జనులును నివసించి పోవుచుందురు. సత్రము సజ్జనులు చేరినపుడు శుద్ధమై శోభి

ల్లును. దుర్జనులు మూరినపుడు దర్శనాయోగ్యమై పొసరును మగుడ సజ్జనులు చనుదెంచిరేని వారద్దానిని దాల్చిపూని దుర్జను లొనర్చినదోసఁగులు ఒద్దుకొని తమ కనుకూలంబుగ నమర్చికొనియెదరు. అదేరీతి నీభూతలంబు కృతయుగపురుషులతో సర్వసంకల్పసమృద్ధమై కొమరొందు. కలిపురుష కలితనముతోఁ గలిమి హీనమై కీడ్పడును. మరలఁ గృతయుగమహాత్ములు కీడ్పడిన భూతలంబు పూర్వవిభవోపేతంబుగాఁ దీర్చికొందురు. ఇప్పటికిఁ గలియుగంబు కడచని యనతికాలంబ యగుటఁ జేసి యక్కాలపు టొడుదుడుకు లింక నడంగకుంటచే నుత్పన్నలక్షణాం బైనభూరమణి దక్షుండైనధవుని హస్తావలంబనం బపేక్షించుచున్నయది తొల్లింటి ధరణీశులు కొందఱు నలుదెసల ముసురుకొనిన ధరణీతలకంటకు లైనదస్యుసంఘములఁ గొన్నిటిఁ బోకార్చి యంతలోఁ బూర్ణాయువు లైరి. అత్తఱిను త్తరింపఁగా మిగిలిన దస్యుసంఘములు మరలఁ దలలెత్తి నలుమూలల వ్యాపించి ప్రజల వేచికొనితినుచున్నవి. రాజులు పరమస్వతంత్రులై ప్రజలను బాడిమొదవులుగఁ జేసి యదిమి కప్పములఁ గొనుచుఁ దద్విత్తం బాత్మసుఖంబులక వెచ్చించుచు నీతిమాలి యిచ్చమెయి వర్తిలుచుండిరి. ప్రజలు స్వజాతినియతధర్మముల జాఱవిడిచి సోమరులయి విద్యాగంధ మెఱుఁగక నీతిమాలి యొండొరులు కలహించుచు నిజవృత్తుల నిర్వర్తింపకున్నారలు. తల కొకమతము, తల కొకదైవము నేర్పడెను. కృషివాణిజ్యములు సన్నగిల్లినవి. కళలు విస్మృతము లైనవి. ఆచారధర్మము లడుగంటినవి. వ్యవహారనీతులు

వీఁగినవి. వివాహసంస్థ వీరడిల్లైనది. జనులకుఁ బశువృత్తి ప్రాప్తైనది. లోకుల వంచించు వేషధారు లనేకులు. వేయేల మానవలోక మన్నివిధములఁ జేడ్పడియున్నది. ఈకలియుగ వాసన లింకను మనలఁ గలఁచుచు వీడకున్నవి. ఈయిడుముల నడఁచి యుద్ధరాతలంబు నేకనాయకముగఁ గూర్చి తొల్లిఁటి కృతయుగవిభవసారంబుతో వెలయించుట నాయభీప్సితంబు. తరువాతి కార్యక్రమంబు నీవు చెల్లింపవలయు. ఇక్కార్యంబున జగన్నాథుం డైనశ్రీమన్నారాయణుండు నిన్ను నీడవలె నవశ్యం బనువర్తించు. నీకుఁ దప్పక జయమగును. అని విరమింప మాంధాతృండు మనంబునఁ దనతలంపునకుఁ దగిన గురునభీప్సితంబునకు మిగుల సంతసిల్లి తద్వికాసంబున నాననంబు వింత చెలువుఁ దాల్ప లేచి, మహాశయా! ప్రజాశ్రేయం బస్మచ్ఛ్రేయం బగుంగావున నవశ్యము తత్కార్యనిర్వాహమునకుఁ బూనుదు. భవదనుగ్రహంబ నా కమూల్యసాధనం బనుచుఁ బసిఁడిపళ్లెరములోని పుష్పమాలికల నందుకొని యాచార్యుని కంఠసీమ నలంకరించి సాష్టాంగనమస్కార మొనర్చెను. గురువరుండును "విజయీ భవ" యనిదీవించి మేను నిమురుచుఁ గుమారా! లెమ్మనియె. అతండు లేచి, ఆచార్యా! 'అనుజ్ఞయే' యని రుద్ధస్వరంబునఁ బల్కెను. క్షణకాలము నీరవమై నిశ్చేష్టమై చెల్లెను. అంత భృగుమౌని మేల్కొనినట్లు చటుకున లేచి కనుఁగొలుకులు తుడుచుకొనుచు 'మంచిది పోయిరమ్ము పయనంపు సమయ మాసన్నమగుచున్న' దని రెండడుగులు ముందుకు వైవ నృపతనయుండు గురువరుని విడువఁజాలనివిధ

మున వీనిఁ బెద్దఁజేసి వెనుకవత్తుమని ముందనఁపుచుంటిరి. దృష్టి యిచ్చటనే యుండునని ముందుకుసాగి వాల్గడుగులు వైచి యేదో మఱచినట్లు దానిని స్మరించుచున్నట్లు వెనుదిరిగి దిక్కులఁ దిలకించుచుఁ గుమారా! సందేహింపకు సుముహూర్తసమయమునకు మున్న చనుదెంచువాఁడ. ఇచ్చటిముని వర్గమును రాఁగలదు. సర్వము సుపరిశస్తంబై జరుగు ననుచు గురుం డనుప నెట్టకేలకు సుమంత్రునితో వెడలి ముంగిట వేచియున్న పరివారముతోఁ గలసి తిరిగితిరిగి చూచుచు నిజ నివాసమున కరిగెను. భృగుమానియు నాశ్రమప్రతి ప్రవేశ ద్వారముపఱకు లక్షించి చూచి కనుమఱుఁగుకాఁగ లోని కరిగెను.

తండ్రిని మఱపించుగురునకుఁ గొమరుని మఱపించు శిష్యునకు నాతుదిక్షణం బతిక్లేశకరంబై తోఁచెను. ఇయ్యెడ సంయమినిసైతము చలింపఁజేసిన సన్నికర్షప్రభావ మెట్టిదో పరికింపుఁడు. లోకమున మానవునకు దేహము, బుద్ధియు రెండే ముఖ్యతమములు. ఆజతలో దేహపోషకులు తల్లిదండ్రులు-బుద్ధి పోషకులు-ఉపాధ్యాయులు. వీరిలో నెవ రెక్కుఁడో విచారింపుఁడు.

ఇట్టియధ్యాపకులయెడ నాధునికు లెంతగౌరవముఁ జూపుచుండిరో కనుగొనుఁడు! వీరినిఁ బోషకులు దాసులుగఁ దలఁచెదరు. పౌరులు పరిగణింపరు. ప్రభువు లాదరింపరు. సమాజములు సమ్మానింపవు. వ్యాపారులు విశ్వసింపరు. ఇతరోద్యోగులు పేరెత్తరు. విద్యార్థులు భీతిలరు. తజ్జనకసోదరులు

తలపెట్టరు. పరీక్షాకాలములందుమాత్ర మేకహస్తప్రణామంబు లాచరించుచు, విద్యార్థులును, పాఠశాల మరలఁ దెఱచు క్రొత్తరోజులలో ముసిముసినగవులతో వంకదండములతోఁ గొడుకువరుసకు వంశసంబంధము, విద్యాసంబంధమును సమానములు గావున "మనఅబ్బాయి..." యనుచుఁ దత్ప్రేమకులు కొందఱును మితముగఁ బల్కరించిపోవుచుందురు.

మధ్యాహ్న మతిక్రమింపఁ బ్రయాణభేరి "మ్రోగింపఁబడెను. సైనికులు, పరిచారకులు తమతమపరికరములతోఁ బ్రయాణమునకు సంసిద్ధులై పరమోత్సాహముతో నుండిరి. రాకొమరునకై జతపఱచినసువర్ణమయస్యందనంబునకుఁ బూన్చినయశ్వంబు లడుగులతో భూతలంబు చూర్ణించుచుఁ బయనంబున కాతురపడుచుండెను. మాంధాతృండును మున్న గృహదేవతలఁ బూజించి గోదానదక్షిణల నవనీసురుల నర్చించి వారిచ్చినయాశీర్వాద సుమమంత్రాక్షతల శిరమునఁ దాల్చి మాధ్యాహ్నికకృత్యముల ముగించుకొని కృతభోజనుండై తండ్రిపలెఁ దన్నాదరించుసుమంతుప్రిందు స్వయముగఁ దగువేసంబు నవరించి తోడరా నిలువేల్పులకు నమస్కరించి యిలు వెడలి యపుడు కుడిభుజ మదర నినుమడించినసంతసముతో వాకిటఁ గూడినసామంతపౌరప్రముఖులతోఁగూడి చైత్యంబు చెంతనిలిచి నిజాగమనంబు నిరీక్షించు మహర్షులకడ కరిగెను.

అచ్చటఁ జైత్యంబుచెంతఁ బల్లెలోని పిన్నపెద్ద లందఱుఁ దనకు బహిఃప్రాణమై వర్తిలుమాంధాతృని మఱియొక సారి చూచి సాగనంపుటకు విచ్చేసి భృగుమౌని మున్నుగ

మొనసినిలచియుండిరి. ఇంతలో నారాట్సచివుం డచటి కరుదెంచి భృగ్వాదిమహర్షులకు సవినయంబుగ జోతలిడ నమ్మహనీయులముఖములనుండి యేకకాలమున ననాలోచితముగ నాతని నుద్దేశించి "శుభం భూయా" తని యాశీర్వచనం బొకండు వెలువడియెను. తదనుగుణముగఁ దదుత్తరక్షణంబునన యాశ్వికుం డొకండు దూరంబునన యశ్వంబు నవతరించి హఠాత్తుగ నిమ్మోడకుఁ బఱతెంచి శిరంబు ధరాతలంబు సోక జోహారు లర్పించి భృగుమానికి బాలకు నొకనిమూలమున హరిద్రాంకిత మగునొక లేఖ నందిచ్చెను. దాని నందుకొని సుమంత్రివరు మొనర్పు నతం డద్దాని విప్పి యిట్లు చదువఁ దొడఁగెను.

శ్రీరస్తు — శుభమస్తు

పూజ్యపాదు లగునస్మద్గురువర్యులకుఁ బ్రియశిష్యుఁడు సాష్టాంగనమస్కారపురస్సరముగ విన్నవించుకొను శుభవచనంబులు-

ఆర్యా !

'శ్రీరస్తు చిరాయువు లగుమాంధాతృకుమారులకు; చి. సౌ. మాతనయను బంధుమతి నొసంగి భవత్సంబంధిని గాఁ దలంచితి ' నని మున్ను మాననీయు లైనయువనాశ్వమహారాజులకు సందేశ మంపుటయు, మాయభీష్టమును దీర్ప వారు సమ్మతించుటయుఁ దమకుఁ దెలియనివి కావు. ఇంతలో దురదృష్టవశంబున నమ్మహారాజు దివికేగెను. ఇత్తఱి నుభయులకు వృద్ధు లగుతాము కుమారునకు జరుపఁబోవు పట్టాభిషేకంబు పాణిగ్రహణపురస్సరమై ప్రవర్తిల్లఁ గరుణించి మమ్ముఁ జరి

తాగ్గులఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడను. చిరంజీవు లయోధ్యా పురంబు చేరునప్పటికి మాపురోహితమహాశయులు లగ్నపత్రికం గొని యచ్చటికి రాఁగలరు. ముందటికార్యక్రమంబు మహామాత్యులు మాకు విశదపఱుపఁగలరు. శుభమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

| | |
|---|---|
| కుశస్థలీపురి. | ఇట్లు భవత్ప్రియశిష్యుఁడు, |
| చైత్ర బ॥ ౧౩ | శశిబిందుఁడు. |

ఇట్లా మహామాత్యుఁడు లేఖ ముగించునప్పటికచటివా రందఱు ముఖంబు లింతలై వింతచెలువుఁదాల్ప, 'మేల్మే' లనుచు నత్యుత్సాహంబుతోఁ బల్కిరి. అపుడు భృగుమౌని యాననంబున వికాస మినుమడింపఁ దల వంచియున్న పెండ్లికొమరుని సస్నేహంబుగ నీక్షించుచు సుమంత్రునితో శుభము శుభమ్ము నను వర్తించు ననియె.

సుమంత్రుఁడు:- 'ఇదంతయు మీచలవయేగదా!' యని మిన్నకుండెను.

భృగుఁడు:-మంచిది-అట్లయిన వేగఁ దగుప్రతిసందేశ మంపుము. అనుటయు నాసచివాగ్రణి వల్లెయని తత్సందేశహరుని గారవించి పథశ్రాంతుఁడగుట విశ్రమింపఁబనిచి వేగరి నొక్కనిఁ బిలిచి ప్రతిసందేశముఁ జెప్పి యప్పుడ కుశస్థలికిఁ బంపివైచెను. సపక్షంబులైనగాంధర్వహయంబులు గలయక్కాలంబున జను లతిత్వరితంబుగ నెంతదూరమైన నేగుచున్నందున గమనాగమనంబుల కగుకాలవ్యవధినిగుఱించి విచారించునావశ్యకత వారికి లేకపోయెను.

పిదప భృగుమానియనుమతితో సుమంతుఁడు పరివారంబునకుఁ బయనంబుసేయ ముదలనిడఁ బ్రయాణభేరీరవంబును మంగళతూర్యఘోషంబును సైనికులజయజయధ్వానంబులు హయహేషలు నేకమై యచటివారిచెవులు చిల్లులువడఁ జేయుచుండెను. అత్తఱి మాంధాతృని, మునివరులు స్వస్తి వాచనములతోఁ జేరువనుండు సెలయేరువఱకు సాగనంపి యవలఁ దమచే నభిమంత్రితం బైనయరదంబు నధిరోహింపఁ బనిచి యతం డట్లసేయ రథంబుపై రక్షామంత్రంబులఁ బఠించుచుఁ బుష్పాక్షతలఁజల్లి వెనుక నిలిచిరి. సుమంతుఁడు వెనుక వేఱొకరథము నధిరోహించెను. తోడనే సూతచోదితము లైనయుగ్యంబులు సకిలించుచు బయలుదేరి క్రమముగఁ జెవులు రిక్కించుకొని పరువిడసాగెను. అప్పుడు రాకొమరునకు ముందు పాలపక్షి తీర్చెను. వెనుకనుండి మందమారుతము వీఁచెను.

తరువాత మునివరు లొండొరులు మాంధాతృనిగుణశీలంబులను విద్యావైదుష్యములను, బ్రజ్ఞాపౌరుషంబులను నభివర్ణించుకొనుచు నిండ్లకుఁ జనిరి. ఇట్లు ముందట సాయుధ మైనయాశ్వికదళంబును గజారూఢు లైనదండనాయకులు, పార్శ్వంబులఁ బౌరసామంతవరయానంబులును వెనుక సుమంతురథంబును, దానివెనుక భారవహయానంబులును బలసిరా మాంధాతృండు మనంబున భావతరంగములు వెల్లివిరియ నతికుతుకంబుతో నయోధ్యాపురంబునకు వెడలెను.

# ఎనిమిదవ ప్రకరణము.

—————:o:—————

ఉదయ మగునప్పటి కయోధ్యాపురం బభినవాలంకారపరిష్కృతమై పూదినతంగేహపోల్కిఁ గలకలలాడుచుండెను. రాజదర్శనలాలసులై పౌరులు నిజసౌధంబుల నధిరోహించి నిక్కి చూచుచుండిరి. రక్షకభటులు రాజాగమనమున కభ్యంతరము కల్గకుండ రాజమార్గమున జనులను శ్రేణిగా నిల్పి నియోగించుచుఁ గడుజాగరూకులై మసలుచుండిరి. రాజకులంబు సకలంబును సంభ్రమసంచరత్పరిచారకమై, సముదజాతకుతూహలమై, సంతోషభాసురముఖారవిందమై పరిష్కృతసర్వాలంకారమై ప్రతిక్షణాభినవంబై ప్రకాశించుచుండెను.

అత్తఱి నాప్తరాజన్యమండలము, అమాత్యవర్గము, దండనాయకులు, ధరణీసురప్రవరులు, పౌరముఖ్యులు నాస్థానభవనమునఁ జేరి రాకొమరు నెదుర్కోలుగౌరవముతోఁ దోడ్కొనిరా నిశ్చయించుకొని తదాగమనంబు నిరీక్షించుచుండిరి.

ఇంతలో "ధామ్మ"ని ఫిరంగిమ్రోఁత వినవచ్చుడు వారందఱు నదిగో రాకొమరుండు చనుదెంచెనని సంభ్రమముతోఁ బరిధానంబు లుత్తరీయము లుష్ణీషంబులు సవరించికొనుచు లేచి యువతీమణులు చందనకుసుమతాంబూలాదిమంగళద్రవ్యపూర్ణభాజనంబులు గొనిరా మంగళవాద్యములు చెలంగుచుండ మహావైభవముతో వెడలి, మున్న వచ్చి సరయూతీరమ్మున నిమ్మగు చప్పరమున నాత్మానుగతజనపరివేష్టితుండై కూర్చున్ననరేంద్రనందను డాసి యుపచారంబు నడపి స్వాగతం బడిగిరి.

మాంధాతృండును మున్ను మహీసురులకుఁ బ్రాహ్మణంబు లర్పించి యాప్తుల నాదరించి మంత్రిదండనాయక ప్రభృతులకు మన్ననచూపి తదీయప్రీతిపరిచరస్వాగతవచనంబులకు సంతోషకరమ్ముగఁ దగుసమాధానంబు పలికి కులపురోహితుండు కాలాతీతం బగుటఁ దెలుప నుత్థితుండై కదలి యరదంబునెక్కి యుండఁ దోడరాఁ బురద్వారంబు ప్రవేశించుచుండ వృక్షదేవతలు విరులఁ గురిసిరి. అనిలకుమారులతోఁ గూడి లతాంగనలు లాస్యమునల్పిరి. దుందుభులు మొఱసినవి. శతఘ్నులు మ్రోగినవి. అట్లతండు పురంబుసొచ్చి రాజమార్గంబునం జనుచుఁ బౌరకన్యామణులు చల్లునాచారలాజలఁ దోఁగుచు నెడనెడఁ గృపాణపాణులై నిలచినభటులు కృపాణములు వాల్చి సలాములుచేయుచుండఁ గ్రమముగఁ గక్ష్యాంతరంబులు గడచి ప్రాసాదంబుప్రధానద్వారంబుకడ నరదంబు డిగి యట నాచారకుశల యగువృద్ధాంగన యోర్తుక, పాదప్రక్షాళనపురస్సరముగ నీరాజనముతో దృష్టిదోషంబు తొలఁగించి చన నందఱు నట వీడ్కొలిపి పురోహితసుమంత్రులు తోడరా భృత్యనిదర్శితమార్గమ్మున నభ్యంతరమందిరమ్ముచేరి యాత్మార్థంబుగ నమర్పఁబడినయర్హాసనంబున నుపవిష్టుం డయ్యె. పురోహితుండు మాంధాతృనిమంగళస్నానంబు సేయింప నతనిమేనత్త యగుసుపుష్టాదేవికి సందేశమంపి తాను దన్నిమిత్తకమాంగళికంబులు నిర్వర్తింప వెడలెను. సుమంత్రుఁడు మగుడవత్తునని సెలవుగొని సేవకులకుఁ గర్తవ్యమ్ములుపదేశించి నిజగృహంబునకుఁ జనియెను.

అప్పుడు యువనాశ్వుని చెలియలును బ్రతిష్ఠానపురీశునిపత్నియు నగుసుపుష్ప యటకు 'వచ్చితివా తండ్రీ!' యనుచు రాఁగ మాంధాతృఁడు ముకుళలువడినపచ్చని మేనును మోమునిండిన కుంకుమబొట్టును, నెఱలునిండినక్రొవ్వెదయుఁ గల్గి మాతృమూర్తివలెఁ బొడసూపిన మేనత్తకు మ్రొక్కి పాదధూళిఁ గైకొనెను. ఆమెయు నామేనల్లుని గౌఁగిలించుకొని శిరము మూర్కొని 'కూర్చుండుమయ్యా' యని తాను జేటికానీతపీఠమును జెంతఁ జేర్చి కూర్చుండి ఫుల్లారవిందసదృశములైనయతనిపాణితలంబులు జోడించి పట్టి కన్నుల కద్దికొనుచు 'నాయనా! నాపాపిష్ఠికన్నుల కిప్పటి కగుపడితివా! ఇంతవఱకుఁ గన్నులుండియు గ్రుడ్డినైతి. నాముద్దుతండ్రి నెన్నఁడు చూతునా యనియెంతయుఁ దహతహపడితి. ఇప్పటి కాఱట కల్గినది. నాపుట్టినింటి కిప్పటికిఁ దోరణంబు గట్టఁగల్గె. నలువురిలో నాచిన్నితండ్రి కొక వేడుకయుఁ జేతులారఁ జేసికొను భాగ్యము నాయన్నకు వదినకు లేకపోయె! సంతతికొఱకెన్నియో యిడుమలఁబడిరి. ఇట్లనితాను గన్నీరు తుడుచుకొని యశ్రువులఁ గార్చు మేనల్లునిశిరము నిజోరమ్మునఁ జేర్చికొని వానిని జెఱఁగుతో నద్దుచుండ నయ్యెడకు 'వెఱ్ఱిదానా! కర్తవ్య మరయక చిన్నివానిచే నిత్తఱిఁ గన్నీరుపెట్టించుచుంటివా!' యని మందలించుచు నాథుఁడరుదేర నావృద్ధమహిళ 'అయ్యో చూడుఁడు నాతెలివి! కుమారుల మంగళస్నానమ్ము చేయించి పెండ్లికొమరులఁ జేయింపుఁడని పురోహితులు వచింప నదిమఱచి కూర్చుంటి! తడవయ్యె లెమ్ము నాయనా' యనుచు లేచి మేనల్లునితో నటనుండి వెడలిపోయెను.

మాంధాత నవలోకించి మహీపతులు, శాంతాత్ముండై నను జక్షువు లీక్షింపఁజాలకున్నవనియుఁ గిశోరమూర్తియైన యితనియెడ నవలోకనమాత్రమున శరీరంబు వినమ్రమగుచున్న దనియుఁ జూచినకొలఁదియు నీతనిపాదములకడ నాత్మార్పణంబుసేయఁ జిత్తంబు వేడుకపడుచున్నదనియు, నిప్పటియస్మజ్జాతమున నేతాదృశమహనీయమూర్తి కల్గఁడనియు, మున్ను గకుత్స్థనృపాలుం డొక్కరుండు ఘనతవహించినగుణాఢ్యుండని వింటిమికాని - ఆయనకు నిట్టువయోధికవిజ్ఞానరూపసత్వసంపత్తి యున్నట్లు వినియెఱుఁగమనియు, నిచ్చినదేవుఁడు మఱచిన నిమ్మహితునికిక మిఁక భూతలమున ముఖ్యమై వెలయఁ గలదనియు నిట్లు పలువిధముల భాషించుకొనుచుఁ గొనకు "భగవానుఁ డీనృపకిశోరమునకుఁ జిరాయురారోగ్యము లొసంగి కాపాడుఁగాక" యనుప్రార్థనతో మనఃప్రీతిని వెల్లడించుచు సంతృప్తులై చనిరి. వాహినీపతులు, మహావీరుండనియు, సేవకులు దయాళుండనియుఁ బౌరులు పరమాప్తుండడనియుఁ, బ్రజలు పాలింపవచ్చినపురుషోత్తముండనియుఁ జెప్పుకొని సంతసిల్లిరి.

భోజనానంతర మామునికుమారసహచరుఁడు, పలుకనాలుక కల్గియు మూఁగపోల్కిని, జూడఁ గన్నులుండియు గ్రుడ్డిచందమునను, వలయుపనులొనర్ప నంగములు కల్గియు వికలాంగునివిధమునను వర్తించునట్టియారాజభావమున కానాఁ డెంతయుఁ గటగించుకొనెను. మునికుమారు లచ్చటఁ దనస్వాతంత్ర్యమునంతయుఁ జూరగొని తన్ను రిక్తాత్ముని జేసిపంపిరని భావించెను. సువారంపుదొరలుగాని, దాసదాసీజనంబులుగాని

స్వరూపస్వభావములు తెలియనందున నతనిఁ బల్కరింపక యంత్రిసదృశమ్ముగఁ బ్రవర్తించిరి. నూతనాగతుం డగుట వేడుకకాండ్రును నతనివద్ద నొకర్తె బిడియపడిరి. రమణీయ మగు వాయంతిపురమున బోనులోనిసింహకిశోరము ట్లానృప కిశోర మాపగలంతయుఁ జర్వితచర్వణముగ శయనాసనస్థితి సంచారములు సలుపుచు జరిపివైచెను.

నాఁటిసాయంసమయమున సుమంత్రుండు, సచివసుహృద్బంధుసామంతముఖ్యుల సమావేశముగావింప నందుఁ గుశస్థలి నుండి చనుదెంచినశశిబిందునరేంద్రునిపురోధసుండు పెండ్లి కొమరునకు మహార్ఘమణిభూషాంబరములు కానుకపెట్టించి తత్పితృష్వస యగుసుపుష్టకును, దన్నాథునకు మహాభాగునకును విద్యుంపుటుంగరలు చెల్లించి సువర్ణాక్షరవిలసితంబును సురభిళంబును హారిద్రాంకితమ్ము నగులగ్నపత్రికను మాత్రాక్షతలతో మహాభాగున కొసంగుటయుఁ దత్పురోహితాగ్రణి నష్టాతమువిధానంబున నర్పించి కాంచనకటకాంగుళీయకములును, బట్టుపుట్టంబులు నొసంగి బహూకరించుటయుఁ బ్రధానంబులై చెల్లెను. తుదను మహాభాగుండు తత్రత్యుల కెల్లరకు సుగంధ చందనకుసుమతాంబూలంబులఁ బెట్టించి యెల్లిమధ్యాహ్నవసరంబునఁ బెండ్లికుమారులతోఁ బయనంబు సేయవలయునని యాహ్వానంబు తెలిపెను. అప్పలుకులు విని యందఱు హర్షవికసితాననులై యటనుండి వెడలిపోయిరి.

అట మునిపల్లియలో భృగుమౌని యొకనాఁటిమధ్యాహ్న ముత్తరాభిముఖుండై యూర్ధ్వమార్గమున యోగమహి

ముతో ననాయాసముగ నమరావతి కరిగి యట నమరేంద్రు నిచే నర్చితుండై యతనితో నిట్లనియె.

మహేంద్రా! రాఁగలదశమదినంబున నయోధ్యానగర మందు యువనాశ్వునకుఁ గన్నకొమరుండును, నీకుఁ బెంచిన కొమరుండును మాకుఁ బుత్రనిర్విశేషుఁడు నగుమాంధాతృ నకుఁ బ్రజావాంఛితముఁ దీర్చ మహర్షిప్రభృతులు • పట్టంబు గట్ట నిశ్చయించిరి. అనిన విని యింద్రుండు - మునివరా! అక్కుమారుం డతిమానుష తేజఃప్రతిభాశాలియనియు, రూపున మాకుమారుండు విక్రమమున నమాకుమారుం డనియు గుణములప్రోవనియుఁ బలుసారులు మునివరులు దెలుప విని యుంటి. ఏమందురు? అని యడిగెను.

భృగుమహాముని:- నరిగ వినియుంటివి. నీచేతికుడుపు నొందినకొమ రుఁడు మాకుమారుండు నమాకుమారుండునుగాక సామాన్యుం డగునే?

ఇంద్రుఁడు:- అందు, మాచేతికుడుపునకు మీచేతిశిక్షయుఁ దోడయ్యెఁగాదె!

భృగు:- సరి. మనప్రతిభ లట్లుండనిమ్ము. అస లక్కుమారుని పుట్టువ యట్టిది. పరమాణువులు ప్రభామయంబులు కాకున్న మణులకు శాణోత్తేజనంబునఁ బ్రకాశంబు సమకూరునా!

ఇంద్రుఁడు:- అది వాస్తవము. అట్లయిన నక్కుమారుని పట్టా భిషేకమున కేము నరుదెంచి కన్నులారఁ గాంచెదము.

భృగు:- అందుల కాహ్వానించుటకే యే మరుదెంచినది. యువనాశ్వుఁడీ వేడుక చేతులారఁ జేసికొన నోఁచఁడు. తత్తుల్యుండవగుట నీవు తప్పక చనుదెంచి యక్కుమారునిశిరమునఁ గిరీటంబు పెట్టి సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి తండ్రిలేనికొఱంతఁ దీర్పవలయు. దాన రాజలోకంబగాక భూలోకంబెల్ల ధన్యంబగు.

ఇంద్రుఁడు:- దానికేమి? ఏతాదృశలక్షణవంతు నాదరించిన మాప్రభావంబును సలక్షణంబగు. ఇందుకుఁ దా మెక్కుడు వచింపఁబనిలేదు. ఇది మాకర్తవ్యంబు. ఈకారణంబున భవద్దర్శనలాభంబు కల్గినందుల కెంతయు ధన్యుండను. అట్లనే. సమయంబునఁ దప్పక చనుదెంచువాఁడ.

అనవుడు భృగుమహర్షి మహేంద్రా! మంచిది పోయి వచ్చెద. సుఖముండుమని వచించి యుత్థితుండుగా సురేశ్వరుండు నమ్మునివరుని సాగనంపెను.

'పెదవి దాఁటినఁ బృథివి దాఁటు' నను పెద్దలపలుకు కల్లకాదు. మహేంద్రుండు వచ్చి స్వయముగ మాంధాతృని సింహాసనస్థుఁ జేయుననువడి జనతాప్రవాహమునఁబడి గ్రామానుగ్రామముగ నచిరకాలంబునన దేశమంతటను బ్రాఁకెను. అక్కారణమున జనులు నూతనోత్సాహపూరితులై కోసలకటకంబునకుఁ దండోపతండములుగ రా మొదలిడిరి. పట్టాభిషేకపూర్వవాసరంబునకె యాపురంబున సత్రములు, చావడులు, చప్పరములు, జనులతో సందులేక నిండియుం

డెను. పురబహిఃప్రదేశము క్రోశద్వయపర్యంతము రాచ
బిడారులతో నిండిపోయెను. మొదట రా నిచ్చ లేకున్నను
మహేంద్రుం డరుదెంచునని విని తద్దర్శనాపేక్షతో ధరణీశు
లనేకులు వచ్చిచేరిరి. కుశస్థలినుండి యరుగుదెంచిన
పెండ్లివారికరివారముతో నగరంతయుఁ గ్రిక్కిరిసియుండెను.
ప్రతిక్షణనవ్యవినోదశతంబులతో నఖిలజనానందకరం బైన
యుత్తరుణంబున నయోధ్యానగరంబునఁ జేరినయశేషజనమ్ము
నకు నాఁటిరేయి యహస్సమంబుగ నతిక్రమించెను. సూర్యో
దయం బగుటయు తడవుగ సభ్యులు చనుదెంచి సంక్షిప్త
భారతభూమినాఁ బరిఢవిల్లుపట్టాభిషేకభవనంబున మొదల నెడ
ము సొలకుండఁ గూర్చుండిరి. మంగళతూర్యరావంబులు
మ్రోయుచుండ బారెడుప్రొద్దెక్కు వేళకుఁ బట్టాభిషేక
కార్యక్రమంబు ప్రారంభింపఁబడెను. క్రమముగ సుముహూ
ర్తంబు సమాసన్నంబగుడు నానాపుణ్యనదీతోయంబులతో
మహీసురవరులు మంత్రంబులు పఠించుచుండ రాజపురోహి
తుం డా రాజనందను నభిషేకించె. తత్కార్యం బవసితంబయిన
తోడనే తల్లికగిది సుపుష్టాదేవి యమ్మనల్లు నభినవాంబరాభర
ణాంగరాగముల నలంకరించుచుండ భృగుమాని పురందరాగమ
నంబు గోరి భ్రూయుగళంబుతోఁ బక్ష్మయుగళంబు చెలిమిసేయ
మింటిదెస నాలోకించుచుండెను. సభ్యులును శక్రుఁ డింకను జను
దేరఁడే యని వేగిరపాటు చూపుచుండిరి. అత్తఱి నాకసము
నుండి తేజోమయం బైనవ్యక్తి యొకండు వెలుఁగుల వెద
చల్లుచుఁ బురుషశ్రేణికి సిగ్గువడి మగరూపుగొని వచ్చునా

మాంధాతృలక్ష్మి నా నాథవనమ్మునఁ బ్రవేశించి యట నందఱు సంభ్రమమున లేచి వందనములు సలుపుచు నిశ్చలదృష్టి నీక్షించుచుండ, "మహేంద్రా! యరుదెంచితే మంచి" దనుచు నగుమొగంబులతో స్వాగత మొసంగు మహర్షివరులకుఁ గేల్మోడ్చుచు నెదుట మణిమయాసనమునుండి యవ్యగ్రిత నుత్థితుండై నమస్కరించు మనోహరాకృతి యగుమాంధాతృ నువలక్షించి మనంబునఁ బొడమిన సంతసంబు నయనవికాసరూపమున వెలువడ డాయంజని యక్కుమారుని, ఫుల్లారవిందసదృశం బగుపాణితలంబు గ్రహించి యాఘ్రాణించి చెంతనుండు సింహాసనంబున 'స్థిరోభవ' యనుచు నాసీనుం జేసి పార్శ్వపీఠంబునఁ బ్రభలవెలుంగుమణిమయకిరీటంబుఁగొని యాతనిశీర్షంబున హస్తద్వయంబులో నలంకరించి నొసటఁ దిలకంబువెట్టి వ్రేల ముద్రిక, కేలఁ జంద్రహాసము నమర్చి 'ధర్మేణ జయ. రంజయ. భంజయ' యనుచు నుపదేశపూర్వకముఁగ నభయ మొసంగి విడువలేక కావలయు మరల నామూర్ధాభిషిక్తుని కరతలంబు నిజకరంబునఁ దెమల్చి మరలి మహర్షులయభినందనములు నచటి మహాజనులయభివందనములు గైకొనుచు నటనుండి యదృశ్యం జనియెను.

అనంతరము మాంధాతృండు మనంబునఁ బరిణయంబునాఁటిబంధుమతీపాణిగ్రహణంబును నిప్పటిపాకశాసనకృతపాణిగ్రహణంబును విమర్శించుకొనుచు వానితారతమ్యంబు తెలియలేక యల్పకాలము గంభీరభావమున నట్లు కూర్చుండెను. బంధుమతీకృతపాణిగ్రహణము లజ్జాశిథిలబాధము. పాకశాసన

కృతపాణిగ్రహణము ప్రియతాదృశబంధము ననునీపాటితార తమ్య మాతనికిఁ దెలియకుండు టెంతయు వింత.

అట్లము రెండుఁ జరిగినతోడనె పరిపాటితోడఁ దక్కిన ఛత్ర, చామరాదిరాజచిహ్నంబు లొక్కొక్కటిగ నాతని నాశ్రయించి సనాథంబులై వెలుంగ నంత భూసురాశీర్వాద ములతోడను మంగళతూర్యనాదములతోడను జయ జీవ శబ్ద ములతోడను నాపట్టాభిషేక మహోత్సవంబు సలక్షణంబై సకలజనానందకరంబై చెల్లెను.

---

# తొమ్మిదవ ప్రకరణము.

---

పట్టాభిషేకంబు జరిగినపిదపఁ బదునైదు దినంబులవఱకు నన్నగరంబున సందడి శాంతింపలేదు. ఆదినంబులలోఁ జైత్య ములందు, విద్యాశాలలందుఁ, గార్యాలయములందుఁ, బరిషత్తు లందుఁ బౌరులకుఁ జర్చింపఁబడువిషయములలో నీపట్టాభి షేకప్రశంసయే ప్రథమోపాత్తమగుచుండెడిది. "మాలి న్యము మంటఁగలిపి యనారోగ్యంబు రూపుమాపి నీటివసతుల నీటుచేసి దీపంబుల దీపింపఁజేసి యారామంబుల నభిరామంబు లుగా నొనర్చి యాగంతుకుల కభినవవసతుల నావటించి పురంబు ప్రత్యగ్రరూపంబుగ నొనర్చినపురపాలకవర్గమువారు బహుశ్లాఘాపాత్రులు. రాకొమరులు రాజధాని కరుదెంచిన ప్రొద్దుమొదలు పదునైదుదినంబులు పంచభక్ష్యపరమాన్నం బులతో నిఖలజనసంతృప్తికరంబుగ విరామంబు లేక యన్న

దానంబు సలుపఁబడెను. అయ్యెడఁ బల్లెలనుండి యరుదెంచిన పాలకావళ్ళకుఁ బెరుగుకుండలకు నేతికడవలకు మితిలేదు. కూరగాయలు పలుతెగలు పడవలమీఁదను బండ్లమీఁదను దేఁబడి కొట్లకు నింపఁబడినవి. సకలకార్యాలయములకు సమస్తవిద్యాలయములకు నాటవిడు పొసఁగఁబడెను. కారానివాసులకు విడుపుకలిగెను. ఇట్లఖిలజనంబులకు నమితానందకరంబుగ నింతమహావైభవంబుతో నేరాజన్యుని పట్టాభిషేకంబును బ్రవర్తిల్లలేద"ని యప్పటి వృద్ధకూటము లనేకములు ప్రశంసించినవి.

ఇట్లు పట్టాభిషిక్తుం డైన యానూతనమహీపతికి నిజరాజ్యాంగవ్యవస్థ లెవ్వియు మొదటఁ దెలియకుండెను. నగరునే జన్మించి నగరులోఁ బెరిగి నాగరికులతోఁ జరించుచు జనకునితో దినదినంబును గొలువుకూటమునకు వాహ్యాళికి వెడలుచుండినఁగదా నానాఁటికి సందర్భములెల్లఁ దెలియుచుండును! అట్లుగాక యడవినిబుట్టి యడవిని బెరిగి యనాగరకులనడుమఁ దిరుగుచు నగరుమొగ మెఱుంగనివాఁ డయ్యె. అక్కాలమున నతండు ముఖ్యకార్యాలయమునఁ గ్రొత్తగఁ బ్రధానపదవి నధిష్ఠించిన యాధునికవిశ్వవిద్యాలయోత్తమ పట్టభద్రునిభంగి రోజున కొకటివంతునఁ బ్రతివిషయమ్మును జాతుర్యమొప్ప సవిమర్శముగ వీక్షించుచుండువాఁడు. అయ్యవసరంబున మంత్రులు మొదలుకొని పహారావానివఱకు నుండు నుద్యోగులెల్లరు "ఈయనకీవిషయంబు తెలియద"ని తలఁచియుండ లేదు. విశేషించి తమ్ముఁ బరీక్షింపవచ్చె ననుచు భావిం

చుచుండెడివారలు. ప్రతిభాన్వితులకుఁ బ్రజ్ఞాహీనత నెవఁడు ఘటింపఁ జేయఁగలఁడు? ఈప్రకార మా ప్రభుండు ప్రవర్తించుచుండ నుద్యోగివర్గంబు నూతనోత్సాహపూరితమై యెక్కుడు శ్రద్ధాకుతూహలంబులతోఁ గాలాతిపాతమునుగూడ గమనింపక నిజకర్తవ్యంబు నిర్వహింపసాగెను. "రాతునుబట్టి గుట్ట" మనుట సత్యేతరము కాదు.

అట్లు సుమంత్రుఁడు తోడఁ జనుదెంచి పుట్టుపూర్వోత్తరము లేకరువుపెట్టుచుండఁ గ్రమముగ బండారంబు బాగోగులు; దుర్గతత్పాలనపరిస్థితులు; రథ, గజ, తురగ, పదాతుల యునికిమనుకులు, ఆదాయవ్యయంబులు, నప్పటి పరిపాలనా విధానము నవగతంబులుగఁ జేసికొని పరకష్టాసహిష్ణు వగునా మనీషి యుద్యోగిజనక్లేశజాలంబు గమనించుటంజేసి మధ్యాహ్నము మొదలు సార్థయామంబ కృత్యనిర్వహణసమయంబుగా సకలకార్యాలయములకు నుత్తరువు పంపి సర్వత్ర యుద్యోగుల సంఖ్యను, వేతనములను హెచ్చించెను. కతిపయవాసరంబులు గతించినపిదప రాష్ట్రరాష్ట్రీయజనస్వరూపస్వభావంబు లెఱుంగఁగోరి సుహృదాప్తసచివవర్గంబు తోడరాఁ బురంబు వెడలి బహుప్రజాభరితము లైననగర, పుర, గ్రామముల నిలుచుచు నాయాప్రదేశంబుల విశేషంబులు, ప్రజలకష్టనిష్ఠురములు, కృషి, వాణిజ్య, పరిశ్రమలపరిస్థితులును వీనులతో వినుచుఁ గన్నులతోఁ గాంచుచు నీరీతిఁ గోసలదేశంబంతయుఁ జుట్టి స్థితిగతులు సరిగ లేనందున నసంతుష్టచిత్తముతో నిజకటకంబునకుఁ జనుదెంచెను.

వచ్చినదిమొదల లాప్రజామిత్రుఁడు తదీయసౌకర్యసంపాదనముగుఱించి నిద్రనుగూడ మాని కతిపయదినంబు లతినిపుణంబుగ నాలోచించి సచివవర్గంబు సమాధానపఱచి యీవత్సరముమొదలు యజ్ఞార్థములై నయదనపుఁబన్నులు తీసివైవఁబడెననియుఁ, గవ్వములు కట్టుకాలావధులు మూఁడుకాక నాల్గింటికిఁ బెంచఁబడెననియుఁ గవ్వంబు నాల్గింటఁ బాలుమాని యాఱింటఁ బాల్గొనఁబడుననియు నీవరుసఁ బ్రజలకుఁదెలియఁ బ్రతిగ్రామమునందుఁ జాటఁబనిచెను. ఆచాటింపువినినతోడనే యాజనులకుఁ గల్గినసంతసమునకు మేరలేకపోయెను. ప్రతియూరునందును బ్రజాసంఘము లీశ్వరమధార్మికుని భగవానుఁ డనవరతము చిరాయురున్నతు లొసంగి సంరక్షించుఁగాక యనిప్రార్థనలు సలిపినవి.

తదనుగుణంబుగ నీసుశీలుండు ప్రతిదినంబును, ప్రాతఃకాలకృత్యంబులఁ దీర్చికొని కొలువుకూటంబున కరుగుచుఁ బౌరజానపదప్రముఖులకు దర్శనమొసంగుచు వారివారిమంచిసెబ్బరలు విచారించుచుఁ బెద్దలవలన నీతులు తెలియుచుఁ బ్రజాపక్షపాతియై ప్రవర్తించుచుఁ బ్రజానురాగంబు చూరఁగొనుచుండువాఁడు.

ఇట్లు కొంతకాలంబు గడచినపిదప భృగుమౌని యానతిచ్చినట్లు లోకమున నలుదెసల నలముకొనిన దుస్థితిపవనంబులనుభవగోచరంబులై యంతరంగంబు నార్చుచుండ నోర్వఁజాలక యానరనాయకుం డొక్కనాఁ డేకాంతవాసియై సుదూరంబు కర్తవ్యంబు యోచించి సుమంత్రుని రావించి నేఁటికొని

మిదవనాఁడు స్వదేశీయమహాసభ నొకదాని జరుపసంకల్పించి తిమి. తగుజతనంబులు సేయవలయునని యానతిచ్చె. అతఁడు మాఱుమాటాడక తన్నియోగంబు దీర్ప నటనుండి వెడలి పోయెను. అదేలనో యాన్నృపాలు నెదుట మంత్రు లెల్లరు మాటలుమాని చలనచిత్రములట్లు చరించుచుండిరి.

నిర్ణీతవాసరంబునఁ గోసలదేశంబునఁ బలుతావులనుండి ప్రజాప్రముఖులు ప్రతినిధులు, పండితులు, పన్నువెట్టుపుడమి దొరలు నితరు లనేకు లుత్సాహభరితులై విచ్చేసి సభామంది రంబు చాలదనిపించిరి. మాంధాతృండును సకాలంబునకు సభ్యులు సంతసిల్ల నయ్యెడ కరుదెంచి నిజపీఠంబున నాసీనుండై కరతాళధ్వనులు శాంతించినపిదప లేచి తనయాహ్వానంబున కానందముతో వచ్చినందులకు సభ్యులకు సంతోషకరమ్ముగ నుపచారవచనంబులు వినిపించియిట్లుపన్యసింప నారంభించెను.

మదేకనిహితచిత్తులై మదున్నతియు స్వకీయోన్నతిగ భావించునుదారశీలురారా!! మీలో నొకఁడ నగు నన్నిట్టింతయుచ్చపదంబునఁ జేర్చి సమ్మానించుమీముఁ, బ్రియంబులు హితంబులు నగునేఘనకార్యంబు లాచరించి సంతోషపఱచి "రాజ" నామ మెట్లుసార్థకముగావించుకొందునో చెప్పఁ జాలను. చెప్ప శక్యముగానియొడుదుడుకులతో లోకమిపుడు చాలఁ జీకాకుఁగలిగియున్నది. ప్రజలు, పార్థివులు నెవ రేకార్యములను గావింపవలయునో తెలియుట కష్టమగుచున్నది. మొదట నుపదేశకులు లేరు. ఉపదేశించిన వినువారు లేరు. జననాథులును స్వతంత్రులై చరించుచున్నారు. వృద్ధోప

దేశంబు లేనిజననాథుండు జనుల సన్మార్గచరులుగ శిక్షింపఁజాలు టెట్లు ? శిక్షించుజననాథునదుపు లేకున్న జనులు సన్మార్గచరు లగుట యెట్లు ? ఇట్టిసందిగ్ధతరుణమున మాయట్టివారే కార్యంబునకు దొరకొనినను విజయమొందఁజాలరు. బహుకాలమునుండియుఁ బాలించుదొరలు పదుగురును బరమస్వతంత్రులై వెలయుటంజేసి పుడమికి బహునాయకత్వమేర్పడినది. దానఁ దల కొక శాసనము, తల కొక దైవము, తల కొక మతము, తల కొక భాషయు నెలకొనినవి. వానిమూలమునఁ బక్షములు, కట్టుదలలు, పెరుగఁ గలహామతులయి ప్రజలును బ్రభువులు క్రమముగ నైకమత్యమునకు దూరమును, అసూయకు దాపు నైరి. అసూయావిష్టులై నృపులు దూరదృష్టి లేక యొకరాజ్యములోనిపదార్థ మింకొకరాజ్యమునకు రాకుండ శాసించుకొనుటతో వ్యాపారము సన్నగిల్లెను. వ్యవసాయ మసహాయమై యసదయ్యెను. పరిశ్రమలు ప్రోత్సాహరహితములై పరిక్షీణములైనవి. కళలు కళావిహీనములు. విద్యలు విజ్ఞానశూన్యములు. ఈయనర్థపరంపరకంతకు మూలమైనయీబహునాయకత్వము నానాఁట రూఢమూలమై ప్రజలకు దృష్టిమాంద్య మొదవించి యభ్యుదయ మనుమానాస్పదముగఁ జేసివైచినది. ఈబహునాయకత్వ మెన్నఁడు తొలంగునో యానాఁడ యీయనర్థపరంపర యడంగి యభ్యుదయము తలసూపును.

మఱియు నీబహునాయకత్వంబ ధరణీతలకంటకములైనతస్కరనికరంబులు తలఁదాచుకొనఁ దావొసంగినయది.

ఇట్లింక ననేకభంగులఁ బ్రజలను దమ్ము దుస్థితిమునుంగఁ జేయునీ యనర్థపరంపర కాదికారణంబు నొకప్రజాధినేతయు విచారింపఁబూనఁడు. దైనందినకృత్యంబుతోఁ దృప్తుఁడగును. ఈ వరుస నిర్విచారు లగుప్రభువులఁబట్టి ప్రజలును విచారశూన్యులయి యుండినఁదినుట, యుండకున్నఁబండుట యనుమతితోఁ గాననివాని నూఁతగొని కాననివాఁడు చరించుభంగిఁ జరించుచున్నారు. శూరశిఖామణులకు సూరిశిరోమణులకుఁ గర్మకుశలులకుఁ గార్యశూరులకు దానవీరులకుఁ దత్త్వవేత్తలకుఁ దపోధనులకు విజ్ఞానఘనులకు సత్యనిరతులకు జన్మస్థానమై సకలసంపత్సమృద్ధితో వర్షాంతరముల కంటె సర్వోత్తమమని ప్రఖ్యాతిగాంచినయీభరతవర్షము నేఁటికిఁ బిఱికిపందలకు నల్పబుద్ధులకు ననమర్థులకు నలసులకు నౌదార్యహీనులకు సంశయాత్ములకుఁ దుచ్ఛసుఖలాలసులకు నప్రతిభులకు ననృతశీలురకు నాలయమైనది. దూరదృష్టి, స్థిరచిత్తము, నాత్మాలోచనము నొక్కనికిఁ గానము. ఉపకారపరత దయాదాక్షిణ్యములు శూన్యములు. సర్వత్ర స్వార్థపరత చక్షుర్గోచర మగుచున్నది. అసూయ మెండు. ఇంద్రియలోలత హెచ్చు. ఇవి యన్నియుఁ గలియుగవాసనలు. ఉత్తమయుగములో నుత్తమభూమిలో నుత్తమజాతియం దుద్భవించినమనము-ఇంకను గలియుగవాసనామూర్ఛితులమై కర్తవ్యవివేకము లేకుండుట కడుంగడు శోచనీయము. ఒకసారి తొల్లింటికృతయుగీనవైభవము లెట్లున్నవో సింహావలోకనముతో గమనింపుఁడు. ఆకాలంబునకు నీకాలంబునకు హస్తిమశకాంతరము కలదు. తాదృశవైభ

వము మరల దొరయు సర్వులకు నొక్కనాయకుఁ డొక్క శాసనము, నొక్కదైవము, నొక్కమతయు నొక్కభావయుఁ గావలయు. అప్పుడు భేదభావములు పిరిదులును. ద్వేష మంతరించును. అద్వైతవం బగు నైకమత్య ముదయించు. దాన జనులకు సర్వశ్రేయములు గలుగును. ప్రతిమానవునకును, దనకుటుంబమును దనగ్రామమును దనమండలమును దనదేశ మును దనలోకమును సమున్నతికిఁ దేరఁబూనుట తప్పని ధర్మము. అయిన నీమహాకార్యం బొకరిద్దరిపూనికఁ దీఱునది కాదు. పలువురు సాయపడవలయు. సాయమ్ములేక యెంతటి దక్షుండు నేకార్యంబును దీర్పఁజాలఁడు. బంగరుపళ్ళెరమ్మున కును గోడచేరువ కావలయు. ఇట్లని ప్రతిమానవుండును, "నాహం నాహ" మ్మనుచుఁగర్తవ్యమునకుఁ గండగళ యూర కున్నచో ననర్థము లట్లె యుండును. నోరులేనిజీవములట్లు కష్ట ములుగుడుచుట జ్ఞానవంతులలక్షణము కాదు. ప్రథమమున సాయము కొంచెమైనను, బరికరము బంధించి యొకండు కార్యరంగమున కురుకునప్పటికి సాయము జతపడకమానదు. గొఱ్ఱెదాటువలె గతానుగమనశీలంబు విడిచి ప్రజలు వివేక వంతులై యన్యోన్యము కూర్పుకొనుచుండిన మేలు. ప్రభువు నకుఁ దొందరసాటు లటస్థింపఁబోదు. పేరునకుఁ బ్రభువుగాని ప్రయోజనంబు ప్రజాశ్రితంబు. ఈసందర్భమున మీరందఱు సముత్సుకులై మాకుఁ దోడ్పడెదరేని మొదట మనదేశము నుద్ధరించుకొని యిటఁగృతార్థులమై యావల ముందడుగిడు దము. ఇంట గెల్చికద రచ్చఁగెల్వఁబోవుట ? ఇట్లని ప్రత్యు

త్తరకాంక్షాసూచకంబుగఁ జూచుచు నూరకుండెను. అది
నుండి యింతవఱకు సత్యాసక్తిమెయి నాలకించు సదస్యులు
నూతనోత్సాహమున నుచ్ఛ్వసితహృదయులై "యవశ్యము
తోడ్పడుదు'మని యావర్తించి పల్కిరి. నృపుం డాసదస్య
వాక్యము నాత్మప్రయత్నమునకు మొదటిశుభలక్షణముగా
గ్రహించి కర్తవ్యభాగ మొకింత తేటపఱచి విరమించుతలం
పున మరల నిట్లుపక్రమించెను.

మనదేశంబున, జనపదంబులెల్ల జాడ్యనిలయంబులు,
దారిద్ర్యమునకుఁ దానకంబులు. ఎచ్చటను బరిశుద్ధి పొడగా
నము. విద్యాగంధము శూన్యము. చౌర్యోపజీవులు పెక్కండ్రు.
ఆతతాయు లనేకులు. ఈదుస్స్థితికంతకు మూలకారణములు
విద్యావిహీనత, వృత్తిశూన్యతయు. ఎల్లరను బీల్చిపిప్పి చేయు
వీని సున్మూలింప మీరందఱు నడుములుకట్టి నిలచి యీడువ
చ్చిన ప్రతిబాలకుని విద్యాభ్యాసమునకు జతపఱుపవలయును.
ప్రాథమికశిక్ష నందినపిదపఁ గళాకుతూహలిని గళాశాలకుఁ
గర్మకుశలుఁ గర్మాగారమునకుఁ, గృషివాణిజ్యరతుని దదుచి
తకార్యంబులకు, సంగ్రామరతుని సాంగ్రామికకళాశాలకును,
బంపునటులఁ బ్రజలకు బోధింపవలయును. ప్రభుత్వమూలమున
మీకు వలయునంతయర్థబలంబు చేకూరఁగలదు. మనమందఱము
ధర్మమునకు దాసులము. ధర్మముతో భూతములు నిలిచియు
న్నవి. శ్రద్ధావంతులమై దానిని బాలించిన నది సకలశ్రేయంబు
లొసంగి మనల సంరక్షించు. ధర్మమే ధ్యేయము. ధర్మమే
దైవమ్మన కాశ్రయము. తాదృశధర్మప్రచారంబునకై యచి

రంబున మాచే నూరూరఁ బ్రవర్తింపఁజేయఁబడు ధర్మసభలను సభ్యత్వపురస్కారముతో నభివృద్ధిఁదెచ్చుభారమును మీయుదియు. వానిచేఁబెట్టఁబడిన విద్యాలయములు, కళాశాలలు, శస్త్రాగారములు, కైగారికములు, నితరకృతులు నడపఁబడును. అంత నస్మద్దేశంబు నావరించినదుస్థితిపరంపరలు దూరమ్ములగుటయు గాక మనము సకలసంపదలతోఁ దులదూఁగుటయుఁ గల్గు. మఱియెవ్వరేని దేశాభివృద్ధికిఁ దగువాలోచనలు దెల్పునెడల నవి క్రియారూపకముగఁ బరిణమింపఁ బ్రయత్నింతుము- అనికూర్చుండెను.

ముహూర్తకాలంబు నిశ్శబ్దమై యతిక్రమింప నచటి ప్రజలయుఁ బుడమిదొరలయుఁ బ్రోత్సాహమున నొకపండిత వరుండు లేచి నృపవరున కిట్లు విన్నవించెను. దేవా! తత్త్వజ్ఞులైనతమకు మాచేఁ దెల్పఁదగినయాలోచనలు వేఱయుండునే? మా క్షేమంబు గోరి యిట్టిపూర్వాలోచనంబు తెలిపిన మీ కెంతయుఁ గృతజ్ఞులము. ఏతదుద్యమంబున ధర్మప్రభుండైనయాధరణీధరుండు తప్పక తమకు జయముచేకూర్చుఁగాక. ఇట్లతండాశీఃప్రశంసతో విన్నపము ముగించెను. వృద్ధమహీసురులు "తథా" స్తనుచు హస్తంబుల మంత్రాక్షత లునుప మాంధాతృండు మహాప్రసాదంబని గ్రహించి పిదప యథాక్రమంబుగ నాసమావేశమునకు సెలవొసంగెను.

---

# పదియవ ప్రకరణము.

—:o:—

అనంతరంబ మాంధాతృనియోగంబునఁ బలువురుపటి ష్ఠులు పల్లెపల్లెకుంబోయి రచ్చకొట్టములకడ జనాకర్షకము లైనసంగీతాదివినోదంబులఁ బ్రదర్శించుచు నత్తఱిఁ జేరినజన బృందమ్ములకు విద్య, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, పరిశ్ర మలు, వ్యవసాయము, వాణిజ్యము వీనిగుఱించి మంచిమాట లతో ముచ్చటకలుగ బోధించి తద్బోధనము క్రియారూప మును దాల్చుపర్యంతము పాటుపడుచువచ్చిరి. తదనుగుణం బుగ నాపల్లెలజనమ్ములును బ్రబోధింపవచ్చినపెద్దను “ పో పోవయ్యా, మేం సదవకపోతే నీకేమి; నీమూ ఛేమైన పోతుందా! నీబుడ్డు వెట్టి కొనిత్తావా పలకలు బలపాలు? ఏమో సదువంట సదువు. సదువు బాపనోళ్ళకి. మాకేల నయ్యా మన్ను పిసుక్కునోళ్ళకి? చాలు చాలు. మొన్న మొవడో వచ్చాడు కొట్టంకాడేమేమో కూసుకుపోయినాడు మల్లా నీవస్తివా! యేటో! గాలిట వేడిట మొందుకో యీ తొక్కులాట ? ” అనుచుఁ బ్రహారింపుల తక్కువగా మొఱకు మాటలతో సాగనంపునీకాలపుగ్రామీణులఘనతఁ బూనక వలయుసదుపాయములుగూర్చి గౌరవించుచు “ తియ్యనినీటికిఁ జేపలెక్కురీతి వారిసద్బోధనలకు మక్కువతో నొక్కరొక్క రుగ వచ్చి యవి ముగియువఱకు వినుచుఁ గూర్చుండువారు. అది కాలమహిమ కాదు. రోగికి రోగము తీఱుతరుణము, వెజ్జునకు మాట దక్కుసమయము నేకీభవించిన ట్లాకాలపు సందర్భము లట్లున్నవి.

అంతఁ గొన్నివత్సరంబులు గతించునప్పటికిఁ గోసలదేశ మం దంతటను, పాఠశాలలు, పఠనాలయములు, పరిశ్రమాలయములు, కర్మాగారములు, కళాశాలలు, చెలరేగినవి. ఊరూరను శాస్త్రములు చర్చించువారు, కళావిలాసములు గణుతించువారు, వాణిజ్యమును వర్ణించువారు, హస్తవృత్తుల నభినందించువారు, ఆహవధర్మముల నభినందించువారును, మితిమీఱిరి. నానాఁట నారాష్ట్రమంతయు వైజ్ఞానికవినూత్ననిర్మాణకౌశలముతో సాధనసంపత్తి సులభమగుటచేతను, బంటచెఱువులు, పంటకాలువలు పాఁతవానితోఁ గ్రొత్తవి కొనసాగి పంటపైరులు పశుసముదయంబును బెంపొందుటచేతను, మాంధాతృనితో మంతనముసలుపు రాజన్యులరాష్ట్రములతో వాణిజ్యము విస్తరిల్లుటచేతను, ధనధాన్యసంపదలతోఁ గలకలలాడుచు నానందనిలయమై విలసిల్లెను. అకాలంబున నవనీశుండనిన నితండ యవనీశుఁడు. తక్కినవారందఱు వనీశులుగాని యవనీశులు గారు. అ తఱిఁ గొందఱు వృద్ధరాజన్యులీనృపాలుని, "అదృష్టమాడించుచున్నది ఆతని దేమున్నది" ఇట్లని యీసడించుచుఁ దమ నిర్యత్నతను, అదృష్టహీనతను వెల్లడించికొనిరి. ఏకార్యమునకుఁగాని పౌరుషము, దైవము రెండును గారణములు. అందుఁబౌరుషము మొదటిది. కార్యసిద్ధికిఁ బురుషుఁడు యత్నించిన దైవ మనుకూలత ఫలమొసంగుఁగాక. పురుషుఁడు యత్నింపకున్న దైవము ఫల మెట్లిచ్చును? వాన కురిసినమాత్రానఁ బంటలు పండవుగదా !

లోకమునఁ బాటవలంతివలన బంగారుపూవులు పడయు పురుషులు మూవురు : శూరుఁడు, సేవాచతురుఁడు, విద్యా

కుశలుఁడు. ఇట్టివారాకాలమున నక్కడక్కడఁ జెదిరిపడినవిత్త నములట్లు కొందఱుమాత్రముండిరి. అట్టివారిలో మహాకథా నాయకుం డగ్రేసరుఁడు. శౌర్యము, సేవాచాతుర్యము, విద్యాకౌశలము నొక్కెడనుండుట దుర్లభము. కొందఱియెడ శౌర్యము, విద్యాకౌశలము నుండఁబోలు. సేవాచాతుర్య ముండుట యరిది. నిప్పునకు నీరువలె శౌర్యమునకు సేవ విరుద్ధ ధర్మము. అయినను నిప్పునుండి నీరు వొడమినట్లు శౌర్యము నుండి సేవ యుద్భవించె నన్నతత్త్వ మెఱింగినచతురుం డగుట మాంధాతృం డీమూఁడుధర్మముల నిమిడ్చిపట్టుకొనెను. ఇదే యితరులకంటె నితనియందుఁ గలవిశేషము. ఏతద్విశేషంబు చేతనే యితండు ప్రభుత్వమును బ్రజాసేవయు సమముగ నడపఁగలైను.

ఈరీతి ఫలితపౌరుషుం డగునీపృథివీపతి తన కింకను లోకానుభవము సాలదని యప్పుడప్పుడు తనసేమమూరయఁ జనుదెంచినసాధువులకడ సదుపదేశముల వినుచుండువాఁడు. వానిలో బ్రహ్మవిత్తముం డైనయుతథ్యునియుపదేశం బిట సం-క్షేపరూపముతో నిట్లున్నది.

మాంధాతృమహీశా! ధరణీశుండు ధర్మరక్షణమున కేర్పడెనుగాని తనయభీష్టములు తీర్చుకొనఁగాదు. అతండు ధర్మము చరించిన దేవత్వము పొందును. చరింపకున్న నరక గామి యగును. సర్వభూతములు ధర్మమున నిల్చియున్నవి. ధర్మము రాజునందు నిలిచియున్నది. ఎవండు ధర్మమును జక్కఁగఁ గాపాడునో యతండ ధరణీపతి. స్వధర్మనిరతున

కే. మగు నభీష్టార్థసిద్ధి యగును. ఇట్లగుట, తాదృశమంగళరూపమైన ధర్మము సర్వజనాశ్రయణీయము. ఎప్పుడు ధర్మము నష్టమై యధర్మము పెరుగునో యప్పుడు దివారాత్రములు ప్రజలకు భయ మొదవును. పాపరూప మైన యధర్మము వారింపఁబడ దేని సాధుజనులకు గృహము, క్షేత్రము, పశువులు, కళత్రము మున్నగునవి దక్కవు. దేవతలకుఁ బితృదేవతలకుఁ బూజలు చెల్లవు. అతిథుల కాతిథ్యముండదు. ద్విజాతులు వేదముల నధిగమింపరు. వ్రతములు చరింపరు. విప్రులు యజ్ఞములు చేయరు. ఇహపరలోకము లపేక్షించి తొల్లింటి మహాత్ములు రాజు నేర్పఱచిరి. కావున ధర్మలోపము కలిగింపరాదు. కామక్రోధములను విడిచి ధర్మమును బాలింపుము. రాజులకు ధర్మ మత్యంత శ్రేయస్కరము.

ధర్మమునకు ధరణీసురులు జననదేశంబగుట వారి నవశ్యము పూర్ణకాములఁ జేయవలయు. అట్లు చేయకున్న భయముత్పన్నమగును. తొల్లి దేవతలను బరాజితుల నొనర్చినబలిచక్రవర్తికి బ్రాహ్మణద్వేషముతో సిరి తొలఁగిపోయినది. ధర్మమునకు సిరికిని దర్ప ముద్భవించినది. దానిని దేవతలు మునులు నెవరైన నవలంబించిరేని యవశ్యము చెడుదురు. ధరణీపతి దానిని దరిఁజేరనీయరాదు. దర్పోద్రిక్తుండై ధరావరుండు పరదారగమనాద్యధర్మంబు లాచరించెనేని వానలు లేక పుడమి ఫలరహితంబగును. ప్రజకు దైన్యంబు వాటిల్లును. రోగము లలమును. బలతేజంబు లుండవు. సైన్యమునకు శత్రుపీడ కలుగును. అకార్యంబు లాచరింపక ధర్మ

పరాయణుఁ డైన భూపతి సంతానము, బంధువులు, ప్రజలు, సేనలు మున్నగు శుభసంపత్తితో వెలయును.

రాజగువాఁడు రజకుఁడు వస్త్రములను శోధించి పరిశుద్ధములను జేసినట్లు నాలుగుజాతులను వరుసగ బ్రహ్మచర్య తపోమంత్రిసత్యములందును, దండనీతియందుఁ, గృషివిషయమందుఁ, గృత్యములయందుఁ జక్కఁగ శోధించి పరిశుద్ధాత్ములఁ జేయవలయును. సకలధర్మములకు రక్షకుండగుట రాజు యుగ రూపుండు. కావున రాజా! ప్రమాదరహితుండవై పరిశుద్ధతఁ బరఁగుచు స్వపరచ్ఛిద్రంబు లారసికొనుచు స్వచ్ఛిద్రంబు పరుల కెఱుకపడనీక ధర్మంబు విడక జనులఁ బాలించుచు జాగరూకుఁడవై మెలంగుము.

ఇట్లు ధర్మతత్పరుఁడై "ధర్మేణ లోకా స్తయతి" యను శ్రీసూక్తిని జపియించుచుఁ గోసలమునం దెల్లెడల మున్ను వచించినట్లు శాఖోపశాఖలుగ ధర్మసమితుల నెలకొల్పించి ధర్మప్రచారము సలుపుచు వానియాధిపత్యము క్రింద వలయు సౌకర్యములు ప్రజలకు సమకూర్చుచు మహావిభూతి దనరఁ బ్రజలతోఁగూడ నిరతిశయసుఖంబు లనుభవించుచు నితరులకును దాదృశసుఖానుభవంబు సంపాదింప నుపాయాన్వేషణంబుతోఁ బొద్దులుపుచ్చుచుండ నంతకుమున్న యితర రాష్ట్రీయ ప్రముఖులు తోడిప్రజలతో సమావేశము కలిగినపుడెల్ల "గళమునకు గానము, సభాతలంబునకుఁ జదువు, గగనతలంబునకుఁ గమలబాంధవుఁడువలెఁ బురబృందమున కయోధ్యాపురంబును, దేశసముదయంబునకుఁ గోసలదేశంబును మహీశ

లోకంబునకు మాంధాతృనృపతియు నలంకారములు. ఆరాజో
త్తమునిరాష్ట్రమ్మున నిజధర్మమునకు మార్గము వెట్టుమను
జూఁడఁ గ్గోరుండును లేఁడు. మఱియుఁ దండ్రితోఁ దనయుఁడును
అన్నతోఁ దమ్ముఁడును, మగనితో నాలును, ఇచ్చినవానితోఁ
బుచ్చుకొనినయతండును, పైనుద్యోగితోఁ గ్రిందియుద్యోగియు
స్వామితో సేవకుఁడును మఱెవ్వరైనఁగానిండు-ఒకనితో నింకొ
కండు గోరంతకుఁగాని కొండంతకుఁగాని కలహించుట వినియె
ఱుంగము. వృత్తికొఱకుఁ గత్తినూరుఘాతుకుండును వినము
త్రిప్పువెంగలియుఁ గలికమునకును గానరారు. మతాచారము
లపట్ల మాఱుపడత మందునకైన దొరకదు. విశ్వరూపి యైన
విష్ణుండె తద్దేశీయుల కుపాసనీయదైవంబు. ధర్మప్రవర్తనంబ
తదుపాసనము. అచటివారంద ఱన్యోన్యము సాహాయ్యమొన
ర్చుకొనుచు సత్యముతప్పక శీలవంతులయి మెలఁగుచుంద్రు. అం
తరంగమందును నధర్మస్మరణము వారికి సింహస్వప్నము. అక్ర
మము, అసత్యము, అతిచారము, హింస, చౌర్యము, ఛద్మము
మున్నగుదుర్గుణకుటుంబము లచట నిలువ నీడ లేక మనదేశము
లకు వలసవచ్చినవి. ఈరీతిపరిపాలనంబు మున్నెనరవరుండు
నొనర్చినట్లు వినియు నెఱుంగము. తగుసాహాయ్యంబు దొరకునే
నిద్ధరావరుండు సకలధరణీతలంబు నేకచ్ఛత్రముగఁ బాలింపఁ
బటిష్ఠుఁడు. ఇట్టి ప్రభూత్తంసుని బడసినయాదేశీయులు చాల
ధన్యులు. మనల నలముకొనిన యీదరిద్రదుర్గంధము లెన్న
డడంగును ఎన్నఁడు నిశ్శంకముగ నుచ్ఛ్వాసనిశ్వాసములు విడు
వఁగలము? "అనియీవరుస నమ్మహనీయునివిభూతిప్రకారమ్ములఁ

జెప్పికొనుచుఁ దాదృశసుఖానుభవంబులకు మిక్కిలి మక్కువ పడి బహుకాలంబునకుఁగూడ దొరలు తమవంకఁ గన్నెత్తి చూడకుండుటచేఁ గృతార్థులు కానేరక వేసారి తుద కావీర వరేణ్యునకు "దేవా! భవదీయప్రజాసామ్యంబు ప్రసాదించి మాప్రదేశము ముక్తప్రసన్నంజేయుదురుగాక, ఈగతివిధంబున దేవరకుఁ దోడ్పడ దీక్షితుల" మని విన్నవించుకొనిరి.

ఇటఁ దత్కాలపుఁ బరిస్థితు లింకనొకింత విరివిగఁ దెలుపవలసియున్నది. వెనుకటి కలియుగాంత్యమునకు మానవు లల్పాయువు లల్పబుద్ధులు హ్రస్వాంగులు నయియుండిరి. అప్పుడు శాసించు ప్రభువు లేనందున నోరుకలవానిది రాజ్యముగుచుండెను. అందువలన జనులందఱు దుర్వ్యసనశీలురై యొండొరులు పొడుచుకొనుచుఁ బశుప్రాయులై తిరుగుచుండిరి. కళలు, వృత్తులు, విజ్ఞానము, నాగరకత సర్వము నశించినది. నీతు లడుగంటినవి. నియమములు నేలఁగలిసినవి. ధర్మము దయాసత్యశౌచంబులు తొరంగిపోయినవి. వేయేల భూతలంబు సర్వంబును తొల్లింటి వైభవంబు వెడలి పాడుపడియుండెను. తరువాత శని వెడలి యాదివారము వచ్చినట్లు కలియుగము గతించి కృతయుగమువచ్చినది. వచ్చినపిదపఁ గొంత కాలమువఱకు నాపరిస్థితు లట్లయున్నవి. తరువాత బుద్ధిమంతులగుమానవు లుదయింప సంఘసంస్కార ముపక్రాంతమయ్యెను. బీజప్రాయముగ నిలిచియున్న బ్రాహ్మణకుటుంబములందు మరల విద్యాబీజంబులు మొలకెత్తసాగినవి. క్రమంబున జనులలో రాజు ప్రజ, స్వామి సేవకుఁడు, పెద్ద పిన్న, గురువు

పైనము, కుడి యెడమ - అను తారతమ్యభావంబు; పాపము
పుణ్యము, న్యాయము అన్యాయము, కార్యము అకార్యము,
యోగ్యము అయోగ్యము, ఆచారము అనాచారము, భో
జ్యము అభోజ్యము, పేయము అపేయము, ధార్యము
అధార్యము - అను వివేకంబును; స్నానము, సంధ్య, జపము,
తపము, అర్చన, ఆతిథ్యము, బలి, భిక్షము, వ్రతము, క్రతువు
నను నాచారములును- దయ, దాక్షిణ్యము, దానము, ధర్మ
ము, సత్యము, సారళ్యము, తాలిమి, ధైర్యము మున్నగు
గుణంబులును తలసూపఁదొడఁగినవి. పటిష్ఠులైన ప్రభువులు
దుష్టసంఘములఁ దునుమాడుచు రాఁగఁ దిరిగి ధరణీతలంబు
వ్యవసాయవాణిజ్యములతోడను గళావిలాసములతోడ నించుక
విలసిల్లఁజొచ్చినది. కాని - ఇంతలోఁ దలతల పెద్దరికములతో
బహునాయకత్వ మేర్పడినందున నా ధరణీవిలాస మతిశయిం
పక యంతన నిల్చియుండెను. భామిని పదుగురుపుత్రులతోఁ
బరిఢవిల్లునుగాని పదుగురు పతులతోఁ బరిఢవిల్లదుగదా!
తొలుత నట్టి పెద్దలైన ప్రజానాయకులు కొందఱు మతా
చారములపట్ల భిన్నమనస్కులై యొకరితో నొకరు చేరక
తమ యిచ్ఛమెయిన వర్తించుచు సద్వృశమ్ములైన ప్రజాభ్యు
దయకారణమ్ము లారయక కార్యసిద్ధికరంబులైన దైవపౌరు
షంబులు రెండింటిలో దైవానుకూల్యము కల్గిన సకలాభీష్టం
బులు సిద్ధించునను పిచ్చితలంపుతోఁ బౌరుషంబు నూపక
దైవసంతృప్తికొఱకు జన్నంబులు సేయఁబూని తన్నిర్వాహ
మునకుఁ దగనిపన్నులు ప్రజలపై దాకొలుపుచు దాకొలిపిన

కన్ను లీయలేక తప్పించుకొనఁజూచువారిని దారుణముగ దండించుచు వలయు విత్తమును సేకరించుకొని తలంపు నింపుకొనుటతోఁ జనిరి. కొందఱు ప్రజలవలన విత్తముఁ బడయలేక తమ ప్రార్థితో వలయుధనసిద్ధి నొంది లోకోత్తరముగఁ దమతలంపు నింపుకొని గతించిరి. ఈరీతి నానాయాగములు దైవానుకూల్యంబుతో మానవసంఘంబు మనుకఁ దలఁచి దానిఁ బడయ సలిపిన జన్నంబువలన యజమానులైనరాజన్యులకు నిహలోకఫలంబు కీర్తియు నాసందర్భమున నడుముకట్టి నిలిచిన కొందఱుజనులకుఁ గడుపాఱ భుక్తియుఁ గలిగినవిగాని యానాఁటి మానవలోకమున కేపాటిమేలును జేకూఱలేదు. మఱియు నాగ్రహపూరితు లైనయాయవనీశుల మూలమున సాంగ్రామికోపద్రవములుకూడ నప్పుడప్పుడు తలచూపుచుండెడివి. పిదపఁ దద్రాజన్యసంతతియుఁ బెద్దల యాచారము ననుసరించెనేగాని కన్దెఱచి యిప్పటికి వేఱొక యాచారము నవలంబింపదయ్యె. ఈకాలమున దొరలు నదుల నుండి కాలువలు తీయించుటకును చేలులు మఱి చెఱువులు నింపుటకు బాటలు వేయించుటకుఁ జదువులు చెప్పించుటకు వృత్తులు నేర్పించుటకు వసతులు కల్పించుటకు దుండగీలదుండగములు వారించుటకును బౌరుషము లేక గ్రుడ్డిచందమున దైవాయత్తజీవను లై పుడమిఁ బాలించుచుండ వివేకవంతు లైన జనులు బహుకాలముగఁ జుట్టుకొనియున్న కట్టులఁ దప్పించుకొనఁజూచిరి గాని తగినధరణీశునవలంబనము లేనందున వారి చూపులు వెఱ్ఱిచూపు లగుచువచ్చినవి. నేఁటికి మాంధాతృ

మహీశుండు దైవాయత్తమైనవెనుకటిపుంత ద్రొక్కక పౌరుషశాలియై నూత్నపద్ధతులఁ గల్పించి నిజరాష్ట్రజనుల నెనలేని సంపదలఁ బొదలించి ప్రజలపాలిటిచింతారత్నమై ప్రకాశించుచుండఁ జింతితార్థములు వడయ నిప్పుడు వారిచూపులకు మేలైన ప్రాపు దొరకెను.

పిమ్మట నొకనాఁడు తటితో విత్తనము వెట్టు నీప్రజామిత్రుం డనుభవశాలులు, వివేకవంతులు, కార్యదక్షులు, వక్తలు నగుపలువురుప్రముఖుల రావించి వారితో నిట్లనెను.

అన్నలారా! మీరందఱు నాదినుండియు నేకరీతిగ నిలుచుటచేత నిప్పటికి మన దేశంబున మనమందఱము నెందులకు నొరులకుఁ జేఁజాపు నావశ్యకత లేక సుఖముగ మనుచున్నారము. ఇందుల కెంతయు నానందింపవలసియుండెను గాని, యాయానంద మింకను సంపూర్తి నొందలేదు. చాలవఱకుఁ గుంటువడియున్నది. ఇప్పుడు మన మనుభవించు నానందము నెన్నఁడు మనజాతీయాఖిలభ్రాతృవర్గమునకుఁ బంచియిచ్చి మనతో సమముగ వారు సకళత్రపుత్రమిత్రబాంధవులై మోదించుస్థితికిఁ దేఁగల్గుదుమో! వారు, మనము, నందఱము నేకతాప్రతిపత్తితో సౌభ్రాత్రంబు నెఱపుచుఁ దుల్యానుభవరసికులమై మెలఁగుచు నెన్నఁడు విలసిల్లుదుమో! ఆనాఁ డయ్యది పరిపూర్ణావయవమై వెలయును. అప్పుడ మనకుఁ బరిపూర్ణానందానుభవము కలుగును. అదియ యస్మత్కర్తవ్యపరమావధి. సర్వోత్తమం బైనమానవజన్మంబుఁ బ్రాపించి వివేకవంతులమై భుజబల వచోబలంబులు కల్గి సర్వసమర్థులమైనమన మాత్మీయయోగ

క్షేత్రవ్యవహారమాత్రంబునఁ దృప్తినొందుచుఁ దోషహీనవృల దుర్గతులై యిడుములఁ గుడుచుచుండ, నూరకుండుట సముచితంబు కాదు. కావున మీరు నుండల మిగొకసరి కర్తవ్యశేషం బశేషంబు సేయఁ బరికరములు బంధింపవలసియున్నయది. ప్రతి దినంబును బలుతావుల ప్రజాప్రతినిధులు పెక్కండ్రు దెంచి తమకష్టపాటుల వినిపించి యాలంబన మొసంగ యుద్ధరింపుఁడని వేఁడుకొని వెడలుచుండుట మీకుఁ దెలియకయుండఁ బోదు. వారి వేడ్కోలులు విని యున్న మేల్కొని మనసోదర శ్రేయమునకు జతనంబు సేయవలసినది. ఇంకను నుపేక్షించుట మనకు లక్షణముకాదు. ఇయ్యెడ మొదలు దర్పపూరితులైన ధరణీశులకు ధర్మములు గఱపఁబూనుట తెలివిమాలినపని. దర్పోద్రిక్తులకు సదుపదేశంబులు శీతలజలంబులువలెఁ గర్ణశూలంబు జనియించును. అది మాని మున్నుగ వారిదర్పమడంప దండయాత్ర కరుగుటయు క్షేమకరముకాదు, దాన నొకవేళ నస్మత్పక్షంబునకు జయంబు లభించినను బహుజననాశ మొదవును. తుదకుఁ బ్రజాశ్రేయంబు గోరుమనము ప్రజాక్షయంబునకుఁ గారకులమగుదుము. అవనీశుల కాధారమైనప్రజలందే మాహాత్మ్యమధికమై యున్నది. సదుపదేశములు లేక చాలమంది సకలాంగులయ్యు వికలాంగులట్లు మెలంగుచున్నవారలు. ఈదుర్దశ తొలంగఁ బ్రథమమునఁ బ్రజలకే ప్రబోధంబు నలుపుట ముఖ్యము. అందుకు మీరందఱు మరల వలయుపరికరముల బంధించుకొని ధర్మధ్వజము చేతఁబూని యెల్లియు, శుభయోగముగానఁ బయనంబయి పల్లెపల్లెకుం

జని యథాప్రకారము ధర్మపద్ధతులఁ దెలుపుచు నచ్చటిపెద్దలచే ధర్మసభల స్థాపింపఁజేయవలయును. తత్ఫలితంబు మీకుఁ దెలియనిది కాదు. దీనఁ గొంతయజ్ఞాన మంతరించినపిదప నప్పటిపరిస్థితిననుసరించి ముందటిపని చూచుకొందము. మీకుఁ బరస్థలమున భీతియొదవకుండఁగ మారూపు మీవెన్కనయుండు. ధర్మమే జయము సమకూర్చును. ధర్మరతుల కెందును దిరుగుబాటు కల్గదు. కనుక నీకార్యంబుఁదీర్ప మీరు సంసిద్ధులు కావలయుననుటయు "దేవా! తా మింత చెప్పవలయునే దేవర యానతికై చూచుచున్నారము. ఇంక సర్వసంసిద్ధుల" మని వారందఱు నేకగ్రీవముగఁ బల్క నాధార్మికాగ్రేసరుండు వారి యుబలాటము గని సంతసించి తగువసనంబు లొసఁగి బహూకరించి వారిని వీడ్కొలిపెను.

---

# పదొకండవ ప్రకరణము.

:0:

అనతికాలంబున కానరపతిప్రేషితులయినధర్మప్రచారకులప్రబోధంబులతోఁ దత్కాలంబున కువలక్ష్యమాణభూభాగంబునం గలనానాదేశంబులందు నుద్దేశాధికములై బహుసభ్యభరితధర్మసమితులు సర్వత్ర శాఖోపశాఖలుగ విలసిల్లినవి. తత్ప్రేరణముతోఁ గాలక్రమంబున ఖర్వట, ఖేట, నగర, కటకంబులఁ బ్రాథమికమాధ్యమికోన్నతపాఠశాలలు, కళాశాలలు, శిల్పనిలయంబులు నెన్నియో ప్రబలినవి. చోరసంఘము

లనేకములు, జీర్ణవసనంబునువలెఁ జౌర్యవృత్తిని జాఱవిడిచి కార్మికసంఘములై వెలసినవి. పరిశీలించిచూచిన నత్తఱిఁ బ్రతిమానవునియందు నేదో యొకవింతమార్పు కన్పట్టుచునే యుండెడిది.

ఇవ్విధమున మాంధాతృగిరిసంభూత యగుపవిత్రధర్మక్షీరవాహిని సకలధరాతలంబునను బహుముఖంబులఁ బ్రవహించి నానాప్రజాసస్యంబులకుఁ బ్రశాంతవృత్తి నాప్యాయత నొసంగుచుండ నప్పుడవనీశులందఱు "దీన మనకేమగు"నని యౌదాసీన్యముతో సింహాసనస్థులై గూర్కు చెందుచుండిరి.

తాదృశక్షీరపానంబున నానాఁట దృఢతనులై తలలెత్తి ధైర్యముతో భాషింపనేర్చినప్రజాసమితులు తమ్మేరీతినుచ్చస్థితికిఁ దెచ్చినయమ్మహనీయుని, ఉపకారశీలుఁడు, సంస్థాపనకర్త, మహాసంస్కర్త, ప్రవక్త, మహాప్రవక్త, ఆచార్యుఁడు, పరమాచార్యుఁడు,- ఇట్లుత్తరోత్తరసమధికబిరుదములతోఁ గీర్తించుచుఁ దదీయ పవిత్రనామాక్షరంబులు తత్తద్దేశోదంచితంబులైన విద్యాభవనంబులు ధర్మసభామందిరములు మున్నగు వాని యందు సంప్రవృత్తము లగువార్షికోత్సవముల వెలయఁ జేయు పతాకలందుఁ దోరణపట్టంబులందు, ద్వారబంధములందును సువర్ణరసమున విలిఖించుచుఁ దమకృతజ్ఞతాప్రతిపత్తులను వెల్లడించుచువచ్చినవి. ఇట్లు సంఘములేగాక భూతలమునఁ గల ప్రతిజనపదంబునందుఁ బ్రతిమానవుండు నదేటిచిత్రమోయమ్మహాకతిని, జ్ఞానియని, మానియని, ధనియని, దాతయని, ధర్మియని, మిత్రుఁడని, యాప్తుఁడని, యధిపతియనియుఁ గాక యేక

ముగ నాత్మనడపు నంతరాత్మయనియే భావించుచుండువాఁడు. ఇంతయేల! ఆసమయంబున మాంధాత నేవోయూపముగఁ గీర్తింపనిదినము దేశమును ధరావలయంబున దొరకదు. ఇట్ల నుట యతిశయోక్తి యనరాదు. ప్రకృతమున మనచేఁ బూర్ణ పురుషుండని మహాత్ముఁడని పొగడఁబడుగాంధిమహాశయుండు ధర్మంబుని నేక దేశానుష్ఠానంబుతో ఖండాంతరములందుసైతము ప్రతీతికెక్కియుండ, ధర్మము శూన్యప్రాయ మైనయారోజు లలో స్వదేశము పరదేశమునని యెంచక యుర్వీతలంబునం దంతటను వ్యయప్రయాసలు గణింపక తోడిపుడమితేండ్లు కలఁతఁజెందకుండ సౌజన్యముతోఁ బ్రజలచేఁ బెద్దలకుఁ బ్రత్యే కముగను, చిన్నలకు సాముదాయికముగను బ్రబోధంబు చేయించి ఫలానుభవంబు కలుగునంతకు ధర్మమ్ము ననుష్ఠింపఁ జేసిన యీసంపూర్ణసర్వధర్మాధికారి యైననృపసత్తముండు సర్వత్రసర్వదా సకలజనజేగీయమానుండగుట నతిశయంబేమి? ప్రయత్నశీలురకు నెందు నశక్యంబు నలభ్యంబు నుండఁబోదు. “గచ్ఛతిపిపీలికాపంక్తి స్సముద్ర మధిగచ్ఛతి”. ఆకాలంబునఁ దపశ్శక్తిచే సువర్ణరాసులు సంపాదించి యజ్ఞశాలలు, యజ్ఞ పరికరములు, దక్షిణలు సువర్ణమయములుగ నొనర్చి దేవతలు పరివేష్టించియుండ సర్వోత్తమంబుగ సత్రాధ్వరంబొనర్చి సుప్రతిష్ఠఁబరఁగుమరుత్తభూపతియుఁ జతుర్దశజాతిరత్నములకు నిలకడయై ప్రపంచమున సిరిసంపదలతో సర్వాధికుండని ప్రశస్తిఁగాంచినపాశ్చాత్యచక్రవర్తి యైనశశిబిందుమహారాజు ను నీతేజస్వియుందు నిస్తేజస్కులైరి.

నానాదేశజను లప్పుడప్పుడు గూడుచుండిన నొండొరులవేషభాషలు, విద్యావైదుష్యములు, ఆచారవ్యవహారములు, వ్యాపారసరణులు, వ్యవసాయపద్ధతులు, మున్నగునవి తెలియనగుననియు, ద్వేషభావ మడంగి స్నేహభావము ప్రబలుననియుఁ గ్రమముగ సర్వులకు నైకమత్యము ఘటిల్లుననియు నీయుద్దేశములతో మనయువనాశ్వతనయుం డానాఁటి ధర్మవృద్ధులతో నాలోచించి. మొట్టమొదట నిజకటకంబున "నానాదేశధర్మసభ్యమహాసభ" నొకటి ప్రవర్తింపఁజేసెను. రెండగునేఁట నయ్యది కన్యాకుబ్జంబునఁ బ్రవర్తిల్లె. మూఁడగు నేఁటఁ గుశస్థలీపురంబునఁ దనర నాల్గగునేఁటికి నర్మదాతీరస్థమాహిష్మతీపురంబునకుఁ బిలువంబడియె. ప్రపంచమునఁ గల ప్రతిమానవవ్యక్తికిని ధర్మసభ్యత కర్హతకలదుగాన నానాఁట నామహాసభ బహుజనభరితమై సంక్షిప్తభువనమ్మునా వెలయుచుండెను. ఇట్లు ప్రతివర్షప్రవర్ధమాన మగునమ్మహాసభకు మహర్షులు, మహారాజులు, ప్రతినిధులు, ప్రచారకులు, తదితరులు లెక్కకు మీఱి వచ్చిరి. ఈతురీయమహాసభకు మాంధాతృం డధ్యక్షుండుగా మున్న నిర్ణయింపఁబడెను. కాని-యాతరుణంబున కతండు శరీరపరిస్థితి ప్రశస్తంబుగా లేనందున రాఁజాలనని సందేశమంపెను. అందుకు విచారమును దెల్పుచు వేఱొకయధ్యక్షునితో నమ్మహాసభ యుపక్రమింపఁబడెను. అం దొకమహర్షిసత్తముండు ప్రథమమున నాచారధర్మములను వ్యవహారధర్మముల నుపన్యసించుచుఁ గడకు- హస్తిపాదప్రమాణమున కఖిలజంతుపాదప్రమాణములు లోఁబడియుం

మున స్త్రీసర్వధర్మంబులు క్షత్రసద్ధర్మమునకు లోఁబడియుం డును. కనుక క్షత్రియుఁడు ధర్మనిరతుఁడై జనులను ధర్మము తప్పకుండ శాసింపవలయును. శాసనభయంబు లేకున్న జనులు స్వధర్మములను జెల్లింపఁజాలరు. శాసనమునకు విధేయులైనట్లు జనులు సదుపదేశములకు విధేయులు కారు. శాసించునృపా లురు పల్వురైనచో జనవితానమున నేకతాహ్రాస మొదవును. ధర్మవు కుంటుపడి యభ్యుదయ మతిదూరమగును. ప్రకృ తము మనయార్యజాతి నేఁటికి ట్లనేకత్వముతో నభ్యుదయము లేక హ్రాసమొందుచుండుట కాబహునాయకత్వమేగదా కార ణము! కావున నేతచ్ఛుభసమయమ్మున నస్మదేకతాభంజకంబైన వర్తమానబహునాయకత్వ ముజ్జగింప నేకనాయకత్వమున కియ్యకొని యిమ్మహాసభ యిప్పుడు వెలయురాజమండలినుండి దక్షుం డైనధరణీశముఖ్యు నొకనిఁ జక్రవర్తిగా నిర్ణయించి చరితార్థమ్మగుఁగాక" యని యిట్లుపపాదించి కూర్చుండెను.

అనంతర మధ్యక్షుననుమతితో మఱికొందఱు ప్రముఖు లుత్థితులై బహునాయకత్వమునఁ గల్గినకష్టపరంపరలు వెలువ రించుచుఁ బైనుపపాదనను బలపఱుప, నమ్మహాసభ యం దుల కంగీకరించి చక్రవర్తినిర్ణయ మగ్రిమమహాసభ యొన రించునటులఁ దీర్మానించెను. కార్యక్రమంబు కడముట్టిన పిదప నప్పటికి నిలిపివేయఁబడు నమ్మహాసభ మాంధాతృనాధి పత్యముతో ముందటివత్సరంబునఁ బ్రతిష్ఠానపురంబున జరు గునటుల నిశ్చయింపఁబడెను.

ఆభంగి నాసభారంగమున ముక్తకంఠముగ "బహు నాయకత్వము పనికిరాద"ని యెక్కుమొగిని వెలువడిన యుపన్యాసముల కోలాహలము "ఇప్పటిమహీశమండలమున మాంధాతృమహావరుండ మాననీయుండ"ను తత్సభ్యప్రముఖుల సల్లాపసంచలనంబును, "చక్రవర్తిపదంబునకు సర్వశక్తుండైనమాంధాత్రుండ యర్హతముండ"ను స్థానిక ధర్మసభల చాటింపును హెచ్చరికఁ గొలుప సింహాసనస్థులై కూర్చుండెందురాజన్యులు మేల్కని కొందఱు రోషకషాయితములైన చూపులఁ దమతమప్రజలపైఁ బఱపి "పేదవారికోపంబు పెదవులకుఁ జే"టనునట్లు దానఁ దమకన్నులక తాపంబుగలుగఁ దలలు వాంచి తమపదములు పదిలంబుగఁ బెట్టుకొన ధర్మసభ్యులకుఁ దాళమువైచుచు వెనుకనుండి హంగుచేయ నారంభించిరి పలుకుబడిగలదని గర్వించుమఱికొందఱు భూపతులు నిజరాష్ట్రంబులోని ధర్మసభలను దప్పింపనపూని వానఁ బాల్గొనినమానవుల నెల్లఁ గఠినంబుగ దండింపదొరకొనిరి. దాన నుదాసీనులై యుండువారలుకూడ సభలయందుఁ జేరుటయ గాక సైనికవర్గమునందుఁ దిరుగుబాటును దటస్థించెను. ఇంకఁ గొందఱు తమకేమియుఁ దెలియనటుల మేకపోతుగాంభీర్యముతో నూరకయుండిరి గాంధారేశుం డైనయంగారుండును, మరున్నగర (మీరట్) ప్రభుం డగుమరుత్తభూపతియు, సింధుపతి బృహద్రథుండును, ఆంధ్రక్షితీశుం డగు వసితుండును, గయానగరాధిపతి గయుండు నీసహార్యువరు మాంధాతృనిమాట చెవులఁబడినంతన తోఁకఁద్రొక్కినఁ ద్రాఁచుల ట్లెగిరిపడుచు నోటనుండి కత్తిఁబెఱుకుచుండిరి. కాని- ఆసంవత్సరమున

నాసభతీర్మానముతో నేకొందఱకోగాక తక్కినవారల కంద ఱకు నేమియుఁ దోఁపక యావ త్రాగినట్లయినది. ప్రజలకుఁ బాలుద్రాపిన ట్లయినది.

ఇట్లుండునంతలో మరల మహాసభ జరుగుసమయ మాసన్నంబుకాఁగ నటఁ బ్రతిష్ఠానపురంబుచెంత గంగాయము నాతరంగిణుల నానుకొని వానిమధ్యప్రదేశమ్మంతయు నభి నవనివేశములతోడను సువిశాలమహాసభాభవనమ్ముతోడను నెంతయు నభిరామంబుగాఁ గన్పట్టుచుండెను. అమ్మహాసభాప్రా రంభవాసరమున కటఁ గల్పితనికాయమ్ము లెల్ల నానా వేషభాషా వర్ణాకృతుల వెలయుజనాళితో నిండిపోయెను. తత్పరిసరరిక్త ప్రదేశము లన్నియు, దుప్పులు, జింకలు, తగరులు, వారు వములు వహింపఁదగినయరదంబులతోడను, చిత్రాసనపరిష్కృ తము లైనకుంజరఘటలతోడను గలకలలాడుచుండెను. గంగా యమునాస్రవంతికలయుభయభాగంబులును, హంసాకృతిమనో హరములు మయూరరూపరమణీయంబులు శుకముఖశోభితం బులు మీనమకరతిమింగిలాకృతివిలసితంబులు నగునౌకలతో నిబిడంబులై విరాజిల్లుచుండెను.

నాఁడు కరకరమని సూర్యుఁ డుదయించువేళకు సభాం గణమునందు మంగళతూర్యరవంబులు సెలంగుచుండ సభ్యులు పెందలకడ లేచి కాల్యకర్తవ్యంబులు ముగించుకొని మార్గమ్మ నం దెడనెడ నమర్పఁబడినతోరణపట్టంబుల వెలయు "ఉద్ధరే దాత్మ నాత్మానం" "ధర్మం చర," "ధర్మో రక్షతి రక్షితః" "ధర్మేణ లోకాన్ జయతి" యను సువర్ణరసరంజితాక్షరము

లై నవచనంబులఁ జనువుగొనుచుఁ గౌతుకోదంచితాత్ములయి యునుదెంచి తద్భవనంబు నిరవకాశంబు గావించిరి. ఆతరుణంబున నాకుంచితకరపాదంబు నాలక్ష్యమాణశిరస్కంబును నగుతత్ప్రభాభవనం బాసన్నప్రసవ యైనభూపురంధ్రిగర్భంబునఁ బొడగట్టుచుండెను. ప్రజాభ్యుదయకారణం బైనతాదృశపరిషచ్ఛరణాభ్యంతరంబు మహర్షిజన పఠ్యమాణస్వస్తివాచనఘోషంబులు మంగళవాద్యనిస్వనంబులు, జయజయధ్వానంబులును మిన్నుముట్టుచుండ మహారాజపరివృతుండై మహేంద్రవైభవముతోఁ బ్రవేశించునధ్యక్షుని,

సీ. "తలిరుఁ బ్రాయమువాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడుసోయగము వానిఁ
బసిఁడిచాయలవానిఁ బగడంబుజగడంబు
జగడంబు గలమోవిసొగసు వానిఁ
దళుకుఁజెక్కులవానిఁ దులకింపుపలుకెంపు
పలుకెంపు లొలయు నవ్వొలుకువానిఁ
జికిలిచూపులవాని సిరిమించుదొరయించు
దొరయించుకాంచనాంబరమువాని

గీ. నొఱపుఁగలవాని మకుటకేయూరహార
కటకకుండలచాకచక్యములవాని
నమ్మహీజానిఁ గని లేచి యమితవినయ
సంభ్రమము దోఁప నిలిచి" రాసమితిజనులు.

అంత గోపురమునకు శిఖరమెత్తిన ట్లాక్షితిపాలోత్తముం డధ్యక్షపీఠంబు నలంకరించి యందఱు నాసీనులై మహా

భాగ్యంబు లభించినట్లు పరమానంద మొందుచుండ మెల్లఁగ లేచి కర్తవ్యమున కుపక్రమించి ప్రథమమున శ్రావ్యముగ వైదికమంత్రములతో దైవప్రార్థనము సలిపినపిమ్మట స్వాగతోపన్యాసముకాఁగ ధర్మసమితులసంగ్రహచరిత్రమును, ఆయవ్యయపట్టికయును సభ్యులకు నందఁజేసి దేశకాలపరిస్థితులఁ బేర్కొనుచు మొదటినుండి నేఁటివఱకు మాయీయుద్యమమునకుఁ బ్రజలేగాక ప్రజానాయకులు సైతము తోడగుచువచ్చిరి. అది యెంతయు శుభసూచకము. కాని మరుత్తమహీశాది వృద్ధు లీయుదనున మాయందేగాక మనధర్మసమితులయందును బద్ధద్వేషు లయి యుండు టెంతయు సంతాపకరము. ఎవ్వేని మాయకృత్యంబుల తదీయద్వేషంబునకు మూలంబు కానోపు. (కాదుకాదు. అసూయయే మూలము.-అనిసభలో) ఇయ్యెడ కరుదెంచియైన వానిని వెలువరించిన సవరించుకొని కృతజ్ఞుఁడ నగుచుంటి. వార కారు మత్రైసఁగానిం డాయ కార్యంబులఁ దెల్పిన దిద్దుకొనువాఁడ (సిగ్గు సిగ్గు. అనిసభలో) ఎవనివీఁపు వానికిఁ గానరాదుగదా! (అర్ధక్షణమూరకుండి) కానిండు చూచుకొందము, ఇఁకముం దుపన్యాసకులు తమ కృతిఁదీర్చుకొందురుగాక, యనిమితముగ వచించి కూర్చుండెను.

పరిపాటితోఁ బరమర్షులు, పార్థివోత్తములు, ప్రతినిధులు పలువురు నానాధర్మములను జర్చించుచు సర్వజనీనములైనమహోపన్యాసము లొసంగిరి. అప్పటికిఁ గాలాతీతంబగుడు నాఁటికాసభ విరమింపఁబడి మఱునాఁడు సకాలంబునకు మరలఁ బ్రారంభింపఁబడెను. అందు సభ్యు లుత్కంఠతో

నెదురుసూచుచుండఁ దుదకు గతవర్షీయమహాసభచే నామో దింపఁబడిన చక్రవర్తినిర్ణయము నిర్వర్తనీయమై ముందుకు వచ్చిన దాని సభ్యుండు వారివశ మొనర్చెను.

అంత మహర్షిగణమునం దొకవృద్ధుండు లేచి మైమఱపున మరుత్తభూపతిపే రెత్తి యందుకు సభ్యుండు మాకు సమ్మతమనుచుండఁ దోడివారు నడివెట్టుచుండఁ బొరపాట నుచు విన్నవోయి చతికిలఁబడుడు మఱియొక మహర్షిము ఖ్యుఁడు లేచి దిటముగ మాంధాతృమహీపాలుండు మాకుఁ సమ్మతుండనియె. అక్షణము తత్పార్శ్వవర్తులు పరమసంతోష మనిరి. అట్లనుచుండఁగనే మహారాజవర్గమునం దొక్కమహీ పతి యత్థితుండై శశిబిందునృపాలుఁ డుచితుండనుడు నిరువురు మూగురు మా కామోదమనఁగ మాహిష్మతీశుండు మాం ధాతృమహాశయుల మా శిష్యులనుటయుఁ దక్కిననృపాలు రేక ముగ మా కంగీకారమనిరి. వా రట్లనుటయే తడవుగఁ బ్రతి నిధిబృందమున ముఖ్యుఁ డొకండు లేచి మాంధాతృమహారా జులే మాకు సమ్మతులని యొత్తిపల్క నాసమాజమువా రందఱు "అవు నవు"నని యేకగ్రీవముగ వక్కాణించిరి. తదు పరి నాయభిధానత్రియంబు తక్కినజనసముదయంబుసమ్మతి కనుప మాంధాతృనిఁదక్కఁదక్కినవారిరువురఁ నం దొక్కఁడైనఁ దలంచువాఁడు లేకుండెను. "మాంధాత"యను నా పవిత్రసం కేత మచటికంబములకు నావరణపటావళికిని బట్టినట్లు యా మూర్ధమువఱకుఁ దదంతరాళమున ఘంటారవంబుకరణి మా ర్మ్రోయుచునే యుండెను. నమ్ముఁడు నమ్మకపొండు.

తదనంతరము మహర్షికులపతి యైనభృగుమహర్షి యౌచిత్య మాలోచించి లేచి యుపన్యాసవేదికపై నిలిచి- “ధర్మనిరతులారా ! ! నేఁడియ్యెడ మనయందఱచేతను నాయుష్మంతుం డైన యిమ్మాంధాతృనృపాలుండు విశ్వమానవకళ్యాణకాంక్షతో భూతలమున కేకనాయకుండుగా నెన్నుకొనఁబడెను. కనుక నతం డిప్పుడు మన కాత్మతుల్యుఁడు. అతనికి మనము శరీరసమానులము. శరీర మాత్మకు విధేయమగుట సహజధర్మము. ఈక్షణమాదిగ సవంచనత నాతనికి విధేయులమగుట మనకు సహజము. అట్లువిధేయతాశాలులమైనమనకుఁ దగినతుష్టిపుష్టులఁ గూర్చు టాధర్మమూర్తి కుచితంబు. ఇంతకుము న్నీరీతి దక్షుఁడులేక పెద్దదిక్కు లేనిపిన్నలట్లు తల కొకచందమై యెంతయు నిడుమలఁబడుచుంటిమి. నేఁటికాయిడుమలు తుదముట్ట నేతాదృశనాయకలాభమ్ము సమకూర్చినజగన్నాయకునకు వందనశతంబు లర్పించుచు నీచక్రవర్తికి సముచితసన్మానంబు జరుపుట మన కగ్రిమవిధి. అది నిర్వర్తితంబగుడుఁ దదనంతరకృత్యం బతండ తీర్చుఁగాక ” యనిపలికి యందుకు సభ్యులు కరతాళంబులతో సమ్మోదంబు తెలుపుచుండ నటనుండి కదలి పార్శ్వపీఠంబున సమర్పియున్న సువర్ణకలశంబు గైకొని దగ్గఱ కరిగి లేచినిలిచియున్న మాంధాతృనిశిరమ్మునఁ దత్కలశాంతర్గతసురభిళజలంబు నాభిషేచనకమంత్రమ్ములు పఠించుచుఁ బ్రోక్షించి, యంత సన్మానసంఘాధ్యక్షుండు సంతసమ్మునఁ జనుదెంచి ఫాలంబునఁ దిలకంబును, గళంబున “ జయ మాంధాతృసార్వభౌమా ! జయ ” యను

వత్సరరూపమ్మున నిర్మితంబైనమంజులకుసుమహారంబును, వ్రేలను జక్రవర్తి పదచిహ్నితమైనయంగుళీయకమును నలంకరించి శ్వేతచ్ఛత్రచామరయుగళంబుల ఘటించి సన్మానింపఁ గరముల మహర్షిజనులు వేదోక్తముగ నాశీర్వదించి మంత్రిత లొసంగి సత్కరింపఁ గేల్దమల్చి సన్మానసంఘునాయకుని, గేల్మోడ్చి మహర్షిగణమును గారవించి గురుత్వగౌరవముతోఁ దనపాదగ్రహణముచేయ వ్రాలువానిని 'జాలు, సంతసమయ్యె, స్థిరో భవ' యనుచు సింహాసనమ్మునఁ గూర్చుండఁబెట్టి యభినందించెను. ఆసమయంబున సభ్యు లందఱు నానందాతిరేకమ్మున నొక్కసారి 'జయ మాంధాతృసార్వభౌమా! జయ' యనుచుఁ గీర్తించుచుఁ గరతాళధ్వనులఁ గావించిరి. నానావిధమంగళతూర్యములు చెలంగెను. గంధర్వస్త్రీమలు కుసుమవృష్టిఁ గురిసె. చల్లని సురభిళవాయువులు మెల్లఁగవీచినవి ఏతన్మహోత్సవంబుతో నీరీతి నానభాభవనమ్మానందభవనమయ్యె.

అనంతర మా సార్వభౌమునకుఁ బ్రతిష్ఠానపురీశుండు మహాభౌముండు మేనమామ యగుటచేతన, శశిబిందుఁడు శ్వశురుం డగుకారణమునను వెలలేనియుడుగరలు చదివించి కౌఁగిలింపులతోఁ గారవము చూపి కృతకృత్యులైరి. మఱియుఁ దక్షిణధరణీశమండలి తగువిధంబునఁ గానుకలు చెల్లించి తచ్చరణనఖదీపులు నిజకిరీటమణిదీప్తులతోఁ జెలిమిసేయ సాష్టాంగ మెఱఁగి చరితార్థులైరి.

ఈరీతి నాచారంబుతో మున్ను వాచనికంబై యపూర్ణావయవం బగుచక్రవర్తిత్వము, సంపూర్ణావయవంబై

చెలంగ సరత్నాకరపట్టణ మగుపృథివీతలమెల్ల స్వాధీనంబు గాఁగ నొక్కనాఁటితో నుత్తరధ్రువంబు మొదలుగ దక్షిణ ధ్రువంబువఱకుఁ గలనరపాలుర నెల్లరను నాశీలవంతుండు శాసింపఁగల్గెను.

తత్రత్యధరణీశబృందము సద్విధంబున నుపాయనంబులు వెట్టి వశంవదత్వమును బ్రదర్శింప నిజాసనోపవిష్టుండు కాఁగ నాసార్వభౌముండు, అల్లుండని శశిబింబుండును, మేనల్లుండని మహాభౌముఁడును, మరియుచుండ, ధరాధిపులు కొందఱు జ్ఞాతియనియుఁ, మఱికొందఱు బంధువనియు, నింకఁగొందఱు సహచరుండనియు, వేఱొకకొందఱు సహపాఠియనియుఁ జెప్పుకొని సంతసిల్లుచుండ సభ్యులు మాసభాధ్యక్షుండు సార్వభౌముండని యుప్పొంగుచుండ, మెల్లగ సింహాసనంబు డిగి సర్వులకు సమ్మోదకరంబుగ నిట్లు పలుకఁదొడఁగెను.

"అస్మత్ప్రాణభూతులారా! అస్మజ్జీవితకాలంబులో నీయది చిరస్మరణీయ మైనయత్యుత్తమవాసరంబు. ఇమ్మహీతలంబున మాననీయు లగువృద్ధమహీపాలు రెందఱో యుండ మ మ్మింతయుచ్చపదంబునఁ జేర్చి నిరతిశయసమ్మానంబు గావించినమీయపారప్రేమ కేము బహుకాలము విధేయుల మై యుండవలసియున్నది. ఈయుల్లమానవాధిష్ఠిత మైనయేతన్మహత్త్వంబు భవదారోపితంబగుట దానికిఁ దగునాధారపుష్టిఁ గల్గించుటయు భవద్భరంబు. కాన సార్వభౌమసంకేతితుండ నైన యీయనుజన్మునను సముచితోపదేశంబులు సలుపుచు వలయు పనులు గొనుచుండిన నెంతయు శుభావహంబగు. అగ్రజన్ముల

యుక్తదేశపాత్రకాలస్థితులకు ననుసరించి యనుజన్మలయనుష్ఠానంబులు శుభావహమ్ములగుటకు మూలము. ఇది యెల్ల రెఱింగినదే. అనుభవరసికు లగుమీకు విశేషించి వచింపఁబనిలేదు. మున్ను భృగుమునీంద్రు లానతిచ్చినట్లు మతాచారప్రవృత్తులం దేకత్వము లేక యేకజాతీయులమయ్యు భిన్నజాతీయులట్లు నానాత్వముతో నుండుమన మీతరుణంబున నేకాయనచరులగుట జగన్మంగళము. ఈదృశకల్యాణంబు ఘటించినవిశ్వంభరునకుఁ గృతజ్ఞతాసూచకంబుగ వందనశతంబు లర్పించుచు నిమ్మహాసభ ముందు కర్యోధ్యానగరంబున జరుగఁదలఁచి యిప్పటికి ముగించుచున్నవాఁడను. ఇట్లని మహర్షివరులశాంతిమంత్రములు, కుశీలవుల మంగళగీతములును బొరలుచుండ నట నుండి కదలి, కట్టాయితంబైనమహాగజంబు నధిరోహించి నిజవాహనారూఢులై మహారాజమండలి తోడరా విడిదల కరిగెను.

మఱునాఁడు తత్పురాధీశుండు మహీశులతో మాంధాతృనకు మహావైభవంబడర విందుజరిపెను. ఆతరుణంబునఁ గూడినరాజలోక మంగారుని యాగడంబును, మరుత్తరాజన్యుని విరూపతను, అసితగయాంగబృహద్రథభూపతుల యహంకారము నడంప నిప్పుడ తలకొనుట యుచితంబని ప్రసంగింప నీమతిమంతుం డావల్కులకు హర్షముచూపుచుఁ దొందరపాటు దేనికిని దగదు. నిదానంబున నన్నియు సులభంబు లగును. కాలక్రమంబులతో వారిమనంబులును మార్పు చెందవచ్చుఁ గావున నింకఁ గొన్నిదినంబులు చూచి యావలస్థితిగతు లారసి

పర్యంతము. ఇప్పుడ తలకొనిన నవశ్యము జననాశము సంభవించునని వారికి శాంతముగ సమాధానంబు పల్కెను. అంతనందఱు సరసాలాపంబులతో నాపొద్దు పుచ్చి మహాభాగ్యమని తుదిమన్ననలతో నిజనివాసంబుల కరిగిరి.

---

# పంద్రెండవ ప్రకరణము.

—:0:—

అనంతర మాయువనాశ్వనందనుండు మంత్రిసామంతదండనాయకపౌరప్రముఖులు మహానందంబుతో నెదురు రా నిజకటకంబు చేరి కర్తవ్యప్రణాళికావిచారముతోఁ గతిపయ వాసరంబులుగతింప జనులనానాదేశనడవడులు కృషివాణిజ్యాదిపరిస్థితులు తెలిసికొనుటకును, అందందుఁ గలగనులు, ఆకరములు, నదులు, జలపాతములు, తటాకములు, అరణ్యములు మున్నగు విశేషంబు లారయుటకును, ఏయేకృతుల కేయేస్థానంబు లుచితంబులగునో తెలియుటకును, అవిధేయులను విధేయులుగా నొనర్చుటకును, అజ్ఞానుల కనుకూలోపదేశంబులు సలిపి సుజ్ఞానంబు ఘటించుటకు ననుకూలం బగు ననుద్దేశముతో నొకదినంబున జనపదోపద్రవంబు గలుగకుండ మితపరివారముతో బయలుదేరి పూర్వదిశాభిముఖుండై గ్రామానుగ్రామంబుగఁ బయనంబొనర్చుచు నడుమనడుమ గౌరవించి కాన్కలొసంగవచ్చిన జనకూటంబులకు ధర్మంబులు శాసించుచుఁ

జేగినధనసంచయు మాయాస్థలీయధర్మసంస్థలకుఁ బ్రజాసహాకారంబు కావింప వశముచేయుచుఁ గాశీపురిఁ జేరి యాత్రేని మన్ననలం గొని ఫల్గునీతీరమం దున్న గయానగరంబు చేరు వకుఁ జనుటయు దాని కేలిక గయుం డనువాఁడు సార్వభౌమునిరాక విని సమయంబు చిక్కెనని సంతసిల్లి "కోసలేశా! అస్మద్దేశమ్మునఁ ద్వదీయధర్మశాసనమ్ములకు స్థలము దుర్లభంబు. తొలఁగి చనుము. శూరుఁడ వగుదేని సమరవిజయివై బిరుదు చెల్లించుకొనుము. రాజ్యము వీరభోజ్యము " ఇట్లని సందేశ మంపెను.

ఈమన్నీఁడు గయానగరంబు రాజధానిగాఁ బూర్వదిగ్భాగంబున గంగానదివఱకుఁ గలనేల నేలుచు యజ్ఞకరాయణుండై యగ్గివేలుపు ననుగ్రహంబుతో నపారధనద్రవ్యంబులు వడసి ప్రజలు పంటలులేక కూటిపేదలై చదువుసంధ్యలు దూరమై పశుప్రాయముగ వర్తించుచుండఁ దదభ్యుదయసాధనంబులు గమనింపనైనఁ జిత్తంబువెట్టక జన్నంబు లొనర్చి పేరుఁగన్న కర్మిష్ఠుఁడు. ఈయలంకర్మీణుఁడు మాంధాతృ నిజాశ్రితులనడుమ జన్నం బొక్కటియైనఁ జేయనేరనియసమర్థుఁడనియు దేశద్రోహియనియుఁ గపటవర్తనుఁడనియు శౌర్యహీనుఁడనియు దీనజనానుగృహీతసార్వభౌమబిరుదుండనియు నింక ననేకవిధంబుల నిచ్చవచ్చినట్లు దూషించుచు సమరపరాజితునిఁ జేయునిచ్ఛతో సన్నద్ధుఁడై సమయము వేచియుండెను. ఈతని యనుచితవర్తనమునకు మున్నె కటకటంపడువారాష్ట్రీయప్రజ లీసందేశమునకు మఱింతకటకటంపడిరి.

ఆధీరజనాగ్రణియు నాసందేశమ్ము విని, ఓహో శ్రుతి మించి రాగానఁ బడినది. ఇయ్యెడ శూరమాని యగునాతని కుపదేశమ్ములు శాంతిఁగొలుపఁజాలవని యెంచి "గయేశా! జగమున సూర్యకిరణములకైన లభింపనియిరవు లుండిన నుండ వచ్చు. మదీయధర్మశాసనములకు లభింపనియిరవు లుండఁ జాలవు. ఈసూర్యుండు భవాదృశమందదేహబృందముపొడ వడంచి నిర్నిరోధముగ నిజశాసనాంశువుల సర్వత్ర చొప్పించి సార్వభౌమపదంబు చెల్లించికొనును. రాజ్యంబు వీరభోజ్యంబ యగుఁగాక. సైన్యములను సమకూర్చుకొని సమరమునకు వచ్చుట శక్తిహీనత. శక్తుండ వగుదేని ధనుర్మాత్రసహాయుండ వగునాతో నట్టిఁడవై యొక్కరుండ వని కుఱికి పొడిచి గెలువుము. ఇరువురిమూలమున జనించుజనాత్యయంబున కేనోర్వ. ఇందు కశక్తుండవేని యొదిగియుండుము. ఈతీరునఁ బ్రతిసందేశ మంప నతం డద్దాని విని మండిపడి 'ఔర! పిట్టకొంచెమైనను గూఁత ఘనమైనదే! అగ్నిదేవుని మెప్పువడసిననాముందటనా వీని బెదరింపులు? నాపోటురుచి యెన్నఁ డెఱుఁగఁడు. ఒకసారి చవిచూపెద' నని పల్కుచు నట్లశానిమ్మసి మరలఁ జెప్పిపంపి యానాఁటికూరకుండి మఱునాఁ డూరివెలుపలఁ గదనరంగంబు చక్కచేయించి పురోహితామాత్యకళత్రపుత్రులు బవరము వలదని యెంతవేఁడినను మానక విల్లమ్ములు పూని యుద్ధమునకు సన్నద్ధుండై వెడలెను. తత్ప్రదేశంబునఁ బౌరప్రముఖులు రాజబంధువులు సేనాపతులు మంత్రులు ప్రేక్షకపదంబు నలంకరించియుండ నీవీరప్రతివీరులు రథస్థులై కలహం

బున కుపక్రమించి యాచారంబుచొప్పున గోత్రనామాంకితము లైననారాచముల వైచికొని శరలాఘవముఁ జూపుకొనుచు నొండొరులపైని బాణవర్షము కురియించిరి. గయుండు విడిచిన బాణంబు లన్నియు మాంధాతృనిమార్గణముల చేఁ దుత్రింపఁబడుచుండెను. ఇతండు విడిచిన యమ్ము లూరక పోక ప్రత్యర్థిమైమరువుఁ దూటి వెనుబడిపోవుచుండెను. ఇట్లు జరగఁ గొంతవడికి గయుం డలసిపోయెను. తనపైఁ దప్పివడిన బాణపాతములవలన విరోధిబలహీనుం డగుటఁ దెలిసి యతనిఁ గడతేర్పఁ గాంక్షింపక యెఱకలు నొంచి సంగరవిముఖుఁ జేయ సంకల్పించి శూరవిలాసంబుఁ జూపఁదొడఁగెను. అంత నతం డును మించినరోషముతోఁ బది పదునై దిరువది - ఈవరుస వాఁడితూఁపులు వైరివక్షంబు దూటఁ బఱపుచు నతనిరథరథ్య సారథికేతనమ్ములఁ దూలఁగొట్టుచు నెంతవడికి నెదిరి కందినజాడ పొడగానమి కచ్చెరువొందుచు నాతనిప్రదర వేదనమున మిగుల నొచ్చియుఁ బల్లుబిగువున నిలిచి చాలసేపు సమరంబు సలిపి చివర, కంగసంధులనుండి యస్రంబు లురుల సత్వహీనుండై స్మృతిరహితుండై స్యందనమున వ్రాలెను. ఎన్నటికైన నహం కారము హానితేక మానదుసుఁడీ. సూతుం డరదంబు పజ్జకుఁ దప్పించి నిలుప మంత్రిమొదలగువారు పఱతెంచి శైత్యోప చారములు సలిపి యెంతతడవునకును హెచ్చరిక కలుగనందున నృపుని నగరునకుఁ గొనిపోయిరి. మాంధాతృండును క్షత్రి కర్మం బతిక్రూరంబని నొచ్చుకొనుచుఁ దనపటకుటీరమున కరుగఁ దక్కినవారు తమతమ యిరవుల కరిగిరి.

ఆనాఁటికయ్యంపుపాచితంబుతో దురభిమానపాపంబు దూరీకృతంబుగాఁగ నమ్మహీశుండు నాలవనాఁటికిఁ బ్రవిమలాత్ముఁడై యపారసువర్ణంబు లుపాయనంబుగఁ గొని మాంధాతృనికడ కరిగి వాని నర్చించి మాంధాతృసార్వభౌమా! మన్నింపుఁ డనుచుఁ బాదంబులఁ బడుచుండ నతం డాతనిన్సాదరముతో బాహుద్వయింబట్టి పార్శ్వపీఠంబునఁ గూర్చుండఁబనిచి తత్ప్రదేశ మపదక్షిణముగ నొనర్చి యిట్లనియె.

జనవరా! మాకన్నులయెదుటఁ బుట్టినమేము మీకుఁ దెల్పఁదగినవిషయము లుండవు. అయినను బ్రజావశంవదుల మగుటఁ దదీయక్షేమముకొఱకుఁ గొన్నివిషయంబులు మీస్మృతిపథంబునకుఁ దెచ్చువారము. తొల్లి పుడమిదొరలు పలువురు స్వకీయక్షేమలాభసంపాదనమాత్రమ్మునన సంతృప్తినొందుచుఁ గాలముగడపిరి. తత్పద్ధతియె తదర్వాచీనపార్థివులకుఁ బరిచితమైరాఁగ మీరును దానినె యనుసరించితిరి. ప్రజలను బాలింపఁ బాడమినమనకు స్వకీయశ్రేయస్సంపాదనముతోడఁ సమయము చెల్లించు టెంతయు ననుచితంబు. తొల్లింటిప్రజాసముదయంబు ప్రబోధము లేక మూఢప్రాయమైయుండ నెవ రెట్లువర్తించినను జెల్లినది. ఇక్కాలమున నట్లుగాక ప్రతిమనుజునకును, దా నెవ్వఁడు, తనకర్తవ్య మేది, తనకుఁ గూర్చువాఁ డెవండని యీరీతి విమర్శనదృష్టి యేర్పడినది. ఈతరుణమందుఁ గూడ ననర్థకమైన తొల్లింటిపుంతనే పోవుచుండుట మిగుల వెఱ్ఱితనము ఈదృశాస్మన్నాయ

కత్వమును జనవితతి యేలాభమును గోరి యనురాగిల్లును ? ప్రజానురాగంబులేని పార్థివునకు బలాయుర్దాయములు పూర్ణానుస్వారము లనుట మీ కెఱుంగనిది కాదు. తపోబలంబు కలిగినఁ బ్రజానురాగంబుతోఁ బనియేమి యనుట పరమైకాంతులకుఁ బాడి. ప్రజాసంబంధము కలమీకుఁ బాడి గాదు. కావున నిపుడు స్వధర్మనిరతులై ప్రజలను ధర్మపరులుగా శిక్షించుచు వారికి నభ్యుదయ మొదవించుకార్యములు గావింపఁ బూనవలయును. దానఁ బ్రజలకును బ్రపంచకమునకును మాకును బరమామోదంబు కలుగు. అదియే మీకుఁ బరమశ్రేయంబు. ఇప్పలుకు లాకర్ణించి నిద్రనుండి మేల్కాంచిన ట్లానృపాలుండు ముఖంబు నూత్నకాంతితో మెఱయ, “మహాత్మా! మాక్షేమంబుగోరి యింతవట్టు కర్తవ్యము తెల్పి యనుగ్రహించినందుల కెంతయుఁ గృతజ్ఞుండ. ఇంతకుమున్ను గతానుగతికత్వధూమంబు మా కన్నులఁ గప్పివైచి కర్తవ్యమార్గమును గాంచకుండఁ జేసినది. ఇప్పుడు భవత్ప్రబోధానిలమ్ముచేత నది దూరాపసారితము కాఁగఁ దన్మార్గంబు సుదూరము విశదముగఁ గన్పట్టుచున్నయది. అవశ్యము భవదుపదేశానుసారముగఁ బ్రవర్తించువాఁడ” నని వినయంబుతోఁ బల్కుటయు “మంచి” దని యతని సక్రమంబుగ వీడ్కొలిపెను. ఇట్లమ్మహానాయకుండీగయాఖ్యమహాగజంబు లోఁబఱుచుకొని మఱునాఁడు తత్పురంబున మహాసభఁ గావించి యందు సర్వజనులకు సంతోషకరమ్ముగఁ బ్రవృత్తిధర్మములనుగుఱించి మహోపన్యాస

మొసంగి యటనుండి కదలి మార్గమధ్యమున నదులఁజూచుచు నడవుల శోధించుచుఁ గొండల గుర్తించుచు నగరంబుల నిల్పుచు నందందు నూతనధర్మసమితుల నిల్పుచుఁ గ్రమముగ గంగానదీవంతి నుత్తరించి యవల కరుగుచుండ నచట సైన్యసమేతుండై యంగరాజు కయ్యంబుగోరి కాలుదువ్వుచుండెను. అంత నచట నిలిచి తత్సైన్యంబు తిలకించి, ఔర! ఈముష్కరుఁడు తనయసూయానలంబునకుఁ దన్నేగాక యితరుల నింధనంబులుగఁ జేయుచుండెఁగదా! పంచేంద్రియవిశిష్టులైన వీరందఱు నేనెట్లు బవరంబునకు బలియిచ్చువాఁడనని కొండొకవగచి కాని మిట్లు గావించెదనని నమ్మినబంటుల నలువుర రావించి తదీయసేనానులకు వ్యక్త్యనురోధముగ విత్తంబులు, క్షేత్రంబులు, ఉద్యోగంబులు కోరిన ట్లొసంగువాఁడనని చెప్పి పంపి చరితార్థుండయ్యె.

రెండవనాఁ డుదయంబున సంగరంబు సమారబ్ధమగుటయు సేనాపతులు సమయమునకు ముఖము తప్పింప మాంధాతృనియంపజల్లునకుఁ దత్సైన్యంబులు నిల్వలేక విఱిగిపోయెను. అంగునకు సహాయులై చనుదెంచిన రాజన్యు లొక్కుమ్మడి మీఁది కుఱుక వారి నందఱ నీయౌవనాశ్వుండు వాగ్బాణములతోడను వాఁడిములుకులతోడను వికలమనస్కులుగ వికలాంగులుగఁ జేసి చెదరఁగొట్టె యంత రోషకషాయితాత్ముఁడై యంగరాజు తనపై బాణపరంపరలు విగుడ్వ వానినెల్ల నడుమన ఖండించి యావిల్లుఁ దునిమి వేఱొండువిల్లుగొన దానిని ద్రుంచి విరథుఁజేసి గదాహస్తుఁడైనవానిఁ దానును

గదఁబూని యొక్క పెట్టునఁ దాఁకి యాగదను దుత్తునియలు గాఁ గొట్టి, యుగ్రుండై మల్లయుద్ధమునకుఁ గడఁగుఁ బూరుతునికరికరము బంధించి భుజాస్ఫాలనం బొనర్చి పెల్లునఁ దాఁకి యోధులు రిచ్చవడిచూచుచుండఁ బెద్దయుంబ్రొద్దు పెనఁగులాడి కొనకు రేకత్తినరోసంబుతో నువ్వెత్తుగ నెత్తి నేల వైవ నుంకించుచుండ వేగిరముగ సచివప్రేరణమునఁ జనుదెంచిన యతని సతీసుతులు "రక్షింపుఁడు రక్షింపుఁ" డనుచుఁ బాదములపైఁబడఁగ నాదయాళువు ప్రాణావశిష్టుఁడై చేష్టలు దక్కి యుండువానిని విడిచివైచెను.

అత్తఱి నలిపిననిమ్మకండువలె నంగరాజును, దించిన నిమ్మకండుపగిది మాంధాతృమహీపాలుండును నొప్పారుచుండిరి. అంగునిగదాప్రహారములకును బిడికిటిపోటులకు నన్యుండైన నీసఱకు యమపురియందుఁ బ్రాఁతకాఁపుగా నుండువాఁడు. మునివరులొసంగినవరప్రభావమో భృగుమౌని యనుగ్రహించినరసలేపంబుమహిమమో గాని యామల్లయుద్ధమున మాంధాతృశరీరము మృదితమైనకొలఁదియుఁ బుటపాకశోధితసువర్ణచ్ఛాయలం దెగడుచు మిసమిస మెఱయుచుండెను. అట్లుండ నచటివా రెల్లరు నివ్వెఱఁగు దోఁప విప్పాఁ గన్నులఁజూచుచు "ఇతం డేదేని కారణాంతరముచే భూతలమునఁ బొడమినదేవవరుండు కావలయు. కాకున్న నీపోడిమి యీశక్తి యీతేజము మానవమాత్రున కెట్లుగల్గు" నని వినుతించిరి.

విడిచిపెట్టిన రెండుగడియల కొకింత తేఱుకొని యంగరాజు విశ్రాంతిఁగొనునావీరవతంసుని డాసి సార్వభౌమా! క్షమియింపుఁడు. మానవుఁ డనుభవించిగాని విధేయుండు కాఁడనుట తమకుఁ దెలియనిది గా దనుచు నతనికి సాఁగిలఁబడి మ్రొక్కి యాక్షాత్రగుణభూషణుఁడు లేవనెత్తి గారవింపఁ బురంబునకు దయచేయుఁడని ప్రార్థించి, 'మంచిది ఱేపటికిఁ జూచుకొందము. నేఁటికి విశ్రాంతిఁగొనుఁ' డని వీడ్కొలుప సపరివారుండై స్వభవనంబునకుఁ జనియె. మాంధాతృండు స్వశిబిరమున కరిగెను.

ఇట్లమ్మానవనాయకుం డంగమహీనాయకు నాత్మాధీనుఁ జేసికొని తద్రాష్ట్రీయప్రజాసముదయంబు లొసంగు స్వాగతపత్రము లందుకొనుచుఁ దద్విషయం బతిక్రమించి దుర్గమశైలకాంతారములఁ గడచి భర్గదేశంబు సొచ్చి యచటి మన్నీల మన్ననలు గొని యందందుఁ జరించుచు నచటనఁ గల వింత లారసి యటనుండి పశ్చిమంబునకు మరలి నేఁటిబంగాళాఖాత మానాఁటికిఁ బెద్దభూభాగమైయుండ నయ్యెడఁ గల్గుజనపదంబులజనులకుఁ జక్షురానంద మొదవించుచుఁ గ్రమముగ నాంధ్రావనిం బ్రవేశించి తత్పరివృఢుం డసితప్రభుండు తన రాష్ట్రంబున నడుగుపెట్టక తొలఁగిపొమ్మన సామదానభేదంబులతో స్వాధీనుండుగాక యుండునతని దండోపాయంబుతోడన దరికి రప్పించికొని యరిగాపుగాఁ జేసికొని యవల దండకాటవిని దాఁటి చని యపరసముద్రతీరముఖ్యపట్టణముల విలోకించుచుఁ గుశస్థలీపురంబుఁ జేరి యట శ్వశురునింట దిన

త్రియంబు విశ్రాంతిగొని సింధుదేశంబునకుఁ జని తదధీశుండు బృహద్రథుండు సింధునదీతటంబున సైన్యసమేతుఁడై సమరంబునకు మోహరించియుండ నతనిస్వబలపరబలతారతమ్యంబు విచారింపనిమొఱకుఁదనంబునకు నగచి విధానం బన్యంబు లేమి ధనుర్ధరుండై సాంగ్రామికరథంబు నధిరోహించి సన్నాహంబుతో వెడలి ముందుఁ జేరియున్న బలంబు పురివిచ్చి పాఱ నిశిత శరపరంపరలఁ గ్రుచ్చుచుఁ దన్మధ్యంబుగ నరదంబు నతిజవంబుగఁ దోలించికొని పోయిపోయి యెదుట సంసిద్ధుఁడై యుండుశత్రువును మార్కొని శరలాఘవంబుఁ జూపుచు సారథిసహితంబుగ రథరథ్యకేతనంబులఁ గూల్చి విరథుఁ జేసి యతండు వేఱొకరథంబుతో నాయితంబై వచ్చునంతలోఁ గవియవచ్చిన దళవాయిగమి విఱిగి పాఱ నెనలేనికడిమిఁ జూపి తదీయాంగంబుల నొంచి మరల మహారోషభీషణుండై మార్కొనుబృహద్రథునితోఁ బోరు సాగించి వంగిన వంగుచు వ్రాలిన వ్రాలుచుఁ దొలఁగినఁ దొలఁగుచు నిలిచిన నిలుచుచు గ్రుక్కతిరుగకుండ వీరవిహారంబు సలుపుచుఁ దన యురవడికి నిలువలేక పాఱఁజూచునప్పగతుని బట్టి బంధించి శరణుచొచ్చినఁ గరుణించి విడిచిపుచ్చి నిజాగమనంబునకుఁ గాంక్షించుప్రజలను సంతోషపెట్టుచు నారాష్ట్రంబు మించి యుత్తరభూములకుఁ జనుచు మరున్నగరము (మీరట్) దరికరుగ మరుత్తభూపతి యిట్లుసందేశ మంపెను.

"మాంధాతృకుమారా! శైశవమాదిగ సంతోషకరంబైన త్వదీయచరితం బిప్పుడు వృద్ధుల మైనమావిషయంబునఁ

గూడ నిశ్చయముగ జరించునీ తెంపరితనముతో విచారకర మగుచున్నది. సాష్టాంగ ప్రణతులకడ సార్వభౌమపదంబు చెల్లించుకొనుట శ్రేయంబు. కావున సాహసింపక యాలోచించి ముందడుగు వెట్టుము. విశేషించి తెలుపఁ బని లేదు. వివేకవంతుల కించుక సూచించినఁ జాలు" ఇది విని యామ్రాణతిరస్కారమునకు మందహాసమొనర్చి మరల నిపుణంబుగ నిట్లు చెప్పెను.

"పితామహా! మీరు వృద్ధులు. తపస్సిద్ధులు. క్రతు ధర్మక్రియాబద్ధులు, అలంకర్మీణులు నగుట నెల్లరకు వందనీయులు. అయినను జనులు, తురీయావస్థకుఁజిక్కరని కాఁబోలు భవదీయశాసనంబుల సరకుసేయకున్నారు. అది మనకు సహింపరానిది. కనుక శాసనతిరస్కారముచేయు జనులను శాసనబద్ధులుగాఁ జేయుట యస్మత్సంకల్పము. మీకుఁ దద్భారంబు తగ్గింప నందుల కేము పూనితిమి. చిన్నలు సకల కార్యములు సర్దుకొనుచుండఁ బెద్దలకుఁ బరమామోదమకదా! సాయంసమయమున నాదిత్యుండు నిజమయూఖముల ననలున కధీనమొనర్చిన ట్లిప్పట్టున భవదీయశాసనసామర్థ్యంబు నస్మదధీనమొనర్చి సుఖులగుఁడు. దాన నెల్లరకు శ్రేయంబగు. ఇచ్చకొలఁది వెచ్చించుకొన నీశ్వరుం డనుగ్రహించినయష్టాంగదం బక్షయమై వెలయుచుండ మనుమలు చూడకున్న మీ కేకొదువయుఁ గల్గఁబోదు. మీరు మేము నెల్లరము సాష్టాంగ ప్రణతులమై సార్వభౌమత్వ మాసర్వేశ్వరునకే చెల్లింతము. అది మనకు వలదు. ఈయదనున వృద్ధదశాసులభ మైనరోసం

బు మీకు విశేషక్లేశావహంబు కాకుండుఁగాక" యని చెప్పి పంప నాక్షితీశుండు దానిని విని పరిహసించినట్లు భావించి విజితపురందరుల మైనమ మ్మాయర్భకుండా పరిహసించునది ! మేము వృద్ధులమఁట- తాను యువకుఁడఁట- చూచెద వాని యౌవనకటుత్వము ! అనుచు మీసల మెలివైచుచుఁ "గాని మ్ము, సమరరంగమున జనుల శాసింపఁగలనీసామర్థ్యమొకింత మొదటఁ బరికింపవలయు. సన్నద్ధుండవగు" మని మరల వార్త నంపుటయు నది విని మాంధాతృండు "ఓహో ! పరిపక్వ భావోద్రేకంబు గాఁబోలు నిది" యని కన్నులింతలుగాఁ గను బొమలు పైకెత్తి తల వంకించుచు "సరి. ఈపరీక్షాసంపర్కము మనయురుపురకే పట్టియుండవలయు. మీరు పరీక్షకులు. మేము పరీక్ష్యులము. ఇంతియ. అయితము కండు." అని వెండియు వార్త నంపెను.

ఆవార్త విని సతీసుతసామంతమంత్రు లెంత చెప్పినను వినక మఱునాఁ డుదయంబున సమరంబునకుఁ జని పోరుచు మధ్యాహ్నము కాకముంద మందవేగుండై యంతకంత కగ్గలం బైనయమర్షవశంబున మోపెట్టినబాణాసనంబు మిక్కుటముగఁ దివియుడుఁ జతేల్మని గొనయంబు తెగఁ బెట్టుతప్పి వింటికొప్పు ఫెళ్లునఁ బెడతలకుఁ దాఁక దానివిసరుతోఁ దేరునుండి దిగు వకుఁబడి మూర్ఛిల్లెను. తోడనే తత్ప్రతివీరుం డతిరయంబున నట వ్రాలి తచ్ఛిరంబు నిజోరుతలంబున నునిచి శిశిరోపచారం బులు గావింపఁ గొంతతడవునకుఁ గన్నులు తెఱచి చూచి సుగుణభూషణా ! వర్ధిల్లుము. మతిలేనిముదుకని మనుపకు.

జీర్ణవసనముల్లు జాఱవిడువు మనుచుఁ దత్కరతలంబు లెవ నద్దుకొని, ఆహా! ఎంతశీతలములో యనుచు మరలఁ గన్నులు మూసికొనిన నతని నంగరక్షకులు ప్రాసాదంబునకుఁ గొంపోయిరి

మఱునాఁడవనాఁ డారాజవృద్ధుఁడు మాంధాతృనృపాలు నధిక వైభవముతోఁ గొలువుకూటమునకుఁ దోడ్కొనివచ్చి సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి కనకాభిషేకంబుఁ జేసి యమూల్యాంబరాభరణంబు లర్పించి సార్వభౌమపదాంకిత మైనరత్నహారంబు గొని రాజరత్నమా! ఉత్తమరీతి నుత్తీర్ణుఁడవైతివిదే సార్వభౌమపట్టంబు గొనుమని మృదువుగ నవ్వుచు నాతని కంఠసీమ నలంకరించి కరచాలనంబు గావించి చెంతనున్న కొమరుని సాష్టాంగ మెఱఁగుమనియె. అతండట్లుచేయ నాసార్వభౌముం డాతని నెత్తి గాగవించి తానును మరుత్తరాజన్యు పాదధూళిం గైకొని యతం డర్పించిన సువర్ణరాశి సర్వశిల్పకళాశాల నెలకొల్పఁ దద్రాష్ట్రీయధర్మప్రచారసమితి కర్పించెను.

ఆ రెండవరోజునఁ గాశ్మీరఖండంబు చూచుతలఁపుతోఁ దత్పురి విడిచి వెడలుచుండ మార్గమధ్యమున నమ్మహీతలాధ్యక్షునకు రావణుం డెదురు వచ్చి "నరేంద్రా! ఏను దశకంఠుండ సంగరకాంక్షతోఁ జనుదెంచినాఁడ. బెదరక మార్కొనుము, భీతుఁడవైనఁ దొలంగు"మనియె. అనవుడు నతండు కనుబొమలు ముడివడఁ గన్నుల నిప్పు లొలుకఁ జగచురఁ జూచుచుఁ 'పౌలస్త్యా! నాతోడనా రణమొనర్పవచ్చితివి? మం

చిది. కదలక నిల్వు' మనుచు నారిమ్రోయించి పిడుగులవో
నినాగసమ్ములు వానియురమ్మున గాటముగ నాటనేసెను.
ఆయుధములకా యీచిన్నలని గేలిసేయుచు దశగ్రీవుం
డాతనిపై శరవృష్టి గురిపింప నాభూపతి వానిం ద్రుంచివైచి
యొక్కుమ్మడి మట్టడింపవచ్చినతదీయమంత్రులను బ్రహ్మాస్త్రా
దుల నైదు, పది, పదునైదు ప్రదరమ్ముల నొప్పించి తఱిమి
వైచుచుండ మహోగ్రుఁడై మార్కొనవచ్చినమాయావిని
ముద్గర మెత్తివేయుఁడు వాఁడు సొమ్మసిల్లిపడి లేచి తేరు
విఱుగఁగొట్టి గుఱ్ఱంబులఁగూల్చి సారథి నొప్పింప ధరణీశుఁడు
వేఱొకరథంబు నెక్కి వచ్చి వానిపై శక్తి వైచె. ఇవ్విధంబున
నాయిరువురు పెద్దప్రొద్దు ఘోరంబుగఁ బోరుచుఁ దుదకు
మానవనాథుండు బ్రహ్మాస్త్రమును దానవనాథుండు పాశు
పతాస్త్రమ్మును వేసిరి. ఆరెండు నంతరిక్షమ్మునఁ బోరుచు లోకు
లకుఁ జీకాకుగలిగింప నపుడు పులస్త్యబ్రహ్మ విచ్చేసి వారిరు
వురకు నడుమ నిల్చి 'ఏల యీయుద్ధము? దీన లోకంబులు
భీతిలుచున్నవి. మీరిరువురును జిరంజీవులు. ఒక్కండును
దీసిపోవఁడు. మీమీయస్త్రంబు లుపసంహరించి లోకులకుఁ
గల్గినసాధ్వసము శాంతింపఁజేయుఁడీ' యని యుభయులకు
సఖ్యంబుగూర్చి వారు నిజాస్త్రము లుపసంహరించి యథేచ్ఛగ
వెడలుచుండఁ దాను నటనుండి వెడలిపోయెను.

అనంతర మాజననాథాగ్రణి నిజసంకల్పానుసార
ముగఁ గాశ్మీరభూముల కరిగి ప్రకృతివిలాసముల నవలోకించి
యానందించుచు నచటిప్రజాదరముఁ బడసి తద్విషయాధీశుచే

నర్చితుండై యవలఁ బాశ్చాత్యవర్షదర్శనలాలసత నటనుండి కదలి గాంధారమునఁ గాలిడెను. అక్కాలంబున యయాతితనయులు 'ద్రుహ్యు' 'అను' రాజన్యులసంతానము పశ్చిమోత్తరవర్షభూముల నేలుచుండిరి. అందు ననువుసంతతివారు మ్లేచ్ఛవిషయాధీశులు. అశ్వారోహణకుశలురు. ద్రుహ్యపత్యము వా రుత్తరవిషయాధీశులు. నిష్క్రియులు. మాంధాతృఁడు గాంధారమున కరుగునప్పటికి ద్రుహ్యునిపౌత్రుండంగారుం డనువాఁ డాదేశము నేలుచుండెను. దస్యుసముదయము వీనికి దాస్యముచేయుచుండెను. వీఁడొకగిరిమూషికము. ఆకొండలనడుమనుండి యప్పుడప్పుడు బలఁగముతో బయలుదేరి దేశములను దోఁచుచుండును. సాధుహింస వీనికి వీనిబలఁగమునకు విలాసము. హిమాలయముచెంత నున్న బాపనపల్లెలో మన కథానాయకునిచేఁ బొల్లుపడిన దస్యునికర మీతాత్వాష్ట్రునికిందిదే. అదిమొదలు మాంధాతృనిపేరెత్తినఁ గనలుచుండును. ఈనృపాలుఁడు పరిపాలనమునకు వచ్చినపిదప నీదుష్టుఁడు కోసలదేశమును గొల్లగొట్ట ననేక పర్యాయములు బలఁగములను బంపియుండెను. అవి యటకేగి పలుసార్లు భంగపడి చావుతప్పి కన్నులొట్టపోయి తుద కా ధరణీశునకు వశులై తొంటివృత్తి వీడి సద్వృత్తి కల్గి తద్విషయమున స్థిరనివాస మేర్పఱచుకొని సుఖముగ నున్నవి. అటు పిమ్మట నాహతకుఁడు కోసలదేశముపాసన విడిచి మఱికొన్ని గుంపుల నితరదేశములకుఁ బంపుచు వచ్చెను. వానకాలమున నల్లచీమలబారుల ట్లొక్కుమ్మడి పరుసలుకట్టి వెలువడి యీ

తెరువాటుకాండ్రు జనపదంబులపైఁబడి దోఁచి చిటుకున మాయ మగుచుండిరి. ఈవసుమతీనాథుండు దేశపర్యటన మారంభించినదిమొదలు భీతితో నీమూఁకలు ముందువెన్కకుఁ బాఱుచుఁ గొన్నియెడల నతనిబారిఁబడి భంగమొందుచు విసిగి కడకుఁ దమదొరతోఁగూడి యోచించి యాతని మట్టుపెట్టఁ దలపెట్టిరి.

ఆలోచించిన తెఱంగున నితం డచటి కరుదెంచునప్పటి కాదస్యునిచయంబు మిడుతలదండుమాడ్కి ముట్టడించి యాతని సైనికులు కసిమసంగి భారద్వాజశకుంతములకరణిఁ గత్తిముక్కులఁ బొడిచిపొడిచి గతాసులఁజేయుచుండ నిల్వఁజాలక పలాయనమంత్రంబు పఠించెను. ఇప్పగిది నాపలుగాకిమూఁకలు పెక్కుసార్లు పెక్కుతావులఁ దలఁపడి పాఱుచుండ నప్పార్థివేంద్రుఁడు వేఱొకకడకుఁబోవ మాని మొదట వానినెల్లఁ బట్టి పాలార్పక సాధువృత్తికిఁ దేవలయునని పూని గాటంపుఁబట్టుదలతో నాగట్టులనడుమన నివాసమేర్పఱచుకొని కష్టములు పాటింపక సైన్యసమేతుఁడై వసించుచుఁ డొంకిపట్టు లారసి పట్టి యాకొండమ్రుచ్చుగమి నొక్కొక్కటిగ వశమొనర్చుకొనుచు వచ్చెను. ఇట్లు పదునాల్గుమాసంబులు గతించునప్పటికి కాఁగుంపులెల్ల నతనిచెప్పుచేఁతలకు లోనయ్యెను. అంత గాంధారపతి తనగుట్టు రట్టుగాఁగఁ బట్టరానిరోసంబుతో బయల మెఱసి బవరమ్మునకు రమ్మని మనయువనాశ్వతనయు భుజము లప్పళించుచు నాహ్వానించెను. అప్పుడా వీరాగ్రణి, యిందఱ నెందుకుఁ గొఱగానిపసులుగా నొనర్చిన యిప్పాపాత్ముని బరి

మార్చినను బాణంబురా దనుపెనురోసంబుతో వెడలి నిశిత శరనికరంబుల వానిం గప్పివైచెను. అత్తఱి నచటిజనులు మాంధాతృవిము క్తమార్గణములకు బ్రహ్మాండకర్పరమున్నైనను భేదిల్లునని భీతిల్లిరి. ఆదెబ్బల కోర్చినవానిదేహ మయోమ యంబో పాషాణమయంబో యగునని భావించిరి. తుద కా గాంధారుండు తద్దారుణ బాణఘాతంబులకుఁ దాళఁజాలక సంధిచేసికొన వచ్చిన వానికి మరుభూమి నొసంగి మన్నించి మెలఁకువ కలిగి వర్తింపుమని చెప్పి పంపివైచెను.

గాంధారపతికండకావర మడంచి యచటితస్కరులను గంబళాదినిర్మాణముల కనువ్రుపఱుపఁ దగువారల నియోగించి యాదేశంబు విడిచి పారశీకాదిదేశప్రభులచే భూషితుండై పశ్చిమోత్తరభూభాగంబులఁ జుట్టి యచ్చటియపరాబ్ధి నుత్త రించి యుత్తరభూగోళంబుఁ జొచ్చి తత్ప్రభుబృందమానితుండై యవలఁ బూర్వవార్ధి ధితరంగముల నూఁగి తద్గతభూఖండముల మించి చీనాజనాళి నేత్రోత్సవము సలిపి తదూర్ధ్వజనపదం బులఁ జరించి కాంభోజభూమిఁ గడచి హిమాలయోత్తరా గ్రంబు మించి నేపాలంబుఁ జొచ్చి తద్భూపాలుని విందుఁ గుడిచి తత్ప్రాసాదంబున విశ్రాంతిఁగొనుచు నారాజ్యమునకు నిచ్చటినుండి యస్మత్కటకంబున కరుగువారమని తెల్పు చుండ నాతరుణంబున మహేంద్రసారథి మాతలి వచ్చి కాన్పిం చుకొని "దేవరఁ దోడ్కొనిరమ్మని మా యేలిక యానతీయ నరుదెంచితి" ననఁగ నతం డందులకు వల్లెయని క్రమ్మరి వచ్చు నంతవఱ కయ్యెడన తనపరివారం బుండ నియమించి మాత లితో మహేంద్రస్యందన మధిరోహించి యమరావతి కరిగెను.

అట్టి త్రిలోకనాథుం డమ్మహాశయు నెదురువచ్చి చేయిపట్టి తోడ్కొనిపోయి నిండుకొలువులో నిజాసనంబునఁ గూర్చుండఁ బెట్టి "ధర్మైకనిష్ఠుండవై సకలధరాతలంబు ధర్మైకసూత్రసంబద్ధమొనర్చి కరగతంబుగావించికొని మేటిసార్వభౌముండవు. దేవతలకు నజేయుండైన దశగ్రీవుని దర్పమడంచిన లోకోత్తరశూరుండవు నగుట మా కెల్లరకు మాన్యుండవు. మర్మదులైన దస్యులఁ దఱిమివైచి ధరణీతలంబు నిష్కంటకమొనర్చితి గాన "త్రసదస్యుఁ" డను బిరుదు నీక తగు. భవత్ప్రవర్తిత ధర్మంబుఁ బేర్మితో ముందు మర్త్యసంఘంబెగాక యమర్త్యసంఘంబు సైతము పుష్టిమంతమై ప్రకాశించుఁగాక" యని సభ్యులెల్లరు మేల్మేలనుచుఁ గీర్తించుచుండ నభినవకల్పవృక్షసూనదామంబు కంఠసీమ నలంకరించి సమ్మానించి సముచితంబుగ వీడ్కొలిపెను.

అంత నమ్మహీమహేంద్రుఁడు స్యందనారూఢుండై మాతలి, స్వర్గీయచిత్రములు చూపుచుండ బయలువెడలి నిజస్కంధావారంబు చేరి యామఱునాఁడు నేపాభూపాలుఁ డతివైభవంబుతో సాగనంప నచటు వెడలి స్వపురోహితామాత్యబంధుమిత్రసామంతపౌరముఖ్యులానందభరితులై మంగళతూర్యంబులతో నెదురువచ్చి తోడ్కొనిపోఁగ నయోధ్యానగరంబుఁ బ్రవేశించెను. బహుకాలంబునకు మరలఁ దాదృశభర్తృసమాగమంబుతో నానాఁడు తత్పురలక్ష్మికిఁ గల్గినయానందమపారము.

# పదుమూఁడవ ప్రకరణము.

—— :0. ——

ఆ ట్లమ్మహీకాంతుండు సకలమహీవలయంబుఁ జుట్టి వచ్చినదాది క్రూరసత్వశరణ్యంబులై జనుల కుపయోగింపక యుండు మహారణ్యంబుల ఛేదించి కాఁపురములకుఁ గృషికి ననువుచేసియు, నదీనవిధభూముల భూరితటాకములు త్రవ్వించి వానికిఁ దన్నదీప్రవాహములు మలపి నిలువరించిననీరు కుల్యాముఖంబులఁ బ్రసరింపఁజేసి శాలిసస్యములకుఁ జెఱకుపైరులకు నరటిబోదెలకు దుంపపెరడులకు నాకుఁదోఁటలకుఁ గాయగూరలకు ఫలవృక్షములకుఁ బనువుగఁ గూర్చియుఁ, దదితరభూముల పెదపైరులకు జతపఱచియు, హాలికులకు సహాయములుగ సహాకారసంఘములు నెలకొల్పియు సేద్యంపుసరణులఁ జెప్పించియు మఱియు నానావిధంబులఁ గృషిఁ గూర్చి స్వదేశపరదేశవ్యాపారంబులు విరివిగా సాఁగ సేతువులు సంక్రమములు గట్టించి దృఢతమదీర్ఘపథంబులు సృష్టించియు శకటనౌకాదిస్థలజలగమనసాధనంబులు కల్పించియు నిధుల నేర్పఱచియు వాణిజ్యంబు పెంపొందించి, పుల్లరి పెట్టకయుఁ బశుహితసమితుల నెలకొల్పియుఁ బశుపాలనంబునకుఁ గేలూఁతయొసఁగి, ఖనుల నాకరములఁ గనుగొని వజ్రవైడూర్యాదిరత్నములను, సువర్ణరజతాదిలోహములను, మణిశిలాభ్రకగంధకాదినానావిధగైరికపార్థివధాతువులను దీయించి తచ్ఛోధనశాలలు తచ్ఛిల్పనిలయంబులు నిర్మించియుఁ బలుతెఱఁగులవస్తుజాతములు వెలువరించి, పాఠశాలలు, పఠనా

లయములు కళాశాలలు సర్వకళాశాలలు వృద్ధిపఱచి విజ్ఞానవాహినులు వెల్లివిరియ సర్వతోముఖనాగరకతాసంపత్తి నంతరించి, సర్వవిషయంబులనుండి సర్వవిషయంబులందుఁ బ్రవీణులగువారి రావించి సార్వజనీనము లైనశాసనములు గావించి జనులను సద్వృత్తి కలుగ శిక్షించుచు సర్వదేశములు సుభిక్షములుగా బహుకాలము పాటువడి పూఁదేఁటి పుష్పరసంబు గొనిన క్లైదిరి కందకుండఁ గరంబుఁగొనుచు సంతానముతో నంతఃపురమును, ధనసంచయముతోఁ గోశాగారమును, ధాన్యములతో గాదెలును, గజాశ్వములతో శాలలు, పశువులతోఁ గొట్టములు, భటవర్గముతో దుర్గము పరిపూర్ణములై యుండఁ గృతకృత్యుఁడై ప్రజలతోఁ గూడఁ దానును బరిపాటితో సకల సుఖంబు లనుభవించుచుండె.

ఏతాదృశసుఖసమయంబున నాచక్రవర్తి దేవమహీదేవసంతర్పణమ్ముగ సవనధర్మపరుండై సరయూతీరంబున విరివిగ జన్నంపుశాలలు తీర్పించి యందు రాజసూయాశ్వమేధ యాగంబులు లోకోత్తరంబుగా నిర్వర్తించి వేడుకకు భూసురులకు బంగారుతో రంగార మీన మకర తిమింగిలాది జలజంతువులు పెద్దపెద్దవి చేయించి దక్షిణలొసఁగి యంతతోఁ దృప్తిపనక పురివెడలి గంగాయమునాతీరములందు నితరపుణ్యధునీతటములందు ననేకరాజసూయాధ్వరములు నశ్వమేధయాగంబులు నెల్లరు నౌరా యన నాచరించి మరల నగరంబున కరుదెంచెను.

తరువాత నొకనాఁడతండు గోదర్శనలాలసుండై గోచక్రంబు కడుపార మేసివచ్చి నీరు త్రావి నెమరువెట్టుచు సుఖముగ శయనించియుండు నవసరంబున గోష్ఠంబునకు వచ్చి, తటాలున లేచి చెవులు నిక్కించి తెక్కవాల్పక తెనవంకఁదిలకించుచు దరికి వచ్చినతన్ను మూచూచి నాకవచ్చువాని నల్పరూఢములై యందగించుశృంగమ్ములు, శంఖసరూపంబులైన శ్రవణంబులు సమున్నతలపనంబులు ముద్రిత'ద'వర్ణసదృశపాదంబులు శ్వేతాంశుకఖండకమనీయసాస్నాతలంబులు ముట్టినఁ బాల్గారుమురువుసూపునూధసములు దాతృజనపాతకపాంసువులఁ బాఱఁగొట్టునాదోకములైనతోఁకలు ఈఁగవ్రాలిన జాఱులాగున మిసమిసలాడుమేనులు గలిగి కలిమిచెలువకు నెలవులైనగోమతల్లికలఁ గాంచి హర్షించి చేత,సాస్నాతలంబు నవరించి మేను నివురుచు సంతసిల్లఁజేసి యొక్కెడ నిల్చి తదీయరామణీయకంబు విలోకించుచు మనంబున నిట్లాలోచించెను.

“నృపాలురకు గోదానం బవశ్యకర్తవ్యం బందురు. తద్విధానం బేయది యగునో తెలియవలయును. సురగురున కయ్యది చక్కఁగఁ దెలియుననిరి. అమ్మహనీయు నెన్నఁడు గాంచనగునో?” అనియిట్లాలోచించు నాక్షణమందే యెటకేనిఁబోవుచు నవ్యమరగురుం డీసార్వభౌముని సందర్శింప సంకల్పించి యాతని యునికి విచారించి యిచటికి వచ్చెను. తోడనే యన్నరేంద్రుఁ డమ్మహనీయుని బూజించి తనయభీష్టం బెఱింగింప నతం డిట్లని వచించెను.

" రాజా ! పుణ్యదినంబున నుపవసించి బ్రాహ్మణులను బూజించి గోదాన మనుష్ఠింపఁబూని గోవులనడుమ కేఁగి దానార్హంబు లైన ధేనువుల నిరూపించి " గావో మే మాతా వృషభః పితా..." యనుశ్రుతిని బఠించి యారేయట గోసమంబుగ వసించి మఱునాఁడు సంగవకాలంబున దూడలు గల ధేనువులఁ బేరువెట్టిపిలిచి యావుల నన్నిటి నుద్దేశించి "సూర్య సంబంధులు సౌమ్యమూర్తులు నైనసురభులార ! మీరు మా పాపంబులు పటాపంచలుచేసి మాస్వర్గయానమునకుఁ దోడ్పడుఁడు. తల్లివలె మమ్మాశ్రయించి మంచిదీవన లొసంగుఁడు. దేహావసానమునఁ బరలోకమందు మా శ్రేయంబుఁగోరి మంచి మాటలనుఁ జెప్పుఁడు. మీరలెల్లప్పుడు పుణ్యోపవాహ్యలు, మా కిష్టమైనయనుభవమును బ్రసాదింపుఁడు. మీరు నేను నిత్య ఁడోక్కరూప. మిమ్ము దానముచేసి యాత్మప్రదాత నగుచుంటిని. మనఃపూర్వకముగ విడువఁబడుచున్నారు. మీరు వెళ్ళినతావుల మనసుపెట్టి వర్తించుచు మీసౌమ్యరూపోన్నత రూపములతో నుత్తరోత్తరాభివృద్ధితోఁ దేజరిల్లఁ బూరింపుఁడు " ఇట్లుపల్కి గోదానకర్త ' ఇచ్చుచున్నా 'నని పల్కుచు దానంబుగొనుబ్రాహ్మణునకు నర్ఘ్యము, వస్త్రము, కనకము నొసంగి యుదకధార నాబ్రాహ్మణునిహస్తమున విడిచి యా గోవును ముందుకుఁ దోలవలయును. ఈవిధంబున గోదానంబొనర్చినయతండు వైష్ణవం బైనచంద్రలోకమున నిరతిశయ సుఖంబు లనుభవించును. ఆశ్వయుజమాసమున రెండగు నష్టమిమొదలుకొని మూఁడుదినములు గోమూత్రపురీష

ముపయోగించువాఁ డిష్టార్థంబులఁ ప్రాపించును. అశిష్యున కవ్రతునకు వక్రబుద్ధి కశ్రద్ధధానునకు గోదానము చేయరాదు. లోకమునందు శ్రద్ధాళువులు, క్షుద్రులు, రాక్షసులందును మానవులందును గలరు. అల్పపుణ్యు లెవ్వ రాస్తిక్యము నాశ్రయించుచుండిరో వారి కిచ్చుదాన మనిష్టహేతుకము.” ఇట్లు వచించి యతం డనుప నచటు వీడి యథేచ్ఛం జనియెను.

మాంధాత్రుం డా రెండవనాఁడు మునుకొని తదుక్త విధంబున విప్రవరులకు గోదానములు చేయుచు వచ్చెను. అట్లతం డొసంగినగోవులు పదిపద్మసహస్రంబులని పరోక్షంబున బ్రాహ్మణులు చెప్పుకొనిరి.

ఇట్లు దానధర్మానుష్ఠానంబులతో బహుకాలము గతింప నొకప్పుడు రేయుంబవళ్ళు పగిది కష్టసుఖంబులు క్రమప్రాప్తంబులని లోకంబున కెఱుకపఱుపఁగావలయు గొప్పవఱ పొకటి ప్రారంభమయ్యె. అట్లు ప్రారంభమైనవఱపు పండ్రెండుసంవత్సరములవఱకు విడువక ప్రజలను బ్రజాపాలురను బీల్చి పిప్పి చేసివైచినది. ప్రథమవర్షమున దైవమాతృకములవారు నువ్వులు నల్లవరి తెల్లజొన్నలు తెల్లపత్తి కొఱ్ఱలుసజ్జలుమున్నగుముగారుపైరులు పెట్టుటకు భూములను మొక్కమోడులు తీసివైచి మిట్టతగ్గులు సమముచేసి గరికనొట్టుల నెత్తివైచి ప్రతిదినము కోడికూయువేళ నిదురలేచి కోటేళ్ళుపన్నుకొని వెడలి యుం బట్టిప్రొద్దువాఁక యెద్దులు తాము పాటుపడి యింటికి వచ్చుచు రోహిణీకార్తెకొనకు మెత్తగ దున్నిపెట్టుకొనిరి. మృగశిరకార్తె వెళ్ళినను భూమిమీఁదఁ బొటుక్కుమని యొక్క

చినుకైనను బడలేదు. అదిగో యిదిగో యనుచుండఁగ నేమృగశిర
కార్తెయు గతించినది. ఆకసమువంక నిగాదిగఁ జూచుటతోఁ
బునర్వసుపుష్యము లాశ్లేషతో సహా యంతమొందినవి. రైతుల
మితిమీఱిన శోకములతో మనసలేక మఘపుబ్బలుకూడ
ముఱుఁగించినవి. ఈతీరునఁ దొలకరిపైరులతటి తప్పినకొలఁ
దియు హాలికులముఖకాంతులు తఱుగుచు వచ్చినవి. తఱుగ కే
మగును? గతవర్షము ధాన్యములు కార్తికమాసమునకుఁ గడ
ముట్టఁగొట్టమున్నుగుక్రొత్తధాన్యము కరగతమై యప్పటిరైతు
కమ్మూరితిఁ గడపుచుండెడివి. మఱియుఁ బసువులకుఁ బ్రాఁగస
వునకుఁ గ్రొంగసవును దోడురా నిబ్బరముగఁ బోషణము
పొసఁగుచుండెడిది. ఇప్పు డాయాస లడుగంటినవిగదా! ఇఁక
నదీమాతృకములనా రొకరికన్న నొకరు మున్నుగఁ బంట
కాలువల నీరు పాఱకున్నను జేలలోని చెఱువులనీరును, దొ
వ్వినచెలమలజలమును నిలకడ గలమడుగులనీరును జల్లి నాఱు
మళ్ళకు విత్తనములు పెట్టిరి. అనతికాలంబునక నాఱు పెరి
గెను. క్రమముగ వర్షాభావముతో నునికిపట్టుల నవశిష్టజలం
బుల కభావంబు గల్గఁ దలలు వాఁడిననాఱుమళ్ళ నవలోకిం
చుచు విన్నవోయినవదనంబు లంతలోఁ గట్టువడినకాలువలు
మరలఁ బాఱుచుండ నించుక చెన్నుమీఱఁ గృషీవలులు
జానుదఘ్నమైనతజ్జలపూరంబునకుఁ దోడు వర్షజలపూరంబు
జతపడిన సమీచీనమని యెంచి యాలో భూముల గట్టుగని
మలు మిఱ్ఱుపల్లములు చక్కఁజేసి యెఱువుకట్టి మెట్టపుఃక్కులు
దున్నుకొని సిద్ధముగ నుండిరి. అట్లుండ నాకార్తె కాకార్తె

గడచిపోవుటయు కాని వాన కురియుజాడలు కన్పట్టవయ్యె. అం
తఁ గాలాతీతంబగుచుండఁ గర్షకులు నిల్వలేక వనికి ముదు
కొని శ్రీమఁదలపోయక యెత్తిపోఁతలతోఁ బగలంతయు నీరు
పెట్టి వేకువవేళ కానీ రంతయు నాటిపోవఁ బరిశుద్ధమైనపాల
ముల మరల నీరుపాఱించి నాఱు తీసి నాటుట కారంభించిరి.
నీరు చాలనిందు చాలకపోనిం దూరకుండుట సేద్యగాండ్రకు
శీలము కాదు. అత్తఱి మూన లెండుచున్నవనియు మళ్ళు
తడవలేదనియు నాఱు మళ్ళకు నీరు చాలదని యసలే
నీరుపాఱలేదనియు మొఱలతోఁ బ్రతిగ్రామమునందును బాచా
యతులు ప్రబలిపోయినవి. తరువాత నందఱు హర్షించు
లాగున రెండువానలు కురిసినవి. వానితో మెట్టనేలలుకూడ
మంచునకు ఫలించువరిగె, సెనగ, గోధుమ, ధనియము,
మున్నగుసస్యములతో విలసిల్లినవి. అటునిటుఁ జేసి యెల్లరకు
నించుకతక్కువగా నర్ధఫలము కలిగించి యావత్సరము గతించి
నది. అట్లే మఱిరెండేం డ్లతిక్రమింప నాల్గునేఁడు నాలవ
పాలుపంటతో నడచినది. ఆవల నాఱేండ్లవఱకు నావరుస
తప్పలేదు. అంతదనుకఁ బంటలు సరిగ లేకున్నను దొల్లిసంచి
తము లైనపదార్థజాతముతో నొక్కపూట భుజించి కొన్నిదిన
ములు, అంబలి కాచికొని కొన్నినాళ్లు నెట్టెటో జనులు కాల
యాపనము సేయుచుఁ బదునొకండవవత్సరము ప్రారంభమగు
నప్పటికిఁ గొణజములు, గాదెలు, కొట్లు, పాతరలు తమ
యుదరములతోఁగూడ శూన్యములు కాఁగఁ గూరగాయ లతి
కష్టముగాఁ గాయించి వానితో నాఁకలితీర్చికొనుచు నెట్టెటో
యావర్షము వెళ్ళించి పండ్రెండవయేఁటఁ ద్రాగనీరును దుర్ల

భము కాఁగ నాకలములు తినుచుఁ జివర కాఁకలి కోర్వలేక చిక్కనిరోయిందు బురద త్రావిరనిన నమ్మాఁడు. అనా లట్లు జరగఁ బదుమూఁడగునేఁటిప్రారంభమున మానవులు మానవు లనే విఱిచికొని తినఁజొచ్చిరి.

ఆఘోరంబు చూచి భరింపఁజాలక వలపు దొరకొని నది మొదలు కన్ను తీసివైచి కలవులకనులు చేయించియు నింక ననేకభంగుల సాయ మొనర్చుచుఁ గొనకుఁ దాను దుర్గముల నిలువచేసియుంచిన ధాన్యరాసులు సంపూర్ణముగఁ బంచియిచ్చి ప్రజలతోఁ బాటు కష్టుండు మనపార్థివశిరోమణి వర్షింపక గడ్డ కట్టి కదలకయుండు మేఘజాలమ్ముపై మించినకోపమ్ముతోఁ గన్నులు నిప్పుకలు గురియ మూలనుండువిల్లుఁ గేలఁబూని నారిమోయించి యమ్ము లరిఁబోసి గుడుసువడ వంచి మేఘ వాహనుఁడు మాన్పడిచూచుచుండ మేఘజనకుఁ డర్యముఁడు శౌర్యహీనుండై చక్కటికిఁ దొలఁగి చదలంటిపోవ బ్రహ్మాండ కర్పరము తూటువడ బిట్టేసి యంతనిల్వక యాగ్నేయాస్త్రము నభిమంత్రించి వైచి యార్చెను.

అప్పుడొక్కుమ్మడి యాగ్నేయాస్త్రమువలన నుత్పత్తిల్లినజ్వాలామాలికలచే లోనఘనీభవించియుండుజలము ద్రవీభూతము కాఁగ మేఘజాలములు తాత్కాలిక వాయుప్రేరిత ములై నలుదెసలఁగ్రమ్మి కడవపోఁతగా జడి కురియనారంభించెను. ఆరీతి విరామము లేకుండ నేడురోజులు వర్షించినవి. అప్పటికి భూమి మూరెడెత్తు పొంగినది. నదులు పొర్లిపారినవి. చెఱువులు కలవులీలసండినవి. బావులు బారెఁడుల్రాళ్ళకు లోనైనవి.

చావఁగ మిగిలినసకలప్రాణులు కడుపారఁగుడిచినట్లు సంతసిల్లినవి. దారిద్ర్యము తుదముట్టి భాగ్యముప్రాపించిన ట్లందఱిముఖములు కాంతిమంతములై యలరినవి. ఇతఁడీశౌర్య మింతకుమున్న చూపిన నింతహీనస్థితి కలుగకుండెడిది. కాని- అట్టిఁడీయోచన యతనికిఁ దోఁచలేదు కాఁబోలు. అన్ని వైపుల ససంభవములు తోఁచినప్పుడే మానవునిమనోరంగమున యోచనలు తోఁచుచుండును లెండు. ఏటు తిని పాము పడగ విప్పినట్లు వంచితుండయి మనుజుఁడు మహిమఁజూపును. అంత మూలమూల్లుచున్న కాడిమేడలు, ఏడికోలలు, కలుపువగ్గములు కత్తిగుద్దలులు, కలుగుపాఱలు కొలికిరాఁగాలకర్రమములతోఁ బ్రాణములు వచ్చినట్లు కర్మాగారములు కదలఁదొడఁగినవి. వాణిజ్యమునకు సామ్రాజ్యము సంభవించినది. చచ్చిబ్రతికిన మానవలోకము పాడువడ నల్పకాలము కట్టినను బాగుపడఁ బహుకాలముపట్టెను. అన్నహీనాలంతు ప్రజలు మరలఁ గోల్పోయినపుష్టిఁ బడయువఱకుఁ గడుపునిండఁ గూడును కన్నునిండఁ గూర్కు నెఱుంగఁడు. తరువాతఁ గష్టములు మఱచి ప్రజలు సుఖించుచుండఁ దానును బురుకుత్సా బరీష ముచికుందు లనుమువ్వురుకొమరులతోడను, ముద్దులగను లైన యేఁబండ్రుకూఁతుండ్రతోడను ప్రేమస్వరూపు యగుబంధుమతి యొనర్చుపరిచర్యలఁ గొనుచు సుఖించుచుండెను.

---

# పదునాల్గవ ప్రకరణము.

—:0:—

అట్లు౦డునీగృహమేధికడకొక్కనాఁడు "సౌభరి"యను మునిముఖ్యుండు చనుదెంచి యథార్హ౦బుగ నర్చితుండై 'నరేంద్రా! మహేంద్రునకైన మనోరథంబు లీఁజాలినమహా దాతవు. ఎవ్వరేదార్థమేవేళఁ గోరిన దానిని దత్క్షణము యొసఁగి యర్థిని సంతోషపెట్టుగుణ మిక్ష్వాకువంశజులకు జన్మసిద్ధము. తదగ్రిణివైనని న్నిహలోకసుఖావహం బగు ఫలం బొకం డడుగవచ్చితి' నన విని యతండు మునీంద్రా! మాయెడఁ గలయభిమానంబున కెంతయుఁ గృతజ్ఞుండ. మీయట్టివారి యిష్టంబులు తీర్చుకంటె నుత్తమకార్యం బొండుకలదె? దయయుంచి యానతిచ్చిన దాని నవశ్యంబు నెరవేర్చువాఁడ ననియె.

సౌభరి యప్పలుక్కు విని, సత్యవ్రతా! మఱేద్దియుఁ గాదు. గృహస్థుండఁ గాఁదలంచి కూతుండ్రఁ గన్నదొరవు గానఁ గన్యార్థినై వచ్చితి ననెను.

మునివరా! బ్రహ్మానందానుభవరసికులైనతా మిప్పుడు నిరానందమై క్లేశభూయిష్ఠంబైనసంసారము నపేక్షించుటఁజూడ మాకు వింతగ నున్నయది. దీని కేదేని గారణంబు గలదేని వచించి యనుగ్రహింపుఁడీ యనిన మాంధాతృనకతండిట్లనియె.

" రాజేంద్రా! వినుము. ప్రారబ్ధకర్మం బనుభవిం పక యెవ్వానికినిఁ దెగదు. దాని ననుసరించి, యేను వింధ్యారణ్యంబులోనిమహాసరోవరంబున జలాంతర్గామినై తపోనిష్ఠ

నుండ ననుదినంబు మహాభిమానం బొకండు కళత్రపుత్రపౌత్ర విశిష్టమై వేడుకతో నాచుట్టు తిరుగుచుండెడిది. అభిమాన సంసారంబుఁ జూచిననాకుఁ గృహపతినై సంసారంబు సలుప బుద్ధిపొడమినది. దాన నిటు వచ్చితి. ”

అది విని యారాజన్యుం డిట్లు తలపోసెను. ఈతపోధనుండు జరావిష్టమైనశోణితశూన్యకాయంబును నెరసిన జడలు, తెల్లనిగుబురుగడ్డము జర్జరితము లైనయవయవంబులు కలిగి బెడఁగెడలినమానిసి. ఈదానంబున నొకరి కభీష్టసిద్ధియు నింకొకరి కనిష్టసిద్ధియుఁ గలుగును. ఉభయసమ్మత మగు దానంబు సర్వజనముదావహము. ఏమి చేయుదు? ఈకోర్కి నెట్లుతీర్తు? నమ్మి వచ్చినయిప్పాఱు నూరక పుచ్చుటయు ధర్మువు కాదు. ఇట్లు తలపోసి క్షణ మూరకుండి యప్పటి కొకయూహ తోఁప నవ్విప్రునితో నిట్లనియె.

మానివర్యా! మీయభీష్టంబు మా కవశ్యంబు తీర్పఁ దగినదియ. దాన మాకులంబును దరించు. వచ్చినవరుండు కన్యకు నచ్చినఁ బరిణయ మొనర్చుట యస్మత్కులాచారంబు. ఉచితకులాచారంబు పోఁద్రోయుట పాడిగాదు. కావునఁ దా మనుగ్రహించి యంతిపురి కరుగుఁడు. మాకొమరితలం దెవర్తుక యిష్టపడునో దాని మీకొసంగి యనుపువాఁడ ననిన, నతం డందుల కియ్యకొనఁగ నంతఃపురప్రతీహారి రావించి యిమ్మునివర్యునిఁ గన్యాంతఃపురమునకుఁ దోడ్కొనిచని యట వారికిఁ జూపి యెవ రిచ్చగింతురో వారి నీయన కిచ్చి వివాహ మొనర్తుమని మామాటగాఁ దెల్పుమన వాఁడు హసాదని

సలాముచేసి వెనుకకు నడచుచు నమ్మౌని వెంటరా నటనుండి వెడలెను.

ఆజటిలుం డంతిపురి కరుగుచు నీగృహమేధి నన్ను రక్షింపనేరక నాబికారితనంబునకుఁ గన్నియలు కాంక్షింపరని తలంచి యీయుపమ నూహించె. ఏనును దానికిఁ దగినవేసంబు వైచువాఁడనని భావించి శుద్ధాంతంబుఁ జొచ్చి లోకోత్తరంబైనరూపంబుతో నాత్మాకారంబైనయాసనంబున నాసీనుండయ్యె.

అంతవర్షధరుండు లోని కరిగి తండ్రిపల్కులు కూఁతుండ్రకు వినిపింప వరుని వీక్షించుతమి నాఁడారులఁ గడచుచు

"కారుమెఱుంగులో మెలఁపుగైకొన నేర్చినపైఁడిబొమ్మలో
మారునిదీపములో కలికిమాటలచంద్రికలోఁ జెలంగుశృం
గారరసాధిదేవతలొ కమ్మనికొమ్మవిరిత్తీఁగెలో యనన్
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై."

సౌందర్యరాశియైనయాధరణీసురో త్తముని సందర్శించి మఱుఁగున కరిగి చేలాంచలము వేళ్ళతో మెలివైచుచు నొకరినొకరు గేరుచుఁ ద్రోసికొనుచు

"ఈతఁడు నాకుఁ బ్రాణవిభుఁ డీతనికిం బ్రియురాల నన్నుము
న్నీతఁడు సూచె నీతనికి నిల్లడమానిసి నేను నాకుఁ గా
నీతఁడు వచ్చెఁ దండ్రి నను నీతని కిచ్చె నటంచు నొక్కమై
నాతరుణీమణుల్ జగడమాడిరి మారవికారచిత్తలై."

ఈరీతి నయ్యువతులు తపస్విని బెండ్లియాడఁ దత్తఱపడు టెఱింగి వర్షధరుం డాసౌభరితో స్వామిసమ్ముఖమునకుఁ

జను దెంచి దూరమునుండియే శిరము పుడమి సోఁక నమస్కరించి వారలచందంబు విశదంబుగ విన్నవించె.

అమ్మాంధాతయుఁ దనయలతమకంబునకుఁ జకితుండై తనసమక్షమున బడుగుబాపనిభంగి నుండునమ్మౌనిమహాత్వమ్మును మనంబున మెచ్చుకొని "మంచి దట్లయగుఁగాక" యని మాటనిచ్చి శుభలగ్నంబున నవ్విప్రునకు మధుపర్కంబు వెట్టి యలంకృతలై యున్నతనయల రావించి జ్యేష్ఠానుపూర్విగ నొక్కొక్కతెఁ జేరఁబిలిచి చేతఁజేయిపెట్టించి యథావిధిగ దానంబు చేసి పరిణయోత్సవంబు నెఱపి యల్లునితోఁ గూతుండ్ర నసంఖ్యమణికనకాభరణాదివసనంబు లొసంగి గారవమొప్ప శిబికారూఢలఁ జేసి పంపించెను.

ఈపంచాశన్నారీఫలతో నీ నవ్యగృహస్థు నిజాశ్రమంబున కేతెంచి వాయుసహాయమున విశ్వకర్మను రప్పించి వేర్వేఱ మనోహరహర్మ్యంబులు మంజులోద్యానవనంబులు విహారభవనంబులు క్రీడాసరోవరంబులు నిర్మింపఁబనిచి యతం డొప్పొనర్చి చన వారి నందు వరుసగ విడియించి యన్నరోభామినుల రావించి దాసీజనంబుగాఁ గూర్చి తత్పుత్రీభావమ్ముతోఁ దగినధనధాన్యంబులు గృహోపకరణంబులు మొదలైనవి సమకూర్చి తా నేఁబండ్రకు నేఁబదిరూపులుగా నేర్పడి యేరికిని బొరిపొచ్చెము కల్గకుండ యథేష్టముగ సకలసుఖంబు లనుభవించుచునుండెను. అణిమాద్యష్టసిద్ధు లాత్మాయత్తములై యుండునసాధారణమహిమాన్వితుల కలభ్యము లేవి యుండు? సకలము సంకల్పమాత్రమ్మునన సిద్ధించుచుండును. విశ్వా

సలాముచేసి వెనుకకు నడచుచు నమ్మాని వెంటరా నటనుండి వెడలెను.

ఆజటిలుం డంతిపురి కరుగుచు నీగృహమేధి నన్నాదరక పుచ్చనేరక నాబికారితనంబునకుఁ గన్నియలు కాంక్షింపరని తలంచి యీయుపమ నూహించె. ఏనును దానికిఁ దగిన వేసంబు వైచువాఁడనని భావించి శుద్ధాంతంబుఁ జొచ్చి లోకోత్తరం బైనరూపంబుతో నాత్మాకారం బైనయాసనంబున నాసీనుండయ్యె.

అంతవర్షధరుండు లోని కరిగి తండ్రిపల్కులు కూఁతుం డ్రకు వినిపింప వరుని వీక్షించుతమి నొండొరులఁ గడచుచు

"కారుమెఱుంగులో మెలఁపుగైకొన నేర్చినపైఁడిబొమ్మలో
మారునిదీములో కలికిమాటలచంద్రికలోఁ జెలంగుశృం
గారరసాధిదేవతలొ కమ్మనిక్రొవ్విరితీఁగెలో యనఁగ
వారిజపత్రలోచనలు వచ్చిరి మోహవిలాసమూర్తులై."

సౌందర్యరాశి యైనయాధరణీసురో త్తముని సందర్శించి మఱుఁగున కరిగి చేలాంచలము వేళ్ళతో మెలివైచుచు నొకరినొకరు గేరుచుఁ ద్రోసికొనుచు

"ఈతఁడు నాకుఁ బ్రాణవిభుఁ డీతనికిం బ్రియురాల నన్నమ
న్నీతఁడు సూచె నీతనికి నిల్లడమానిసి నేను నాకుఁ గా
నీతఁడు వచ్చెఁ దండ్రి నను నీతనికిచ్చె నటంచు నొక్కమై
నాతరుణీమణుల్ జగడమాడిరి మారవికారచిత్తలై."

ఈరీతి నయ్యువతులు తపస్విని బెండ్లియాడఁ దత్తఱ పడుచుఁ జెలంగి వర్షధరుం డాసౌభరితో స్వామిసమ్ముఖమునకుఁ

జనుదెంచి దూరమునుండియే శిరము పుడమి సోఁక నమస్క-రించి వారలచందంబు విశదంబుగ విన్నవించె.

అమ్మాంధాతయుఁ దనయలతమకంబునకుఁ జకితుండై తనసమక్షమున బడుగుబాపనిభంగి నుండునమ్మౌనిమహాత్వమ్మును మనంబున మెచ్చుకొని "మంచి దట్లయగుఁగాక" యని మాటనిచ్చి శుభలగ్నంబున నవ్విప్రునకు మధుపర్కంబు వెట్టి యలంకృతలై యున్నతనయల రావించి జ్యేష్ఠానుపూర్విగ నొక్కొక్కతెఁ జేరఁబిలిచి చేతఁజేయిపెట్టించి యథావిధిగ దానంబు చేసి పరిణయోత్సవంబు నెఱపి యల్లునితోఁ గూతుండ్ర నసంఖ్యమణికనకాభరణవసనంబు లొసంగి గారవమొప్ప శిబికారూఢలఁ జేసి పంపించెను.

ఈపంచాశన్నవోఢలతో నీ నవ్యగృహస్థు నిజాశ్రమంబున కేతెంచి వాయుసహాయమున విశ్వకర్మను రప్పించి వేర్వేఱ మనోహరహర్మ్యంబులు మంజులోద్యానవనంబులు విహారభవనంబులు క్రీడాసరోవరంబులు నిర్మింపఁబనిచి యతం డట్లొనర్చిన వారి నందు వరుసగ విడియించి యక్కరోభామినుల గావించి దాసీజనంబుగాఁ గూర్చి తత్ప్రభావమ్ముతోఁ దగినధనధాన్యంబులు గృహోపకరణంబులు మొదలైనవి సమకూర్చి తా నేఁబండ్రకు నేఁబదిరూపులుగా నేర్పడి యేరికిని బొరిపొచ్చెము కల్గకుండ యథేష్టముగ సకలసుఖంబు లనుభవించుచునుండెను. అణిమాద్యష్టసిద్ధు లాత్మాయత్తములై యుండునసాధారణమహిమాన్వితుల కలభ్యము లేవి యుండు? సకలము సంకల్పమాత్రమ్మునన సిద్ధించుచుండును. విశ్వా

మిత్రుండు రెండవస్వర్గంబు నిర్మించినది సంకల్పమాత్రమ్ము ననఁగా ! అది యొకండ యేల ? ఈ ప్రపంచమంతయు సంకల్పమాత్రవిలసితంబే. సంకల్ప మనునది మనోధర్మము. మనస్సు స్వాధీనమై యున్నచో నన్నియు స్వాధీనములగును. మనసుకు లోఁబడియుండుమనము మహాశ్శక్తి నెఱుంగక తొల్లింటి మహర్షియులు మానసికశక్తిచేఁ గావించిన ఘనకార్యము లసంభవరూపములని వాదించుచున్నారము. సర్వంబునకు మనస్సే కారణము. ఏజ్ఞానాతిశయముతో దేవతలు తైజసమూర్తులై కామరూపకామగమనకామసుఖంబులు గ్రి మనకంటె శ్రేష్ఠులై వెలయుచుండిరో తాదృశజ్ఞానసాధనము మనస్సు. ఆత్మవస్తువు దీనితోఁగూడినపుడు జ్ఞానోదయమగును. ఈమన స్సింద్రియములతోఁ జేరినపు డాయుదయించిన జ్ఞాన మనుభవరూపమై విలసిల్లును. ఈదృశజ్ఞానసాధన మగు మనమ్మును వశపఱుచుకొని తొల్లింటి విప్రులు తత్సామర్థ్యంబుతో * అణుత్వ, మహత్వ, గురుత్వ, లఘుత్వ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వంబు లను నష్టసిద్ధులఁ బడసి సురసమానముగ మెలఁగుచు భూసురు లనుపేరఁ బఱఁగిరి. జమీ నంతరించినను " జమీందార్ " బిరుదువలె సురసామ్య మంతరించినను భూసురనామ మంతరింపక నేఁటికిని

---

*అణుత్వసిద్ధి=సూక్ష్మరూపముకల్గుట; మహత్వసిద్ధి=స్థూలరూపముకల్గుట; గురుత్వసిద్ధి=భారమైనరూపుకల్గుట ; లఘుత్వసిద్ధి=తేలికరూపముకల్గుట ; ప్రాప్తిసిద్ధి=భోగ్యభోగస్థానభోగప్రాప్తి ; ప్రాకామ్యసిద్ధి=కామరూపకామగమనాదికామప్రాప్తి ; ఈశత్వసిద్ధి=ఐశ్వర్యము (అధికారము) ; వశిత్వసిద్ధి=వశీకరణశక్తి.

నిలిచియున్నది. మనసునం దెవని కెట్టిభావన యేర్పడునో తదనురూపకార్యసిద్ధియే వాని కగుచుండును. విత్తన మొకటి పెట్టినఁ జెట్టు వేఱొకటి మొలవదుగదా? చిత్రకారుఁడు స్వభావనావిలసితరూపమునే కాగితమునఁ జిత్రించును. తనయులపోలికవలనఁ దల్లులభావన తెల్లమగును. కావునఁ జిత్తము స్వాధీనము చేసికొని వర్తన మాదర్శరూపమై వెలయ సదృశభావనల భావించుచుండిన నవశ్యమున్నతస్థితికి రాఁగల్గుదుము. కానిండు. ప్రకృత మనుసరింతము.

అట్లు సౌభరిమునీంద్రుండు పంచాశద్రూపుఁడై పంచాశద్భార్యలతో సకలసుఖంబు లనుభవించుచుండ మాంధాత మునివరుం డొకకన్నియను వేఁడ నేఁబదిమందికన్యల నొసంగినారము. ఆఛాందసుం డెల్లర నేకరూపమున నాదరించుచుండెనో లేక యేకత్రానురక్తిమై నుండెనో వారికష్టనిష్ఠురము లెట్లున్నవో కనుఁగొనవలయు ననునిచ్ఛతో నొకనాఁడు భార్యాసమేతుఁడై జామాతృనాశ్రమంబునకుఁ జనుదెంచి యట మున్నెన్నఁడు నేని జూడనిదాని సురపురంబున కీడై సముజ్జ్వలసౌధవిభ్రాజమానపట్టణము నొకటిని గాంచి యచటిజనులవలన నది సౌభరితపఃప్రభావంబును గల్గినపురంబగుట యెఱింగి సదృశంబనిసంతసిల్లి యల్లునిఁ జేరంజని యాతనిచే నర్హవిధంబున నర్చితుండై తదనుమతి నంతఃపురంబుఁ జొచ్చి యెదురఁ జెలికత్తియ లూపుమణిమయడోలి కాంచిత యగుదానిఁ బెద్దకూఁతుం గాంచి యామె తమ్ముఁ జూచి హెచ్చినయానందముతో డోలిక దిగివచ్చి ప్రణమిల్లి లోనికిఁగొనిపోయి యాసీనులఁ

జేసి కుశలంబడిగిన సర్వంబు క్షేమంబని చెప్పి తల్లీ! నీచెలి యండ్రు నీవు సుఖులై యున్నారే? మీయెడ నీవేళ విభుండు మించుననురక్తిం బ్రవర్తిల్లునే? తొడి, పూసి, కట్ట నగు ననర్ఘవస్తు తతి సంపూర్ణంబుగా నున్నదే! భుజింప మీకు సరసాన్నంబులు సమృద్ధంబులే? యనిన జనకునకు సుత యిట్లనెను. తండ్రి! మీ రడిగినవెల్ల నేకొదువయు లేక సంపన్నములై యున్నవి. మీయల్లురు ననుదినంబు నాసౌధంబునన వసించి సంతసము గొల్పుచుండును. అనవుడు నాదుహితృవత్సలుండై విప్రుం డొక్కయింటికే కూర్చుచుఁ దక్కిన నెలఁతలఁ దలఁపఁడు కాఁబోలు ననుకొని యటనుండి కదలి రెండవసౌధంబున కరిగి యావిధంబునని ప్రశ్నించి సర్వంబు సంపన్నంబని సదుత్తరంబువలుక మూఁడవయామెకడ కరిగి యట్లె ప్రచ్ఛఁజేయ నయ్యువతియు మిమ్ముఁ జూడఁ గొంతతక్వ నేకొంతయు నెఱుఁగనని. ఇవ్వగిది నందఱ నడిగి వారెల్ల రాలోచించికొని చెప్పిన శ్లోకవాక్యంబుగా సకలసుఖంబు లనుభవించుచున్నార మన విస్మితుండై యల్లుని తపోమహత్త్వమునకు మెచ్చికొని కొమార్తెలవిభవంబుఁ జూచుచు దినత్రయం బుండి వారల కెల్లరకు నపారధనకనకవస్తువాహనము లొసంగి జామాతృని కడ కరిగి మహాత్మా మీ రల్లురైనకతన మావంశంబు పావనంబైనది. మిమ్ము వరించి మాపుత్రికలు సుఖస్థితి నున్నారు. కార్యవ్యగ్రత యుండనీదు. పోయివచ్చెదము సెలవిండని నమస్కరించి యతఁ డనుమతింప నిజపురమున కరుదెంచెను.

---

# పదునైదవ ప్రకరణము.

—:o:—

ఇటు సౌభరి యిల్లాండ్రేఁబండ్రయందు నూటయేఁబండ్రఁ గొమరులం గని పెంచి పెద్దవారిం జేసి వధువులు పెండ్లిండ్లు గావించి వారును గొడుకులను గుమారికల మనుమల దౌహిత్రుల, మునిమనుముల నెత్తఁ గుటుంబంబు తామరతంపరయై వృద్ధిఁబొంద సర్వవిధసుఖంబులు చర్వితచర్వణంబుగా బహుకాలం బనుభవించి తుదకు విసుకు కలుగ భార్యాసమేతుండై తక్కినబలఁగంబుం బరిత్యజించి యరణ్యంబున కరిగె. ఇమ్మునివరుండు మొదటవచించినట్లు ప్రారబ్ధకర్మం బప్పటికిఁ బరిసమాప్తంబయ్యెనని యతనియరణ్యగమనంబువలన విశదమగుచున్నది. సుకృతదుష్కృతరూపం బైనకర్మం బాగామి, సంచిత, ప్రారబ్ధరూపమునఁ ద్రివిధంబై యుండును. అందు మొదటిది ప్రకృతజన్మమున సంపాదింపఁగలట్టిది. రెండవది క్రిందటిపుట్టువులఁ బోగుచేసిపెట్టినయది. మూఁడవది సంచితమునుండి యనుభవమునకై గ్రహించినది. ఇయ్యది నిలువచేసినవిత్తమునుండి నిత్యకృత్యంబులనిమిత్తమై యుపయోగించుకొన వేఱుచేసి యుంచినవిత్తమును బోలినది. మొదటి రెండుకర్మలు గాలిచేతఁ గర్పూరంబుకరణి జ్ఞానాగ్నిచే నిర్మూలింపఁబడును. మూఁడవది యగుప్రారబ్ధకర్మం బట్టిజ్ఞానాగ్నిచే వ్యయింపఁబడక యనుభవముచేతనే వ్యయింపఁబడును. 'ప్రారబ్ధకర్మణాం భోగాదేవ క్షయః' యని ప్రాచీనసిద్ధాంతము. పోనిండు. దానిజోలి మన కేల?

మాంధాతృసార్వభౌముం డాయల్లునియరణ్యాగమనవార్త
నాకర్ణించి "యెల్లరకు నదియు నంతిమకర్తవ్యము. ఈసంసార
పరికారంబు లెన్నటికి నిట్టివ. ఇందు విశేష మేమియుఁ గాన్పిం
పదు. నిన్నఁ దీర్చినకార్యంబ నేఁడును దీర్పఁబడుచున్నయది.
దీనిం జూచిన నాకును విసువుజనించుచున్నది. ఏను నట్లచేయు
వాఁడ. రాచపుట్టువు నెత్తినందులకు రాజనీతులుఁ లోకనీతులు
నాచార్యానుగ్రహంబున గ్రహించితి. గురునానతిచొప్పున
లోక మేకనాయకముగ నొనర్చి గ్రహించిననీతిచొప్పున నడిచి
కొని యితరుల నడిపించితి. చాతుర్వర్ణ్యమును స్వస్వధర్మ
ములఁ దప్పకుండ నిలిపి యాచారవ్యవహారధర్మముల లోపం
బులు తొలఁగించి యథాక్రమమ్ముగ నొనర్చి విద్యాబీజములు
వెదచల్లి వివిధజాతులకు విజ్ఞానంబు కరగతంబుగ నొనర్చితి.
సాధ్యమయినంతవట్టు కృషివాణిజ్యగోసంరక్షలకు సాయమొన
ర్చితి. రాజసూయాశ్వమేధంబు లొనర్చి దేవఋణంబును,
అధ్యయనవ్రతచర్యలు గావించి ఋషిఋణంబును గొడుకులఁ
గూఁతుండ్రఁ గని పితౄణంబును దీర్చికొంటి. బహుకాలంబు
బహుభంగుల సకలసుఖంబు లనుభవించితి. ఇంకను నాచే
నాచరింపఁదగినవియు నితరులచే నాచరింపఁజేయుఁదగినవియు
నుత్కృష్టధర్మము లెవియుండు? నాకుఁ దోఁచినవియు నిత
రులు నేర్పినవియు నిఖిలకార్యంబులు నిర్వహించితి. వీనికంటె
లోకశ్రేష్ఠము లైనసద్ధర్మము లెయ్యవి దేవదేవునిచే నాది
యుగంబునఁ బ్రవర్తింపఁబడెనో తెలియకున్నవి. అద్దేవుని సాక్షా
త్కరించికొనిన నన్నియు విశదంబుగఁ దెలియఁగలవు. కావున

నిమ్మహాకార్యంబున కిప్పుడ పూనువాఁడ" నని మనంబున నిశ్చయించి మునివరుల రావించి యాలోచనంబడిగి, వారందఱు మహాక్రతు వొకం డుపదేశించి దాని ననుష్ఠించిన నీప్సితార్థంబు సిద్ధించునని యానతీయ వల్లెయని యమ్మహాక్రతువు సేయఁ దలపెట్టి వలయుసంభారముల సమకూర్ప నర్హుల నియోగించి బంధువులు మిత్రులు మహారాజులు మున్నగువారికాహ్వానములు పంపించెను.

తదనంతరము నిర్దిష్టశుభవాసరంబున నయ్యజ్ఞం బుఱుక్రాంతమై యథావిధిఁ బరిసమాప్తమైనయవసరంబున నాత్మతేజంబుతో నయ్యధ్వరశాలఁ బ్రకాశింపఁ జేయుచు మహర్షులు, మహారాజులు, పరివేష్టించియుండ నమ్మాంధాతృనిమ్రోల విష్ణుప్రేరితుండై యింద్రుండు విష్ణుసదృశంబైనవేసంబుతో సాక్షాత్కరించుటయు నతం డతని నర్చించెను. అప్పు డయ్యిరువుర కిట్లు సంవాదము జరిగెను.

ఇంద్రుఁడు:- ధార్మికవరిష్ఠ ! నీవు పురాణపురుషుండైనశ్రీమన్నారాయణు నవలోకింపఁగోరినకారణం బేమి ? విశ్వరూపుండైనయయ్యాదిదేవుండు నాకకా దాచతుర్ముఖునకైన దర్శన మొసంగఁడు. నీవు సర్వసముఁడవు, ధర్మపరుఁడవు, జితేంద్రియుండవు, శూరుండవు, నుతింప నుప్వాంగవు, సురలకుఁ బ్రీతిపాత్రుండవు. బుద్ధిశ్రద్ధాభక్తులు తద్దయుం గలవు. కనుక నీయిచ్చవచ్చినవరంబులు వేఁడుము; నే నిచ్చెద.

మాంధాత:- మహాత్మా! భవదనుగ్రహముతోఁ దప్పక యాదిదేవుని దర్శింపఁగలను. కానిండు. నాకుఁ గోరఁ దగిన కామంబులు లేవు. ధర్మంబుపైన కామంబు మెండు. లోకదృష్టం బైనసత్పథంబు (మోక్షము) పొంద నరణ్యము నభిలషించుచున్నాఁడను. అతివిపులంబును, ననేకవిషయంబును నగు క్షాత్రధర్మము నాశ్రయించి యాత్మాయత్త మైనమానవప్రపంచము మద్యశంబు శాశ్వతంబుగాధర్మము తప్పకుండ నిలుపఁ బడినది. దీనికంటె భిన్నముగ లోకశ్రేష్ఠ మైనయేధర్మ మాదిదేవునిచేఁ బ్రవర్తింపఁబడినదో యాచరింతమన్న నది నాకుఁ దెలియకున్నది.

ఇంద్రుఁడు:-ధర్మపరులైనరాజులు - అసైనికులై ధర్మవిషయమున నభినివేశంబు లేక పరాకాష్ఠను బొందఁజాలరు. పొందింపఁజాలరు. ఈక్షాత్రధర్మమే యాదిదేవునిచేఁ బ్రవర్తింపఁబడినది. ఇదియ సర్వోత్తమంబు. తక్కిన ధర్మములెల్ల నశ్వరములు - అనేకములు-వివేకవిలసితములు. అవియన్నియు నీధర్మమునందుఁ జేరియున్నవి. అందువలన నీక్షాత్రధర్మము యుత్తమమైనది. పూర్వకాలమున విష్ణువుచే శత్రుసంహారపూర్వకముగ క్షత్రధర్మక్రియతో సర్వదేవతలు ఋషులు సంరక్షింపఁ బడిరి. అప్పుడీభగవానునిచే శత్రుసంహారము చేయఁ బడకపోయిన బ్రాహ్మణులు ధర్మము మొదలైనవన్నియు నశించిపోయెడివి. బ్రాహ్మణనాశమువలన వర్ణ

ములు వర్ణాశ్రమధర్మములు వినష్టములయ్యెడివి. అప్పటికిని ననేకవిధముల నష్టములైన ధర్మములు క్షాత్రధర్మముచేతఁ బునరుద్ధరింపఁబడి ప్రతియుగమునందుఁ బెంపొందింపఁబడుచు వచ్చినవి. అందువలన క్షాత్రధర్మమే శ్రేష్ఠమని పెద్దలు పల్కుచున్నారు.

క్షత్రియులకు యుద్ధమరణము, సర్వభూతదయాళుత్వము, లోకజ్ఞానము, పాలనము, ముక్తి, ఆర్తరక్షణము క్షాత్రధర్మముననే కల్గుచున్నవి. కామక్రోధావిష్టులు నిర్మర్యాదులు నైనమానవులు రాజునకు భయపడి పాపకార్యములఁ జేయమానెదరు. శిష్టులైనమానవులు నిశ్శంకముగ సర్వధర్మములు చక్కఁగ నిర్వహించికొనెదరు. పార్థివులచే క్షాత్రధర్మము ననుసరించియె పుత్రనిర్విశేషముగఁ బరిపాలింపఁబడినవై సర్వభూతములు మనుచున్నవి. సంశయము లేదు. కావున క్షాత్రధర్మము, సర్వధర్మోత్కృష్టము-లోకశ్రేష్ఠము-సనాతనము - సర్వతోముఖము - శాశ్వతబ్రహ్మప్రాపకము.

ఇట్టి వీర్యవంతమైన క్షాత్రధర్మము మీయట్టియుదారులకు లోకహితముఁగోరి యవశ్యము పాలింపఁదగినది విపర్యయమగునేని ప్రజలకభావంబు సంభవించును. రాజునకు భూసంస్కారము, రాజసంస్కారము, అభైక్షచర్య, ప్రజాపాలనము-ఇయ్యవి యవశ్యానుష్ఠేయములు. ఆహవమరణ మతనికి శ్రేయోవహము. సంగరమున శరీరత్యాగము సర్వశ్రేష్ఠమని పెద్దలు పల్కుదురు. క్షాత్రధర్మప్రవర్తకులు గాన సంగరమృతులు చచ్చియు బ్రతికినవారలె. ప్రియాప్రియములను

వర్జించి చాతుర్వర్ణ్యస్థాపనపాలనములవలనను, ఆయా నియమబద్ధము లైనయోగకల్పనములవలన శ్రేష్ఠమైన సర్వధర్మోపపన్నమైనక్షాత్రధర్మమే క్షత్రియున కాశ్రమవిహితధర్మము. నిర్మర్యాదులై తమతమధర్మములను చరింపక యుద్ధపరతం బశుభూతు లయినమనుష్యులను నీతికిం దెచ్చునదిగాన క్షత్త్రధర్మ మితరాశ్రమ్యధర్మము లకన్న సత్కృత్తమము. బ్రాహ్మణుల కేయేయాశ్రమములం దేయేధర్మము లుక్తములు వాని నాచరించుటయ వారి కుత్తమధర్మము. అట్లాచరింపనిబ్రాహ్మణుండు శూద్రుండట్లు శస్త్రవధ్యుండు. నాల్గాశ్రమధర్మములు వేదధర్మములు బ్రాహ్మణున కవశ్యాచరణీయంబులు. ఎవం డాచరింపండు వాండు సమ్మానమునకుం దగండు. కర్మవలన ధర్మ ముద్ధృతమగును. కర్మిష్ఠుండుగానివిప్రుండవిశ్వసనీయుండు. ఇట్లాయాజాతుల కాయాధర్మములు విహితములు. తదాచారము వారి కుత్తమము. అవి యడంగినప్పుడు క్షత్రియుండు వాని నుద్ధరింపవలయు. అందువలన నాక్షత్రియధర్మము సర్వోత్తమము. అదియె నాకిష్టము. తక్కినవి నాకిష్టములు కావు.

మాంధాత:- యవనులు, కిరాతులు, గాంధారులు, చీనులు, శబరులు, బర్బరులు, శకులు, తుషారులు, కంకులు, పహ్లావులు, ఆంధ్రులు, మద్రకులు, పౌండ్రులు, పులిందులు, ఆరమఠులు, కాంభోజులు నాల్గుజాతులకుం జేరిన వీరందఱు దస్యుజీవనులు. అన్నివిధములం

గపటవర్తనులై మెలఁగుచున్నవారు. ఎట్లుధర్మపరులు కాఁగలరు? మాయట్టివారి కేరీతి శాసింపనగును? దానిఁ దెలియ నిచ్ఛ కలదు. దయయుంచి వచింపుఁడు. మీరు మాకు బంధువులు.

ఇంద్రుఁడు:- అట్టివారలను మొదట జననీజనకులకు, ఆచార్యగురువులకు, ఆశ్రమవాసులకు, రాజులకు శుశ్రూష చేయ నియమించి యవల వేదధర్మక్రియలు విధించి కాలోచితముగాఁ గూప, ప్రపా, శయ్యాదిదానములు ద్విజోద్దేశముగాఁ గావింప నొడిగించి, అహింస, సత్యము, అక్రోధము, దాయపాలనము, భార్యాపుత్రపోషణము, ఆచారము, అద్రోహము, వీనిని శిక్షింపవలయును. దస్యు లందఱిచేతను బ్రాహ్మణులకు పాకయజ్ఞాగముగ ధన మిప్పింపవలయు. అర్హతమవస్తుప్రదానంబు సేయింపవలయును. ఇట్టి విధానములు పూర్వకాలమున విహితములైనవి. రాజా! లోకులకందఱికి విహితకర్మము లవశ్యకర్తవ్యములు.

మాంధాత:- మహాత్మా! మానవలోకమందు సర్వవర్ణములయందు సర్వాశ్రమములందు దస్యులు, అన్యవేషధరులు నెందఱో కన్పించుచున్నారు. ఈస్థితి యెట్లు సంభవించినది?

ఇంద్రుఁడు:-ధరణీశుని దౌరాత్మ్యమువలన దండనీతి వినష్టమై క్షత్రధర్మము నిరాకృతమైనప్పుడు సర్వభూతములు మోహముపొందును. కృతయుగము దూరమైనకాలఁ

దియు భిక్షువేషధారులు పెక్కురుందురు ఆశ్రమము లందు వికల్పము లోదవును. పురాణధర్మశాస్త్రము లను విననొల్లరు. కామక్రోధావిష్టులై యున్మార్గచరు లగుదురు. మహాత్ములచే నెప్పుడు దండనీతి యుద్ధృత మగునో అప్పుడు పాపము నివృత్తమగును. ధర్మము చలింపక నిలుచును. సర్వలోకగురుం డైనరాజు నెవం డవమానించునో వాఁడు చేసినదానము యాగము, శ్రాద్ధము నిష్ఫలములు. ధర్మకాముం డైనధరణీశుని దేవతలునైత మవమానింపఁజాలరు. తొల్లి భగవంతుం డైన సర్వేశ్వరుండు ప్రవృత్తి నివృత్తి ధర్మములను బాలింప క్షత్త్రియు నేర్పఱిచెను. క్షత్త్రియుండు తాదృశధర్మమును ధరించునో యతండు నాకు మాన నీయుండు. అతనియందే క్షత్త్రధర్మము ప్రతిష్ఠితమగును.

ఇట్లు వచించి యతండు దేవగణముతో నంతర్హితుం డగుటయు నాయధ్వగము కరిసమాప్తము కాఁగా నిందున్ని వచనంబులు విమర్శించుకొనుచు నెల్లరు తమనెలవుల కరిగిరి.

—:O:—

# పదునాఱవప్రకరణము.

—:O:—

"సౌఖశాయనికులు జననీజనకులు. వివేకదాయకు లాచార్యులు. కుశలవిచారకులు గురువులు (వృద్ధులు). ధర్మో పదేశకు లాశ్రమవాసులు. రక్షకుఁడు రాజు. ఇట్టి వీరిని

హ్రిమ మనుజుని మానహీనుఁ జేయుదురభిమానాలసత్వ
ములఁ దొలఁగించి సాత్త్వికగుణమ్ము సంపాదించును వైదిక
ధర్మక్రియానుష్ఠానంబు మనోమాలిన్య మడంచి శ్రేయస్సం
ధానంబగు"నని మనంబున యోచించి యమ్మానవనాయకుండు
వెలికి ధార్మికత్వమును బ్రదర్శించుచు లోన దుష్కృత్యములు
సల్పు నీపయాధునికజనులరీతిఁ జౌర్యశీలు రైనపూర్వోక్త
యవనకిరాతాదిజనపదంబుల జనుల నిందోక్తప్రకారంబున
నిచ్చలు నడచుకొనులాగున శాసించి మార్గమువెట్టు
మూలుగుమోతులను శోధించి పట్ట పూర్వశీలంబు పూర్ణాను
స్వారంబగుపఱుచఁ గఠినముగ శిక్షింపనారంభించెను. అదిసుత
యులకుతోఁ జీమలు సైతము చాలుతప్పి చన మానినవనఁ బ్రజ
లమాట వేఱ వచింపవలయునే? అందఱు నగ్గగ్గలాడిపోయిరి.
అనృతవాదులు, ఆచారవిహీనులు, ఆత్మాపహారులు, అహిం
సాదూషకులు, కలుషవర్తనులు, కర్మచండాలురు నెల్లరుఁ బాచి
తంబులఁ బాపపంకంబుఁ బాపికొని పూతాత్ములైరి. 'యథా
రాజా తథా ప్రజా' యనుట దీనికే కల్గియుండవచ్చు. కాకయు
'రాతుకొద్ది గుఱ్ఱ' మనుట మన మెఱింగినదేకదా! భర్త
స్నానమునకు బద్ధకించిన భార్య పాదశుద్ధికే బద్ధకించినట్లు
ప్రభుత్వ మింతసడలినఁ బ్రజలు మఱింత సడలుదురు. ఈ లీల
నానృపాలుండు లోధర్మములకు వెలిధర్మములకుఁ బ్రభుండై
రవంతయుఁ బథముతప్పకుండఁ జూచుచుఁ దులలేని సిరిసంప
దలు దైవారఁ గూర్చి తమ్ముఁ గన్నతండ్రికన్న నినుమిక్కిలిగ
గారవముతోఁ గాపాడుచుండఁ బ్రజలును సకలసుఖంబు లను

భవించుచు నానందపరవశుఁడై యమ్మహనీయుని గుణగణంబులు గానము చేయుటయగాక యనుదినంబును సాయంప్రాతస్సంధ్యలయం దప్పరమాత్మునితో సమముగ నాతని కధికభక్తితో మ్రొక్కులిడిరనిన నబ్బుర మేముండును? ప్రజాశ్రేయంబె తనశ్రేయంబని భావించి యింటిపట్టునఁ గుడిచికూర్చుండక కష్టనిష్ఠురముల గణుతింపక దేశదేశంబులు గ్రుమ్మరుచు నెచట నెవరి కేయది యేవేళఁ గావలసియుండునో మున్న యోచించి యచటి కేఁగి వారి కద్దాని నావేళ నొదిగించు నావ్రతముండైనపోషకునకు మ్రొక్కులిడనికృతఘ్నుఁ డెవఁడైన నుండునా!

అట్లు పూర్ణకాములై ప్రమోదించు ప్రజావళిఁ బరిపూర్ణాంకయైన వసుంధరాదేవిఁ జూచికొనుచు నానందించు నవ్వసుమతీకాంతుండు, తన కట్టిప్రాభవమును బ్రసాదించిన పుండరీకాక్షుని భక్తిపరవశుఁడై పాడుచుండ నాపాటకు మురిసి దేవతలు వెనుకనుండి హంగుచేసిరి. మహర్షులు మెచ్చులు పల్కిరి. మహారాజులు తల లూపిరి. గానలోలుఁడైన యక్కమలనాభుండు కమలాసమేతుఁడై నాట్యంబు సలిపెను. ఆతరుణంబున నెల్లరకుఁ బ్రపంచమంతయు నానందమయమై యగపడెను. ఆయానందానుభవముతో మరల బహుకాల మతిక్రమింపఁ దుదకు మోమొత్తినయమ్మనుజనాయకునకుఁ దీపు తినినవానికిఁ గారము తినఁ గాంక్ష కలిగినట్లు సంగరస్ఫురణకాంక్ష కల్గె నెన్నటికి నాకాంక్ష తీరుసమయంబు సంప్రాప్తముగాకుండఁగ నొక్కనాఁ డతం డేకాంతమున- " స్వర్గమర్త్యపాతాళ భువనములకుఁ బ్రభుఁడు పురందరుండు. ఆయనతో దురంబు

నకుఁ దొడరిన జయముకల్గినను బరాజయము కల్గినను రెంట లెస్స యగు. కావునఁ బురుకుత్సునకుఁ బట్టంబుఁగట్టి యమరేశునితో సమరంబుచేయఁ జనువాఁడ" నని నిశ్చయించికొని దాని మఱునాఁటి కొలువుకూటమ్మునఁ బ్రకటించి యందుకు వారి సయ్యకొల్పి బుధజనోపదిష్టశుభముహూర్తంబున నగ్రినందనునకుఁ బట్టాభిషేకంబుచేసి యవల నొకనాఁ డమరపురి కరుగ నిశ్చయించి యన్నితెఱగుల నఖిలజనసంతర్పణమ్ము గావించి యాలుబిడ్డలకు నీతులు తెల్పి వలయు సాధనసామగ్రిఁ గొని మితపరివారముతో వెడలువాఁడై తన్ననుపవచ్చినబంధుమిత్రమంత్రిసామంతపౌరముఖ్యులనిష్టశంకతో మనములు బెగడుపడఁ గరచేలంబులతోఁ గన్నుఁగొలఁకులు ముకుపుటంబులు తుడిచికొనుచు మోములరవాంచి తేజంబుతరిగియుండఁ గని యపుడు తన్మనస్సమాధానముగ నిట్లు వచించెను.

“ఇదివఱ కెన్నండు నధీరత నెఱుంగనిమీ రిప్పు డిట్లధీరులై యుండనేల ? ఈపయనం బనిష్టదాయకం బనితోఁచెనా? కానిండు. దాన నేది కొఱవడును? సూక్ష్మచిదచిద్విశిష్టం బైన బ్రహ్మపదార్థం బొకండుతక్క మఱేదియు శాశ్వతంబు కాదు. ప్రకృతి పరిణామశీలంబు. పుట్టినదాది నేఁటి వఱకు నెన్నియో కష్టములు కుడిచినారము. సుఖము లనుభవించితిమి. వంతుప్రకార మన్నియు ముగిసినవి. మఱియుఁ దినినవానినే తినుచున్నారము. వినినవానినే వినుచున్నారము. చూచినవానినే చూచుచున్నారము. క్రొత్త

లెవ్వియుఁ గలుగవు. ఇంత కేమిఫలము ఘటిల్లినది? ఇఁకముం దేఫలము ఘటిల్లును? ప్రతివ్యక్తికి నెన్నటికైన విశ్రాంతి యనునది సహజముగ నుండును. ఆవరణ మతిశయించిన కొలఁది ప్రదీపంబునకుఁ బ్రభాపటలంబు పెంపొందినట్టు లను భవనీయపదార్థసంభవ మతిశయించినకొలఁదియు నాత్మవ్యక్తి కిచ్ఛాగుణంబ సహస్రగుణంబు లతిశయించును. దానితో సంసారబంధంబు మఱింత బిగువెక్కుచుండును. ఆబిగువు హెచ్చినకొల్లదుఃఖములు పెల్లురేగు. ఇట్లనంతదుఃఖకారణం బైన యాత్మీయేచ్ఛాగుణంబు పొడవడంచి బంధవిముక్తిఁ బొందఁ బూనుట వివేకవంతులలక్షణము. నాకుఁ జావుపుట్టువులు రెండును సమానములు. ఇందుఁ జింతింపఁదగిన యంశ మావంతయుఁ గన్పడదు. చావుపుట్టువులు, జీర్ణనూత్నవస్త్ర త్యాగధారణములఁ బోలినవి. అది యట్లుండనిండు. పుట్టినం దుకుఁ గర్తవ్యములనెల్లఁ గడముట్టఁ గావించినారము. అవశిష్టము లెవ్వియుఁ గలుగవు. మామనుగడయు ముగియవచ్చినది. ఇంక మాయెడఁ గల్గుమమకారంబు మత్ప్రతిబింబముల (కుమారుల) వంకకుఁ ద్రిప్పి వారును మీరు పాలు నీరునట్లరమరిక లేక యేకీభవించి యితోధికసుఖంబులఁ బెంపొందుఁడు. మాకు నిదే తుదియని చెప్పనెట్లు? మఱియు మీతో నితోధికవైభవం బనుభవించుభాగ్యము కలదేమో? ఎవరెఱుంగుదురు? కనుక ధైర్యమూని సంతసముతో మావీడ్కోలున కియ్యకొనుఁడు. ఆజగద్భద్రానుసంధాయి సర్వతోభద్రంబుగ మిమ్మెల్లర మనుచుఁగాక" యని వచింప వారె

ల్లరు నొకింతసమాహితచిత్తులై 'సమీచీన'మని పల్కిరి. అంత వాధీయుండు విశ్వవ్యాపృతాత్మీయవిజ్ఞానకల్పపాదపమహా ఫలంబై యొప్పువ్యోమయానంబు సజ్జితంబైన దాని నధిరోహించి తదీయపక్షమూలములు కంచుగీచినట్లు "కీ"యని శబ్దించుచుండ యథేచ్ఛంజనెను. మోహపాశంబులు ధీరజనచిత్తాశ్వములఁ ద్రిప్పఁజాలవు.

అక్కడ నయ్యమరేశుఁ డిమ్మహీశునాగమనంబునకుఁ గారణంబు మున్న యెఱిఁగి "ఇతండు మన కజేయుండు, భూలోకంబున లవణాసురుండు సురల కజేయుండై యడరుచుండె. వానిఁ బరిమార్చి యవల రమ్మని చెప్పిపంపిన నిప్పటి కీయెడ పడుగును. ఇరువురిలో నెవరు కూలినను మేలె యగు" నని మనంబున నాలోచించుకొని మఱునాఁ డుదయంబున నందన వనభవనంబున నిలిచి యున్నయుర్వీశశిరోమణినికటంబునకుఁ జని సత్కృతుండై మెల్లగ నవ్వుచు నతనితో నిట్లనెను.

"మహీశా! మున్నుగ భూమిశాత్రవుల నెల్ల జయించి గదా మమ్ము జయింపరావలయు! మీ కజయ్యుఁడై యమ్మధుపుత్రకుండు లవణాసురుఁడుండ వానిఁ దెగటార్ప కిటేలవచ్చితిరి?" అనుటయు నతండు కనుఁదమ్ములు విరియ - నేమీ భూతలమున లవణాసురుఁడనువాఁ డొకఁ డుండెనా! ఇదివఱకా పలుకు మావీనుల సోఁకదే! అట్లయిన వాని జయించియ యిట కరుదెంచువాఁడను. అదివఱకు సుఖం బుండుఁ' డని సురేంద్రమర్మంబు బయలుపడఁ బలికి యతండు తనమందిరమున కరుగఁ దాను మగిడి భూలోకంబునకుఁ జనుదెంచెను.

అక్కాలంబున యమునాతరంగిణికిఁ బశ్చిమతీరంబున హతావశిష్టమైనసువిశాలదుర్గమారణ్యం బొకండు కలదు. అందు మధుం డనుదైత్యుండు తనపేర నొకపురము నిర్మించి కొని వాసముచేయుచుండెను. వాఁడు బహుకాలం బతి ఘోరనిష్ఠతోఁ శూలపాణినిగుఱించి తపంబొనర్చి యామా లదైవంబు ప్రత్యక్షమగుడు నతని నతిభక్తితోఁ స్తుతించెను. ఆతం డాస్తుతివచనంబుల కెంతయు హర్షించి యాభక్తు నకు నిజశూలంబువలన నుద్భవించిన మఱియొక శూలంబు చేతికిచ్చి "యిది నీశత్రువులఁ దునుమాడి తిరిగి నీవద్దకు రాఁగలదు. నీవు ధర్మము తప్పినపుడు మ మ్మిది చేరఁగల"దని వానితోఁ బలికెను. అందు కాదైత్యుఁడు దేవా! యీశూలంబు మాకులంబు భువిఁగలంతకాలం బనువర్తించున ట్లనుగ్రహింపుఁ డీయని వేఁడ నతం డట్లు కాదు, నీవెనుక నీకొమరుం డొక్కఁ డుమాత్రము దీని నూనువాఁడు. దీని ధరించినప్పుడుమాత్రము వాఁడు సురాసురుల కజయ్యుఁడై యుండును. దానిని ధరింప మఱచిన వైరిచే హతుండగు. అప్పు డాశూలంబు మాశూలం బున వచ్చి కలియును. ఇట్లానతిచ్చి యంతర్హితుం డయ్యెను. ఈరాత్రించరునకు రావణునిచెలియలు కుంభీనసియందు లవ ణుం డనకొమరుండు కలిగెను. ఇమ్మధుదైత్యుఁ డీపాటిశూ లంబు సంపాదించియుఁ దన్నుఁ బాయుననుభీతితో దేవమాన వులఁ బొరిగొను నధర్మంబునకుఁ బూనక యొరుల కెఱుకపడ కుండ జీవించుచుఁ గొనకు దానిని గొమరునికైవసమొనర్చి చనిపోయెను. ఆదైత్యకిశోర మదిమొదలు దానిని విడువక

కేలఁబూని యొరులకంటఁ దాను దనకంట నొరులం బడకుండ వన్యమృగాళితోఁ బొట్టనింపుకొనుచుఁ దనయడవి దాఁటిచనక మృగసమంబుగ మెలఁగుచుండెను. కారణమున నేలబీఁదివారి కింతవఱకు వానియునికిమునుకులు తెలియకుండఁగ నింగిఁ దిరుగునయ్యెంద్రనుమాత్రము తెలియవచ్చినవి. ఈ రాక్షస శూలపాణి స్మరగాకు వచ్చినప్పుడెల్లఁ దనపై నెన్నఁడెత్తి వచ్చునోయని భీతిలునవ్వజ్రపాణి యిమ్మాంధాతృనిమూల మునఁదద్భీతిఁదొలఁగించుకొననెంచి యాతనికడ నట్లు వచించెను.

అజనవాథుం డాపల్కులు విని 'మనంబునఁ గ్రొర్వమెలుఁగనినాఁగ్రజలనదుమ పాపాహారం బైనయాలవణాసురకౄరమృగం బున్నయెడల నెన్నటికైనఁ జేటు తేకపోదు. కావున మొదట దానిఁ గనుఁగొని తెగటార్చి తరువాత నిటకుఁ రావలయునని నిశ్చయించికొని యిందున్న కట్లు ప్రత్యుత్తరమొసంగి యటనుండి హెచ్చినయాగ్రహముతో వెడలి వాని యునికిమునుకులు తెలియునందునఁ గొండలు, గుహలు, అటవులు శోధించుచువచ్చి యెందును నాయసురునిపొలకువ గానక తుదకు హిమాలయంబుఁ గడచివచ్చుచు యమునాతరఁగిణీ పశ్చిమతీర మానుకొనియున్న పేరుటడవి చూచి వాఁ డిందు డాగియుండవచ్చునని యెంచి యచట నిలిచి యయ్యరణ్యంబు ఛేదింప భటాళికి ముదలయిచ్చి వారు నతిరభసముతోఁ గోలాహాలమ్మొనసేయుచు ఛేదించి చిచ్చువెట్టుచు రాఁగ నందగ్ధభాగంబు రిక్తప్రదేశమగుటయు మఱుఁగడంగి మధుపురి నేత్రగోచరంబయ్యె.

అంతఁ దద్భటనికరము హర్షమొసఁగఁ జని యత్తైలాంగునృపమౌళి విన్నవింప నతండు సేనాసహితుండై తత్పురంబుదరి విడిసి దుందుభి మ్రోయించి సింహనాదంబు సేసె. ఆయులివృసకుఁ గడుపార మెక్కి నుత్తల్లిపడుండిన యాలవణుం డదరిపడి లేచి యనుచరులఁ బంపి వారు తద్విధంబు తెలిసి వచ్చి విన్నవింప మండిపడి శూలంబు కేలం బూని కన్నులు నిప్పుకలు గురియ పదాఘాతంబులకుఁ బుడమి వడంక రోషభీషణుండై వచ్చి యెదుట నున్నసైనికుల మర్దింపఁదొడఁగెను. అప్పు డానృపాలుండు తనవామభుజం బదురుటయు నపసవ్యంబుగ వాయువులు వీఁచుటయు నక్కలు కూయుటయు మున్నగు నపలక్షణంబులు గన్పట్ట నెన్నఁడు నపలక్షణశబ్దంబు నెఱుంగని నా కీయపలక్షణమ్ములు లేల కల్గవలయునని మనంబున శంకించి కానిమ్ము కానున్నది కాక మానదు. అట్టు లేల? అని చెదరినమనంబు పదిలపఱచుకొని సైనికుల నుఱుకాడు వానిఁ జక్కఁ జీఱి నిల్వుమని పదివాఁడియమ్ముల మేన నాటఁజేసెను. అశనిఘాతముల ట్లుండు నాతనిశరాఘాతములకు వ్రేటుఁదినిన వ్యాళంబువడువున రక్కసుండు నిలువెత్తున నెగిరి కటిసుఱయుకలకుశూలంబుఁ బెరికి కసిదీఱ నరిపై విసరెను. అదియు భీకరజ్వాలలతో దిక్కులు వెలిఁగించుచుఁ గడునురవడిఁ బఱతెంచి యుప్రైజాతల్పకముపైఁ గవియ భూమి గిర్గిరన్ దిరిగె; సముద్రములు శోషిల్లె; అగ్నులు సుడివడియె; దిక్కులు ధూమావృతము లయ్యె; వాయువులు పాంసులము లయ్యెను; దేవతలు హాహాకారములు సేయుచు దిక్కుతెలియక దేవదే

వునిగుఱుంగుంజొచ్చిరి. వారిగతి యట్లుండ మనవారిగతి మఱి విచారి పవలయునా !

తరుత్తరక్షణంబున లవణుండు ప్రాణపూర్ణం బైన నిజాగ్రిభాగంబు భస్మపటలావృతం బై యుండఁ గాంచి సంతసించి తనయాగ్రిథమువిజయోదంతము ననుచరులకు వింతగాఁ దెల్పుచు నచటు వాసి చనెను. సాధుసంరక్షకుం డైనచక్రివర్తి పైఁ బఱచుతఱి నాశూలం బచేతనంబుగానఁ దగవు తలంపదుగాక. సచేతనుం డైనయాదిగంబరుం డీశూలంబు నసురవశంబు గావించుచు నిజాధికారంబు దుర్వినియోగంబు చేయునెడ నించుకేని దగవు తలంచెనా? తమోగుణులకుఁ దగవు తెలియు టెట్లు?

తరువాత నీదృశదైవదురాచరణంబునకు దురపిల్లుచుఁ బ్రజలు మూఁడురోజు లేకంబుగ నన్నపానీయములు మాని ముక్తకంఠముగ వాపోయిరి. పశుపక్షిగణంబులుకూడఁ బానీయంబును ముట్టలేదనుట చోద్యముకాదు.

కుటుంబములకుఁ బెద్దదిక్కు, కూటములకుఁ దలకట్టు, గ్రామములకుఁ బెద్ద, గోష్ఠులకుఁ బ్రియవాది, పరిషత్తులకుఁ బ్రాణము, విద్యాలయములకుఁ బ్రధానాధ్యాపకుఁడు, గ్రంథాలయములకు మూలస్తంభము, కార్మికులకుఁ బుష్టి, కృషికులకు సహకారి, వాణిజ్యమునకు విశ్వాసము, శిల్పులకుఁ జేదోడు, సమితులకుఁ బోషకుఁడు, సంస్కర్తలకు నీడ, సంపన్నులకు నైదోడు, ఆపన్నుల కాపుఁడు, దీనులకుఁ గల్పకము- ఈరీతి నెల్లరకుఁ బోరానిచుట్ట మైనపురుషోత్తమునిమరణ మేరికి దుఃఖావహము కాదు?

తదనంతరము తత్పుత్రులు పురుకుత్సాంబరీషముచికుందులు మూవురు తండ్రిని మఱచులాగునఁ దమ్ముఁ దగినచందమునఁ బాలించుచున్నను బ్రజ లమ్మహానీయుని మఱవలేదు.

బ్రాహ్మణులకుఁ బ్రియశిష్యుఁడు, క్షత్రియులకుఁ జేదోడు, వణిజులకు వాదోడు, శూద్రులకు నైదోడునై నెగడిన యాభూలోకకల్పపాదపము నేఁటికిని వాఙ్మయాదర్శగతంబై మనకుఁ బ్రత్యక్షముగఁ గన్పట్టుచుండ వారి కేరీతి మఱవనగును ?

" స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు "

శ్రీమదాసూరిసముద్ఘాటక తిరుమలవాస్తవ్య కొండూరు
గ్రామప్రతీత పంచాంగాన్వర్థనామధేయ హారీత
కులతిలక కృష్ణమాచార్యతనూభవ వోభ
యభాషాప్రవీణ వేంకటాచార్యవిర
చితంబైనమాంధాతృచరిత్రంబు
సర్వంబు సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

